☎ : 044-27222115
Fax : 044-27224305, 372090060
Email :-skmkanci@md3vsnl.netin

ఉ

Sri Chandramouleeswaraya Namaha:
Sri Sankara Bhaghavadpadacharya Paramparagatha Moolamnaya Sarvagnapeeta :

His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi

# JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL

Srimatam Samsthanam

No. 1, Salai Street, Kanchipuram - 631 502.

యాత్రాస్థానం –కాంచీపురం
తిథి: శ్రావణ శుద్ధ చతుర్దశి (మన్మథ)



## శ్రీముఖమ్

వేదమున విధించబడిన నిత్యశ్రౌతస్మార్తాది సకల సత్కర్మానుష్ఠానములకు తగిన కాలము నిర్ణయించుట జ్యోతిశ్శాస్త్రపు ముఖ్యప్రయోజనము. జటిల గణిత సాధ్యమైన తిథివార నక్షత్ర యోగకరణాదుల నిర్ణయము బహుప్రాచీన కాలము నుండి అట్టి గణనమునందు నిష్ణాతులైన మనపంచాంగకర్తలు చేయుచూ వచ్చుచున్నారు. కాగా కొన్ని పంచాంగములందు గ్రహణాది ప్రత్యక్ష గోచరములు కూడా తప్పిపోయెడి పొరపాట్లు దొర్లుచున్నవి. ఇట్టి ప్రమాదములను పరిహరించుటకు, తగునిర్ణయములు తీసుకొనుటకు దోహదముగా **శ్రీమఠం** పరాపర గురువుల కాలము నుండి **పంచాంగ పండిత సదస్సులు** నిర్వహించుచున్నది. ఈసంవత్సరము కూడా ఆగస్ట్ 11 వ తారీఖునుండి మూడుదినములు ఈ సదస్సు జరిగినది.

గత మూడు సంవత్సరములుగా ఈసదస్సుకు వచ్చి చర్చలలో ప్రధాన భూమికను నిర్వహిస్తున్న **శ్రీ దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి గారు 2008** నుండి **శ్రీకంచి కామకోటి పీఠ పరిపాలిత కాలనిర్ణయ పంచాంగమును** వెలువరించుచున్నారు. ఇందలి నిర్ణయములన్నియూ శ్రీమఠమునందు నిర్వహింపబడు పంచాంగ పండిత సదస్సు నందు ఆమోదింపబడినవిగా ఉండును.

దుర్ముఖి నామ సంవత్సరమునకు కూడా ఇదేవిధముగా పంచాంగము వెలువరింపబోవుచున్నారని తెలుసుకొని ఎంతయో సంతసించినాము.

ఆస్తికులందరూ ఈ పంచాంగమును తమ అనుష్ఠానములలో ఉపయోగించుకుని ఫలితములను పరిపూర్ణముగా పొందగలరు గాక యనియు, పంచాంగకర్తకు సకలశ్రేయోభివృద్ధి కలుగగలదనియు నారాయణస్మృతి పూర్వకముగా ఆశీర్వదించుచున్నాము.



నారాయణస్మృతిః

# సంపూర్ణ సూర్య గ్రహణ నిర్ణయము- 09-03-2016 బుధ వారం

గ్రహణ స్పర్శ, గ్రహణ మోక్ష కాలములు భారతదేశమందు కొన్ని కనిపించకపోయిననూ గ్రహణ మధ్యకాలము భారతదేశమందు కనిపించుటవలన గ్రహణ నియమములు తప్పక పాటించవలయును. ఈ సూర్యగ్రహణము సంపూర్ణ సూర్యగ్రహణమైనప్పటికీ భారతదేశమందు పాక్షికముగా కొద్ది సమయమే కనిపించును. అయిననూ ప్రారంభ సమయము నుండి అంత్య సమయము వరకూ నియమములు పాటించవలయును. గ్రహణ స్పర్శ, గ్రహణ మధ్య, గ్రహణ మోక్ష కాలములలో ఏ ఒక్కకాలమైనా (దృశ్యమైనప్పుడు) కనిపించినప్పుడు తప్పనిసరిగా గ్రహణనియమములు గ్రహణ ప్రారంభము నుండి పాటించవలయును.

**స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ ౩౦ బుధవారం దివి. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.**

| | ఐ.యస్.టి. |
|---|---|
| పాక్షిక సూర్యగ్రహణ స్పర్శాకాలం ప్రారంభం | ఉ॥ 4-49 ని॥ 02 సె.కు |
| సంపూర్ణ సూర్యగ్రహణ స్పర్శాకాలం ప్రారంభం | ఉ॥ 5-47 ని॥ 18 సె.కు |
| సంపూర్ణ సూర్యగ్రహణ మధ్యకాలం | ఉ॥ 7-27 ని॥ 29 సె.కు |
| సంపూర్ణ సూర్యగ్రహణ అంత్యకాలం | ఉ॥ 9-07 ని॥ 52 సె.కు |
| పాక్షిక సూర్యగ్రహణ అంత్యకాలం | ఉ॥ 10-05 ని॥ 42 సె.కు |
| "సూర్యగ్రహణ పుణ్యకాలం | 5 గం॥ - 16 ని॥ 40 సె.లు" |

**గ్రహణము కనిపించు ప్రాంతములు :- ఈ గ్రహణం తూర్పు, ఆగ్నేయ ఆసియాతో పాటు భారతదేశములో మరియూ థాయిలాండ్ , ఇండోనేషియా, సౌత్ కొరియా, జపాన్, ఆస్ట్రేలియా, ఉత్తర పసిఫిక్ సముద్ర ప్రాంతములలో చూడవచ్చును.**

**సంపూర్ణ సూర్య గ్రహణము ఇండోనేషియా, సుమిత్రా, బోర్నియా, ఉత్తర పసిఫిక్ సముద్ర ప్రాంతములలో కనిపించును. పాక్షికసూర్యగ్రహణము భారతదేశములో కనిపించును.**

ఫలం :- ఈ గ్రహణం పూర్వాభాద్ర నక్షత్రం రెండవ పాదముయందు సంభవించుటచే పూర్వాభాద్ర, పునర్వసు, విశాఖ నక్షత్రముల వారు, కుంభ, మీన రాశి వారు ఈ గ్రహణం చూడరాదు.

శ్లో॥ కుంభోపరాగే పీడ్యంతే గిరిజాః పశ్చిమాజనాః !!

ఈ గ్రహణం మాఘ మాసమందు కుంభరాశిలో గురు నక్షత్రములో వచ్చుట వలన అదే సమయమందు సప్తమమైన సింహరాశిలో గురుచండాలయోగము ఉండుటవలన, గ్రహణరాశిలో పంచగ్రహకూటమి వలన పర్వత ప్రాంతీయులకు, పశ్చిమ కనుమ ప్రాంతీయులకు, రోగభయములు, దొంగలభయములు పెరుగుట, కవులకు, రచయితలకు, గాయకులకు, నటులకు, ప్రముఖ ప్రజా పరిపాలకులకు ఆరోగ్య భంగములు, ధననష్టములు జరుగుట, రస, ధాతు వస్తువులకు ధరలధికమగును. మతవాదములు పెరుగును.

నిత్యభోజన ప్రత్యాబ్దికముల విషయము :

నిత్య భోజన ప్రత్యాబ్దికాదులు గ్రహణము తరువాత ఏర్పరుచుకోవలయును. సాధకులు, మంత్రోపాసకులు ముందురోజు నుండి ఉపవాస దీక్షతో ఉండవలయును. దేవాలయములు ముందురోజు సా॥ 7-00 గం॥ నుండి మూసిఉంచి గ్రహణ అనంతరం శుద్ధి చేసి దేవాలయములు తెరువవలయును.

**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**
జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు
**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# సంపూర్ణ సూర్య గ్రహణ నిర్ణయము- 09-03-2016 బుధ వారం

స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ ౩౦ బుధవారం దివి. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.

ఫలం :- ఈ గ్రహణం పూర్వాభాద్ర నక్షత్రం రెండవ పాదముయందు సంభవించుటచే పూర్వాభాద్ర, పునర్వసు, విశాఖ నక్షత్రముల వారు, కుంభ, మీన రాశి వారు ఈ గ్రహణం చూడరాదు.

పూర్వాభాద్ర, పునర్వసు, విశాఖ నక్షత్రముల కుంభరాశి , మిథున రాశి, తులా రాశివారికి దోషము.

శ్లో॥ కుంభోపరాగే పీడ్యంతే గిరిజాః పశ్చిమాజనాః !!

ఈ గ్రహణం మాఘ మాసమందు కుంభరాశిలో గురు నక్షత్రములో వచ్చుట వలన అదే సమయమందు సప్తమమైన సింహరాశిలో గురుచండాలయోగము ఉండుటవలన, గ్రహణరాశిలో పంచగ్రహకూటమి వలన పర్వత ప్రాంతీయులకు, పశ్చిమ కనుమ ప్రాంతీయులకు, రోగభయములు, దొంగలభయములు పెరుగుట, కవులకు, రచయితలకు, గాయకులకు, నటులకు, ప్రముఖ ప్రజా పరిపాలకులకు ఆరోగ్య భంగములు, ధననష్టములు జరుగుట, రస, ధాతు వస్తువులకు ధరలధికమగు ను. మతవాదములు పెరుగును.

దోష శాన్తి కై గ్రహణము పూర్తి అయిన తరువాత ఆరోజు పూర్తిగా ఉపవాసముంటే అదేరోజు లేదా తెల్లవారిన తరువాత ఉదయము ఎటువంటి ఆహారము తీసుకోకుండా కింది వాటిలో ఏ ఒక్కవిధానము పాటించినా సంపూర్ణముగా దోషనివృత్తి కలుగును.

అన్నింటినీ పాటించిన వారికి "అధికస్య అధికం ఫలం"

మమ "(కుంభరాశివారు వారు) జన్మ నక్షత్ర, జన్మ రాశి"

"(మిథున రాశివారు వారు) కర్మ నక్షత్ర భాగ్య రాశి"

"(తులారాశి వారు) అనుజన్మ నక్షత్ర, పంచమ రాశి"

స్థాన కేతుగ్రస్త సంపూర్ణ సంపూర్ణ సూర్యగ్రహణ సంభవిత సంపూర్ణ దోష నివృత్యర్థం యధాశక్తి కల్పోక్త ప్రకారేణ బింబదానం కరిష్యే ! అని సంకల్పించి



శ్లో॥ తమోమయ మహాభీమ సోమసూర్య విమర్దన !
హేమతారా (రజిత బింబ ప్రదానేన) ప్రదానేన మమ శాన్తి ప్రదోభవ !!

శ్లో॥ విధుంతుద నమస్తుభ్యం సింహికానందనాచ్యుత !
దానేనానేన నాగస్య రక్షమాం వేధజాద్భయాత్ !!

శ్లో॥ సింహికేయ మహావీర సోమసూర్య నిరోధక !
మద్రాశి జనితం శూల పాపమాశు వినాశయ !!

అను మంత్రముచే (సూర్యగ్రహణమునకు బంగారము) చంద్రగ్రహణమునకు వెండి లోహములతో (శక్తి లేనిచో రాగిలోహముతో) తయారుచేసిన రవి,చంద్ర, నాగ ప్రతిమలను నెయ్యి, నువ్వులు, బియ్యం, తెలుపు, నీలి వస్త్రములు, ఇత్తడి పాత్ర, దక్షిణ సహితముగా బ్రాహ్మణునికి దానమివ్వవలయును. తద్వారా దోషనివృత్తి కలుగును. పై విధముగా చేయు అవకాశము లేనివారు పారే నదియందు కొబ్బరిబోండము & రాగి లోహము & తెల్లని వస్త్రములను స్వయముగా సభక్తికముగా వేయవలయును. తద్వారా దోషనివృత్తి కలుగును. పై విధముగా చేయు అవకాశము లేనివారు ఆర్ద్రా, స్వాతి, శతతార నక్షత్రములలో జన్మించిన వారికి లేదా స, శ, త, ర అనే అక్షరములతో పేరు ప్రారంభమైన వారికెవరికైనా వారిచేతులతో స్వయముగా అన్నము పెట్టడము వలన దోషనివృత్తి కలుగును. పై విధముగా చేయు అవకాశము లేనివారు పేదలకు వారిచేతులతో స్వయముగా తీపి పదార్థము & అన్నము పెట్టడము వలన దోషనివృత్తి కలుగును. ఈ విధముగా కూడా చేయు అవకాశము లేనివారు ఉసిరిక వృక్షమును & రావి వృక్షమును నాటడము స్వయముగా సభక్తికముగా చేయవలయును. తద్వారా దోషనివృత్తి కలుగును.


**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# ఆంధ్రప్రదేశ్ & తెలంగాణ ప్రాంతముల యందు సూర్య గ్రహణ నిర్ణయము

గ్రహణ స్పర్శ, గ్రహణ మధ్య, గ్రహణ మోక్ష కాలములలో ఏ ఒక్కకాలమైనా (దృశ్యమైనప్పుడు) కనిపించినప్పుడు (ఒక్కనిమిషము గ్రహణము కనపడినా) తప్పనిసరిగా గ్రహణ నియమములు గ్రహణ ప్రారంభము నుండి మోక్షకాలము వరకూ పాటించవలయును. భారత దేశమందు మాత్రము "పాక్షిక దర్శనమే" జరుగును.

**స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ 30 బుధవారం దివి. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.**

గ్రహణ ప్రారంభకాలము ఉ॥4 గంటల 49 నిమిషముల 02 సెకన్లకు.

గ్రహణ మోక్షకాలము ఉ॥10 గంటల 05 నిమిషముల 42 సెకన్లకు.



| జిల్లా | ప్రధాన ప్రాంతము | సూర్యోదయం | గ్రహణము కనిపించు సమయం | సూర్యోదయం నుండి ప్రాంతీయంగా గ్రహణం కనబడు చివరి సమయం |
|---|---|---|---|---|
| Anantapur | Anantapur | 6:31 AM | 16 Mins 30 Secs | 6:48 AM |
| Chittoor | Tirupati | 6:23 AM | 24 Mins 16 Secs | 6:48 AM |
| East Godavari | Kakinada | 6:13 AM | 35 Mins 12 Secs | 6:49 AM |
| Guntur | Guntur | 6:20 AM | 27 Mins 54 Secs | 6:48 AM |
| Kadapa | Kadapa | 6:26 AM | 21 Min 35 Secs | 6:48 AM |
| Krishna | Machilipatnam | 6:17 AM | 30 Mins 50 Secs | 6:48 AM |
| | VIJAYAWADA | 6:19 AM | 28 Mins 32 Secs | 6:48 AM |
| Karnool | Karnool | 6:30 AM | 18 Mins 16 Secs | 6:48 AM |
| Prakasam | Ongole | 6:21 AM | 26 Mins 28 Secs | 6:48 AM |
| Nellore | Nellore | 6:22 AM | 26 Mins 26 Secs | 6:48 AM |
| Srikakulam | Srikakulam | 6:07 AM | 41 Mins 58 Secs | 6:49 AM |
| Vishakhapatnam | Vishakhapatnam | 6:09 AM | 39 Mins 36 Secs | 6:49 AM |
| Vizianagaram | Vizianagaram | 6:09 AM | 39 Mins 56 Secs | 6:49 AM |
| West Godavari | Eluru | 6:18 AM | 30 Mins 31 Secs | 6:48 AM |
| Adilabad | Adilabad | 6:29 AM | 18 Mins 40 Secs | 6:47 AM |
| Hyderabad | Hyderabad | 6:29 AM | 19 Min 18 Secs | 6:48 AM |
| Karimnagar | Karimnagar | 6:26 AM | 21 Mins 43 Secs | 6:48 AM |
| Khammam | Khammam | 6:22 AM | 25 Mins 32 Secs | 6:48 AM |
| Mahbubnagar | Mahabubnagar | 6:30 AM | 18 Mins 12 Secs | 6:48 AM |
| Medak | Sangareddi | 6:30 AM | 17 Mins 38 Secs | 6:48 AM |
| Nalgonda | Nalgonda | 6:25 AM | 22 Mins 42 Secs | 6:48 AM |
| Nizamabad | Nizamabad | 6:30 AM | 17 Mins 22 Secs | 6:48 AM |
| Rangareddy | Malkajgiri | 6:28 AM | 19 Mins 30 Secs | 6:48 AM |
| Warangal | Warangal | 6:24 AM | 23 Mins 41 Secs | 6:48 AM |

**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# గ్రహణ సమయ నియమాదులు

అమావాస్య పాడ్యమి తిథుల సంధియందు **సూర్యగ్రహణం,** పౌర్ణమి పాడ్యమి తిథుల సంధియందు **చంద్రగ్రహణం** సంభవించును. రాత్రియందు సూర్యగ్రహణం పగటి చంద్రగ్రహణం ఆచరణ యోగ్యం కానిది. **మేఘాచ్ఛాదితమై కనిపించకున్ననూ ఆచరణ యోగ్యమే. సందేహం కల్గిన శాస్త్రమును సరిచూసుకొని ఆచరించవలయును. సర్వేషామేవ వర్ణానాం సూతకం రాహుదర్శనే। తావదేవ తతశ్శుద్ధిర్యావన్ముక్తిర్నవిద్యతే ॥** గ్రహణములు కల్గునపుడు సర్వవర్ణులకు సూతకం కలుగును. కనుక స్పర్శ ప్రారంభమునకు స్నానంచేసి ముక్తికాలం పూర్తికాగానే ముక్తిస్నానం చేయవలయును. ఈ గ్రహణ సమయమున వండిన పదార్థములు జలం, చల్ల పెరుగు పాలు భక్ష్య వస్తువులు వర్జనీయం, తిలలు ధర్భలు, వాటియందు ఉంచిన దోషం లేదు. సూర్య చంద్రగ్రహణములు ఎంత కాలమో చాక్షుష దర్శనం ఎప్పుడవునో అదియే మోక్షకాలం. **మేఘాది ప్రతిబంధకం కల్గినప్పుడు శాస్త్రమును ఆశ్రయించవలయును. సూర్యగ్రహణమునకు 4 యామములు చంద్ర గ్రహణమున 3 యామములయందు నుండి భుజింపకూడదు. (1 యామము- 3గంటలు)** శ్రాద్ధం నిత్యనైమిత్తికములలో సాయంత్రం రాత్రి సమయాలలో పెట్టకూడదు. కాని గ్రహణ సమయంలో హిరణ్య శ్రాద్ధము నిర్వర్తించవచ్చును.



**శ్లో॥ గ్రస్యమానే భవేత్స్నానం గ్రస్తే హోమోర్క చంద్రయోః !**
**మండలే ముచ్యమానేతు దానం ముక్తౌతు మజ్జనం !!**

గ్రహణస్పర్శా సమయంలో స్నానం, జపం, మధ్యకాలంలో హోమం, దేవతార్చనం, శ్రాద్ధం విడుచుచుండగా బ్రాహ్మణపూజ దానాదులు ముక్తిస్నానం చేయుట ద్వారా అనంతకోటి ఫలితం పొందుదురు. గ్రహణ కాలంలో హిరణ్య శ్రాద్ధం చేయవలయును. శక్తి లేని పక్షములో అఖరికి తర్పణాదులు విడిచినను అనంతమైన పుణ్యప్రదం, గ్రహణ కాలమున మంత్రోపాసకులు బ్రహ్మోపదేశం తీసుకొన్నవారు, గాయత్రీ మంత్ర ఉపాసకులు తత్తన్మంత్రములను యధాశక్తిగా జపాదులు చేయవలయును. లేనిచో మంత్రమాలిన్య దోషము కలుగును. **దోష నివృత్తికి రాహు/కేతు గ్రస్త సోమా/సూర్యోపరాగ సమయే మంత్రమాలిన్య దోష నివృత్యర్థం యధాశక్తి (ఉపాసన) మంత్ర జపం కరిష్యే !.** అని సంకల్పించి జపం చేయవలయును.

**ఈ గ్రహణ కాలమున శయనించిన రోగం కల్గును. మైధునం చేసిన గ్రామ సూకర జన్మ వచ్చును. ఆదర్శావేక్షణం (అద్దం చూడటం) మొదలగు భోగములు కల్పించుకున్న కుష్టివ్యాధి కలుగును, భోజనం చేసిన నరకం సంప్రాప్తించును, గ్రహణ కాలమందు సర్వులు దైవ చింతనతో ఉండవలయును అని శాస్త్ర వచనం.**

ఈ గ్రహణ కాలమున సర్వజలములు నదులు వాపికూప తటాకాదులు గంగాజలంతో సమానం. **విప్రుడు బ్రహ్మతో, దైవజ్ఞుడు విష్ణువుతో, బ్రహ్మచారి సదాశివునితో సమానం. తృణప్రాయమైన దానం అనంత కోటి ఫలం ఇచ్చును,** ఈ గ్రహణ కాలమున గో, భూ మొదలగు 98 దానములలో ఏ దానం చేసినను మహా ఫలప్రదం. ఈ గ్రహణం జన్మ నక్షత్రం నామ నక్షత్రం జన్మరాశి పంచమరాశి సప్తమ రాశి దశమ, ద్వాదశ రాశుల యందు సంభవించిన వారు గ్రహణ శాంతి చేయించుకోవలయును. సువర్ణ సూర్య ప్రతిమను, రజిత చంద్ర ప్రతిమను రాగి సర్ప ప్రతిమను పూజ చేసి మూడింటితో పాటుగా యధాశక్తి ధన ధాన్యాదులు దానమివ్వవలెను. దీనిద్వారా మహా ఫలమగు పుణ్యం సంప్రాప్తం అగును. **గ్రహణానంతరం ప్రతి ఒక్కరు అశ్వత్థ వృక్షమును గాని, ఉసిరిక వృక్షమును గాని దర్శించవలయును. దీని ద్వారా గ్రహణంలో సంపాదించిన పుణ్యం ద్విగుణీకృతం అగును.**


**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# భారత దేశములోని ప్రముఖ ప్రాంతముల యందు సూర్య గ్రహణ నిర్ణయము

గ్రహణ స్పర్శ, గ్రహణ మధ్య, గ్రహణ మోక్ష కాలములలో ఏ ఒక్కకాలమైనా (దృశ్యమైనప్పుడు) కనిపించినప్పుడు (ఒక్కనిమిషము గ్రహణము కనపడినా) తప్పనిసరిగా గ్రహణ నియమములు గ్రహణ ప్రారంభము నుండి మోక్షకాలము వరకూ పాటించవలయును. భారత దేశమందు మాత్రము "పాక్షిక దర్శనమే" జరుగును.

**స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ ౩౦ బుధవారం దివి. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.**



గ్రహణ ప్రారంభకాలము ఉ॥4 గంటల 49 నిమిషముల 02 సెకన్లకు.
గ్రహణ మోక్షకాలము ఉ॥10 గంటల 05 నిమిషముల 42 సెకన్లకు.

| PLACES | ప్రధాన ప్రాంతము | సూర్యోదయం | గ్రహణము కనిపించు సమయం | సూర్యోదయం నుండి ప్రాంతీయంగా గ్రహణం కనబడు చివరి సమయం గం॥ ని॥ సె॥ |
|---|---|---|---|---|
| Agartala | అగర్తలా | 5:40 AM | 1 Hr. 12 min. | 6:51:05 AM |
| Aijawl | అజ్వైల్ | 5:35 AM | 1 Hr. 18 min. | 6:52:05 AM |
| Allahabad | అలహాబాద్ | 6:19 AM | 0 Hr. 28 min. | 6:46:06 AM |
| Amritsar | అమృత్‌సర్ | 6:32 AM | 0 Hr. 15 min. | 6:47:04 AM |
| Bangalore | బెంగుళూరు | 6:30 AM | 0 Hr. 17 min. | 6:47:33 AM |
| Bhagalpur | భగల్‌పూర్ | 5:59 AM | 0 Hr. 49 min. | 6:48:02 AM |
| Bhopal | భోపాల్ | 6:36 AM | 0 Hr. 11 min. | 6:46:09 AM |
| Bhuvaneswar | భువనేశ్వర్ | 6:01 AM | 0 Hr. 48 min. | 6:49:04 AM |
| Cannanore | కన్ననూర్ | 6:40 AM | 0 Hr. 07 min. | 6:47:01 AM |
| Chathisghad | చత్తీస్‌ఘడ్ | 6:40 AM | 0 Hr. 03 min. | 6:42:06 AM |
| Chennai | చెన్నై | 6:21 AM | 0 Hr. 27 min. | 6:47:09 AM |
| Cochin | కొచ్చిన్ | 6:35 AM | 0 Hr. 12 min. | 6:46:08 AM |
| Coochbehar | కూచ్‌బీహార్ | 5:48 AM | 0 Hr. 01 min. | 6:49:00 AM |
| Cuttack | కటక్ | 6:01 AM | 0 Hr. 48 min. | 6:49:04 AM |
| Darjeeling | డార్జిలింగ్ | 5:53 AM | 0 Hr. 55 min. | 6:47:08 AM |
| Dhradun | డేహ్రాడూన్ | 6:35 AM | 0 Hr. 08 min. | 6:43:00 AM |
| Delhi | ఢిల్లి | 6:38 AM | 0 Hr. 07 min. | 6:44:06 AM |
| Dibrugarh | డిబ్రూఘర్ | 5:25 AM | 1 Hr. 11 min. | 6:52:04 AM |
| Gorakhpur | గోరక్‌పూర్ | 6:12 AM | 0 Hr. 34 min. | 6:46:24 AM |
| Gangtok | గంగాటాక్ | 5:52 AM | 0 Hr. 56 min. | 6:47:08 AM |


**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# భారత దేశములోని ప్రముఖ ప్రాంతముల యందు సూర్య గ్రహణ నిర్ణయము

గ్రహణ స్పర్శ, గ్రహణ మధ్య, గ్రహణ మోక్ష కాలములలో ఏ ఒక్కకాలమైనా (దృశ్యమైనప్పుడు) కనిపించినప్పుడు (ఒక్కనిమిషము గ్రహణము కనపడినా) తప్పనిసరిగా గ్రహణ నియమములు గ్రహణ ప్రారంభము నుండి మోక్షకాలము వరకూ పాటించవలయును. భారత దేశమందు మాత్రము "పాక్షిక దర్శనమే" జరుగును.

**స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ ౩౦ బుధవారం దివి. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.**



గ్రహణ ప్రారంభకాలము ఉ॥4 గంటల 49 నిమిషముల 02 సెకన్లకు.

గ్రహణ మోక్షకాలము ఉ॥10 గంటల 05 నిమిషముల 42 సెకన్లకు.

| PLACES | ప్రధాన ప్రాంతము | సూర్యోదయం | గ్రహణము కనిపించు సమయం | సూర్యోదయం నుండి ప్రాంతీయంగా గ్రహణం కనబడు చివరి సమయం గం॥ ని॥ సె॥ |
|---|---|---|---|---|
| Guwahati | గౌహతి | 5:40 AM | 1 Hr. 10 min. | 6:50:04 AM |
| Gaya | గయ | 6:07 AM | 0 Hr. 41 min. | 6:47:08 AM |
| Haridwar | హరద్వార్ | 6:34 AM | 0 Hr. 09 min. | 6:43:03 AM |
| Hyaderabad | హైద్రాబాద్ | 6:29 AM | 0 Hr. 19 min. | 6:48:07 AM |
| Imphal | ఇంపాల్ | 5:31 AM | 1 Hr. 21 min. | 6:52:09 AM |
| Itanagar | ఈటానగర్ | 5:32 AM | 1 Hr. 11 min. | 6:51:02 AM |
| Jaipur | జైపూర్ | 6:44 AM | 0 Hr. 02 min. | 6:45:07 AM |
| Kanyakumari | కన్యాకుమారి | 6:30 AM | 0 Hr. 17 min. | 6:46:06 AM |
| Kavalur | కావలూర్ | 6:26 AM | 0 Hr. 22 min. | 6:47:06 AM |
| Kohima | కోహిమా | 5:28 AM | 1 Hr. 18 min. | 6:52:09 AM |
| Kolata | కొల్కత | 5:51 AM | 0 Hr. 59 min. | 6:50:01 AM |
| Lucknow | లక్నో | 6:23 AM | 0 Hr. 23 min. | 6:45:08 AM |
| Madhurai | మధురై | 6:28 AM | 0 Hr. 19 min. | 6:47:00 AM |
| Mangalore | మంగళూర్ | 6:43 AM | 0 Hr. 04 min. | 6:47:02 AM |
| Murshidabad | ముర్షిదాబాద్ | 5:52 AM | 0 Hr. 58 min. | 6:49:05 AM |
| Muzaffarpur | ముజఫర్‌పూర్ | 6:04 AM | 0 Hr. 43 min. | 6:47:02 AM |
| Mysore | మైసూర్ | 6:35 AM | 0 Hr. 12 min. | 6:47:02 AM |
| Nagpur | నాగపూర్ | 6:27 AM | 0 Hr. 21 min. | 6:47:05 AM |


**కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు**

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

**బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** ( సెల్: 9963732303, 9550017546 )

# భారత దేశములోని ప్రముఖ ప్రాంతముల యందు సూర్య గ్రహణ నిర్ణయము

గ్రహణ స్పర్శ, గ్రహణ మధ్య, గ్రహణ మోక్ష కాలములలో ఏ ఒక్కకాలమైనా (దృశ్యమైనప్పుడు) కనిపించినప్పుడు (ఒక్కనిమిషము గ్రహణము కనపడినా) తప్పనిసరిగా గ్రహణ నియమములు గ్రహణ ప్రారంభము నుండి మోక్షకాలము వరకూ పాటించవలయును. భారత దేశమందు మాత్రము "పాక్షిక దర్శనమే" జరుగును.

స్వస్తిశ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బ॥ ౩౦ బుధవారం దిని. 09-03-2016 పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాద సంచార సమయే కేతుగ్రస్త సంపూర్ణ సూర్య గ్రహణం.



గ్రహణ ప్రారంభకాలము ఉ॥4 గంటల 49 నిమిషముల 02 సెకన్లకు.

గ్రహణ మోక్షకాలము ఉ॥10 గంటల 05 నిమిషముల 42 సెకన్లకు.

| PLACES | ప్రధాన ప్రాంతము | సూర్యోదయం | గ్రహణము కనిపించు సమయం | సూర్యోదయం నుండి ప్రాంతీయంగా గ్రహణం కనబడు చివరి సమయం గం॥ ని॥ సె॥ |
|---|---|---|---|---|
| Panaji | పానాజి | 6:47 AM | 0 Hr. 01 min. | 6:47:05 AM |
| Patna | పాట్నా | 6:05 AM | 0 Hr. 43 min. | 6:47:05 AM |
| Pondicherry | పాండిచ్చేరి | 6:23 AM | 0 Hr. 25 min. | 6:47:06 AM |
| Port Blair | పోర్ట్‌బ్లేయర్ | 5:31 AM | 1 Hr. 23 min. | 6:53:07 AM |
| Puri | పూరి | 6:01 AM | 0 Hr. 49 min. | 6:49:05 AM |
| Raipur | రాయ్‌పూర్ | 6:18 AM | 0 Hr. 30 min. | 6:47:09 AM |
| Ranchi | రాంచీ | 6:04 AM | 0 Hr. 45 min. | 6:48:05 AM |
| Shillong | షిల్లాంగ్ | 5:39 AM | 1 Hr. 12 min. | 6:50:09 AM |
| Shimla | సిమ్లా | 6:39 AM | 0 Hr. 03 min. | 6:42:02 AM |
| Shibsagar | షిబ్‌సాగర్ | 5:27 AM | 1 Hr. 25 min. | 6:52:03 AM |
| Silchar | షిల్చర్ | 5:35 AM | 1 Hr. 17 min. | 6:52:01 AM |
| Siliguri | సిలిగురి | 5:53 AM | 0 Hr. 55 min. | 6:48:03 AM |
| Shrungeri | శృంగేరి | 6:40 AM | 0 Hr. 07 min. | 6:47:03 AM |
| Tiruvanantapuram | తిరువనంతపురం | 6:32 AM | 0 Hr. 14 min. | 6:46:44 AM |
| Thamelong | తామెలాంగ్ | 5:31 AM | 1 Hr. 21 min. | 6:52:07 AM |
| Udaipur | ఉదయ్‌పూర్ | 5:38 AM | 1 Hr. 13 min. | 6:51:55 AM |
| Ujjain | ఉజ్జయని | 6:43 AM | 0 Hr. 04 min. | 6:46:59 AM |
| Varanasi | వారనాసి | 6:13 AM | 0 Hr. 34 min. | 6:47:00 AM |


కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞశిరోరత్న బిరుదాంకితులు

బ్రహ్మశ్రీ. దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి ( సెల్: 9963732303, 9550017546 )

# పంచాంగములలో వైరుధ్యాలు- పండుగలలో తేడాలు

మన హిందూసాంప్రదాయములో ప్రతికర్మకూ కాలమే ప్రధాన ఆధారము. అట్టి కాలమును గణించి శుభాశుభములను, పండుగ పర్వదినములను తెలియపరుచునవి పంచాంగములు.

ప్రస్తుతకాలములో పంచాంగములలో ఒక పంచాంగములోని గణనకు మరియొక పంచాంగముగణనకు పూర్తిగా తేడా ఉండుట వలన పండుగలు, సంక్రాంతులు, ఏకాదశులు అన్ని రెండురెండు రోజులు వస్తున్నవి. ఇవి ఇట్లు రావడానికి కారణం ప్రస్తుత కాలంలో మనకు లభిస్తున్న పంచాంగములు **1.పూర్వ పద్ధతి పంచాంగములు, 2.దృక్సిద్ధాంత పంచాంగములు (భారత ప్రభుత్వ ఆమోద గణితం).** ఈ రెండు పద్ధతులకు ఆధార గ్రంధం "సూర్యసిద్ధాంతమే" ప్రమాణమైనప్పటికీ కాలానుగుణంగా చేయవలసిన సంస్కారాల విషయములు చేయకపోవడం వలన ఈ దోషములు వస్తున్నవి, కాలానుగుణంగా గ్రహములకు సంస్కారము చేయవలయునని ధర్మశాస్త్ర గ్రంధములన్నియూ చెబుతున్నవి.

**తత్తద్గతి వశాన్నిత్యం యథా దృక్తుల్యతాం గ్రహాః । ప్రయాన్తి తత్ప్రవక్ష్యామి స్ఫుటీకరణ మాదరాత్ ॥ (సూర్యసిద్ధాంత, స్పష్టాధికారం14శ్లో॥) తత్తత్కాలేషు తత్తత్కాల దృక్సిద్ధయే బీజం ప్రాసార్య । తదేవ వ్యాసాదిభి రష్టాదశభిః లోకే విస్తారితమ్ ॥ అతోష్టాదశ సిద్ధాన్తా ఇతి లోకే ప్రసిద్ధిః భచక్ర నాభి దృక్సిద్ధే కుర్యాత్ శ్రాద్ధ వ్రతాదికం । భచక్ర నాభి దృశ్యస్య కర్మాంగత్వే చ హేతవః ॥ (వాసిష్ఠ వాక్యం). (సౌర భాష్యం).**

**సంస్కారము చేసిన గ్రహములే కర్మ ఫలితమునకు యోగ్యమైనవి అను చెప్పు గ్రంథములు** సూర్యసిద్ధాంతం, రంగనాథ వ్యాఖ్యానం, సౌరభాష్యం, వసిష్ఠ సిద్ధాంతం, బ్రహ్మసిద్ధాంతం, చూడామణి, బ్రహ్మస్ఫుట సిద్ధాంతం, సిద్ధాంత శిరోమణి, శిష్యధీవృద్ధి తంత్రం, గ్రహలాఘవం, సిద్ధాంత దర్పణం, వసిష్ఠ వాక్యం, లఘువాసిష్ఠం, వీరమిత్రోదయం, జ్యోతిర్గణితం.

ఇన్ని ధర్మశాస్త్ర గ్రంథములు చెబుతున్నప్పటికీ పూర్వ పద్ధతి వారు సంస్కారము చేయకుండా గణితము చేయుచున్నారు.

**స్థూలముగా పూర్వ పద్ధతి వారికి, దృక్సిద్ధాంతం (భారత ప్రభుత్వ ఆమోద గణితం) వారికి తేడాలు.**

1. **పూర్వపద్ధతి** : సూర్యచంద్రులకు దృక్సంస్కారం చేయరు.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **అన్ని గ్రహములకు దృక్సంస్కారము చేస్తారు.**
2. **పూర్వపద్ధతి** : దృక్సిద్ధాంతం ప్రకారంగా వచ్చిన తిథులు యజ్ఞ శ్రాద్ధాది ధర్మ కర్మలకు పనికి రావని వీరి మతము.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **ధర్మ శాస్త్ర ఆధారముగా దృక్సిద్ధ తిథులే సమస్త కార్యక్రమములకూ గ్రాహ్యములని వీరి మతము.**
3. **పూర్వపద్ధతి** : జాతక ముహూర్తాదులకు దృక్ చేసి మిగిలిన వాటికి పనికి రాదని వీరి అభిమతం.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **అన్ని కర్మలకూ దృక్సంస్కారము జరగవలయునని వీరి అభిమతం.**
4. **పూర్వపద్ధతి** : సహజంగా సూర్యచంద్రులకు దృక్సంస్కారం చేయకపోయినా గ్రహణాలప్పుడు చేయుట వీరి మతము.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **అన్ని సమయముల యందు దృక్సంస్కారము చేయవలసినదే అని వీరి మతము.**
5. **పూర్వపద్ధతి** : కుజాది పంచగ్రహములకు అంచనా ప్రకారం ఏవో కొన్ని సంస్కారములు చేస్తారు, అవి వేధశాలకు సరిపోవు.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **నవీన వేధశాలకు సరిసమంగా సరిపోయేవిధముగా సంస్కారము చేయుట వీరి మతము.**
6. **పూర్వపద్ధతి** : పూర్వ పద్ధతికి కరణ గ్రంధములు అనేకమగుట వలన ఈ పద్ధతులలో అనేకభిన్నవాదనలు వస్తాయి.
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **దృక్పద్ధతికి కరణ గ్రంధము ఒక్కటే అగుట వలన వీరందరివీ ఏకాభిప్రాయముతో ఉండును.**
7. **పూర్వపద్ధతి** : పూర్వం చెప్పిన విధానాన్ని మాత్రమే చేస్తూ ప్రస్తుతంలోని గ్రహ కదలికను పట్టిచ్చుకోకపోవడమే పూర్వ పద్ధతి
   **దృక్సిద్ధాంత పద్ధతి** : **ప్రత్యక్ష ఋజువుకి సరిపోయే విధంగా గణితము చేయుటయే దృక్సిద్ధాంతం, దృక్పద్ధతి, (భా.ఆ.పంచాంగగణనం).**

ఇట్టి పూర్వ, దృక్ వివాదములను తొలగించుటకు **150** సంవత్సరములకు పూర్వం **శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు** దృక్పద్ధతే సరి అయినదని ఆ గణితమునే వారి పీఠము నుండి అనుసరిస్తున్నారు.

మరలా **1898 వ సం॥** లో **శ్రీ వెంకటేశ బాపూజీ కేత్కర్ గారు** బహు పరిశ్రమ చేసి, అనేక విద్వత్సభలు ఏర్పాటు చేసి జ్యోతిర్గణితమను గొప్ప ప్రామాణిక గ్రంధమును రాసి దృక్సిద్ధాంతమే సరి అయినదని తేల్చి చెప్పినారు. **మరలా 1953 వ సం॥** లో భారత ప్రభుత్వం వారు కూడా ప్రామాణిక పంచాంగమును తెలుపుటకు ఒక పండిత బృందమును నియమించిరి. వారు మన దేశమునందు కల పండితులందరితో చర్చించి **జ్యోతిర్గణితమునకు సరిపోవు దృక్సిద్ధాంతమే** సరి అయినదని తేల్చి చెప్పినారు.

దానిని బట్టి **1956 వ సం॥** నుండి దృక్ సిద్ధాంతమునకు **భారత ప్రభుత్వ ఆమోద గణితముగా** గౌరవించి భారత ప్రభుత్వం వారు అన్ని రాష్ట్రముల వారు ఆయా భాషలలో రాష్ట్రీయ పంచాంగములను ప్రకటించుచున్నారు. **1966 వ సం॥** రాజమండ్రి లో శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీ మహాస్వామి వారు జరిపించిన విద్వత్సభలో కూడా **దృక్సిద్ధాంతమే సరి అయినదని తేల్చి చెప్పినారు.**

ఇంకనూ ఇట్టి సభలు అనేకము జరిగినవి. మహాత్ములు, పీఠాధిపతులు, పండితులు ఆమోదించిన గణితము దృక్ సిద్ధాంత గణితము. **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః "** అన్నట్లుగా శ్రేష్ఠులైన వారు ఏది ఆచరిస్తారో దానినే మిగిలిన ప్రజలు కూడా ఆచరిస్తారు. అదేవిధముగా మన తెలుగు రాష్ట్రములకే కాక యావత్ భారతదేశమునకు, మన హిందూ సాంప్రదాయమునకు మార్గదర్శకమైన **"శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు"** కూడా భారత ప్రభుత్వం వారు, పీఠాధిపతులు, పండితులు ఆమోదించిన **ప్రతక్ష నిదర్శనమునకు సరిపోయే దృక్ సిద్ధాంత పంచాంగమునే ఆస్థాన పంచాంగముగా, దృక్ పంచాంగకర్తనే ఆస్థాన పంచాంగకర్త గా** నియమించి మన తెలుగు రాష్ట్రములలో పండుగ పర్వదినములలో ఎలాంటి భేదములు లేక అందరూ ఏకాభిప్రాయముతో ఉండునట్లు చేయగలరని మనవి.

**దృక్ సిద్ధాంతమే సర్వదా ఆచరణీయము (ప్రతి ఒక్కరూ నిరూపణకు సరిపడే దృక్సిద్ధాంత పంచాంగమునే ఆచరించగలరు).**



మీ
ఎల్. సుబ్రహ్మణ్య సిద్ధాంతి
"దైవజ్ఞ" సుబ్రహ్మణ్య సిద్ధాన్తి
lssiddhanthy@gmail.com



పంచాంగ కర్త :

జ్యోతిష కేసరి, జ్యోతిష చతురానన, దైవజ్ఞ శిరోరత్న బిరుదాంకితులు

కంచి పీఠ ఆస్థాన సిద్ధాంతి,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు

## బ్రహ్మశ్రీ దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాంతి

## శ్రీ లలితామ్బికా జ్యోతిషామృత నిలయం

సోమవరప్పాడు,

ఏలూరు తాలూకా, ప॥గో॥జిల్లా (ఆంధ్రప్రదేశ్) సెల్ : 9550017546

ఆలేరు,

నల్గొండజిల్లా, తెలంగాణ సెల్ : 963732303



మోహన్ పబ్లికేషన్స్
రాజమహేంద్రవరం



శ్రీ కంచి కామకోటి పీఠ పరిపాలిత గంటల పంచాంగము

### శ్రీ కంచి కామకోటి పీఠ పరిపాలిత

### శ్రీ దుర్ముఖి నామ సంవత్సర

# గంటల పంచాంగము

2016 2017

కృష్ణా పుష్కరముల విశిష్టతపై ప్రత్యేక వివరణ

కుజదోషము నివారణపై విశ్లేషణాత్మక ప్రత్యేక వ్యాసం



బ్రహ్మశ్రీ దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాంతి
శ్రీ లలితామ్బికా జ్యోతిషామృత నిలయం
సోమవరప్పాడు & ఆలేరు

మోహన్ పబ్లికేషన్స్ రాజమహేంద్రవరం

వెల: 63-00

శ్రీరస్తు శుభమస్తు కళ్యాణమస్తు

శ్రీ కంచికామకోటి పీఠ ఆస్థాన సిద్ధాంతి వారి

**2016 దుర్ముఖి నామ సంవత్సర 2017**

# గంటల పంచాంగము


*పంచాంగకర్త :*

ఆంధ్రప్రదేశ్ ఆగమ సలహాదారులు,

"జ్యోతిష కేసరి", "జ్యోతిష చతురానన", "దైవజ్ఞ శిరోరత్న"

బ్రహ్మశ్రీ దైవజ్ఞ **లక్కావఝ్ఝుల సుబ్రహ్మణ్య సిద్ధాంతి**

**ఆలేరు** - తెలంగాణ & **సోమవరప్పాడు** - ఆంధ్రప్రదేశ్

**e-mail: lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com**

**Cell: 9963732303, 9550017546, 9866839560**





ప్రకాశకులు : ఫోన్: **0883-2462565**

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,

రాజమహేంద్రవరము-**533 101.**

# ॥ గురువందనమ్ ॥

**శ్రీలక్ష్మీగణపతయే నమః          శ్రీమాత్రే నమః     శ్రీగురు దక్షిణామూర్తయే నమః**



**శ్లో॥ స్కందత్రయాత్మకం శాస్త్రం ఆద్యాం సిద్ధాన్త సంజ్ఞికం !**
**ద్వితీయం జాతకస్కందం తృతీయం సంహితాహ్వాయం !!**

**శ్లో॥ యథాశిఖమయూరాణాం నాగానాం మణయోయథా !**
**తత్త్వేద వేదాంగ శాస్త్రాణాం సిద్ధాన్తం మూర్ధినిష్ఠితం !!**

విద్వజ్జనులకు నా నమస్కారం.

నాపై అపారమైన కరుణాకటాక్షములతో నన్ను అనుగ్రహించి నాకు శ్రీముఖమును ప్రసాదించిన **శ్రీకంచికామకోటి పీఠ జగద్గురువులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ మహాస్వామి వారికి, శ్రీశ్రీశ్రీ** విజయేంద్ర **సరస్వతీ మహాస్వామి వారికి** నా శతకోటి వందనములు.

ఈ ప్రపంచమునందు గల అనేక శాస్త్రములకు ప్రాణ రూపమైనటువంటి స్కందత్రయాత్మకమగు జ్యోతిష శాస్త్రమును ఎంతో చక్కగా అతి తక్కువ కాలంలో నామీద ఎనలేని ప్రేమ, వాత్సల్యములతో నేర్పిన నా గురువర్యులు **బ్ర॥శ్రీ॥వే॥ యజ్ఞా శ్రీనివాస సిద్ధాన్తి గారికి** శతసహస్రాధిక ప్రణామములు. శాస్త్ర పరముగా నాకు అనేక విధములుగా సందేహ నివృత్తి చేసిన,చేస్తున్న **బ్ర॥శ్రీ॥ బి.మణికంఠన్ గారికి**, నన్ను ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రేరేపించిన నా స్మార్త గురువర్యులు **బ్ర॥శ్రీ॥వే॥ మార్తి వెంకట్రామశర్మగారికి, బ్ర॥శ్రీ॥వే॥కుప్పా.శివసుబ్రహ్మణ్య అవధాని(M.A."Tripul")గారికి బ్ర॥శ్రీ॥వే॥మార్తి లక్ష్మీ నరసింహశాస్త్రి గారికి** మరియు మా పితామహులు **బ్ర॥శ్రీ॥వే॥ లక్కావఝ్జల పాపయ్య శాస్త్రి గారికి, బ్ర॥శ్రీ॥వే॥ వేలమూరి సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి**, మా పెద్దనాన్నగారైన **యల్.యస్.వి.శాస్త్రి** గారికి, మా పినతండ్రిగారైన **ఆంజనేయశర్మ** గారికి, ప్రత్యక్షంగా ఆశీస్సులనందించి నన్ను పలు విధములుగా ప్రోత్సహించిన నా **మాతా పితరులకు** నా కృతజ్ఞతాపూర్వక శతాధిక వందనములు.

**శ్లో॥ ఏక మేవాక్షరం యస్తు గురుః శిష్యః ప్రబోధయేత్ !**
**పృథివ్యాం నాస్తి తద్రవ్యం యద్దత్వా చాన్రుణీ భవేత్ !!**

అన్నట్లుగా నాకు ఉపకారం చేసిన పై గురువర్యులందరికీ గురు ఋణం తీర్చు ద్రవ్యం కనిపించక కృతజ్ఞతతో పాదాభివందనములు చేయుచూ ........

నా ఉపాస్యదైవమగు శ్రీ లలితాత్రిపురసుందరీదేవి ఈ **"దుర్ముఖి"** నామ **సంవత్సరం** లో జనులందరికీ భోగభాగ్యములను ప్రసాదిస్తూ ప్రతి సం॥ ఈ పంచాంగం జనులందరికీ మోద, ఆమోదములను కల్గించాలని ఆశిస్తూ....

**మీ ... "దైవజ్ఞ" సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

# THE UNIVERSAL ASTROLOGICAL HOME OF INDIA

శ్రీ లలితాంబికా జ్యోతిషామృత నిలయం వారి ఉగాది శుభాభినందనములతో ...

## దుర్ముఖి నామ సంవత్సర

# కాల నిర్ణయ పఞ్చాఙ్గమ్ - ౦౯

కటాక్షే దయార్ద్రాం కరేజ్ఞాన ముద్రాం కళాభిర్వి నిద్రాం కలాపై సుభద్రాం



పురంధ్రీం వినిద్రాం పురస్తుంగ భద్రాం। భజే శారదాంబా మజస్రం మదంబాం॥

: పంచాంగకర్త :

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల పాండురంగ శాస్త్రి గారి పుత్రుడు,
గురువర్యులు యజ్ఞా శ్రీనివాస సిద్ధాంతి గారి ప్రియ శిష్యుడు
కంచిపీఠ ఆస్థాన సిద్ధాంతి, ఆంధ్రప్రదేశ్ ఆగమ సలహాదారులు,
"జ్యోతిష కేసరి", "జ్యోతిష చతురానన", "దైవజ్ఞ శిరోరత్న"

బ్రహ్మశ్రీ దైవజ్ఞ **లక్కావఝ్ఝుల సుబ్రహ్మణ్య సిద్ధాంతి**

గారిచే గుణింపబడినది.

జాతక, ముహూర్త, ప్రశ్న, వివాహ, దేవాలయ వాస్తు, దేవాలయ
ప్రతిష్ఠాది వైదిక కార్యక్రమాదుల నిర్వహణకు ...

**Cell: 9963732303, 9550017546, 9866839560**
**e-mail: lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com**

# పంచాంగకర్త పరిచయం

| | | |
|---|---|---|
| **పేరు** | : | **లక్కావఝ్ఝల సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** (యల్.యస్.సిద్ధాన్తి) |
| **జననం** | : | 01-01-1988. (ప్రభవ సం॥ పౌష్య శు॥ త్రయోదశి) |
| **జననీ జనకులు** | : | యల్. పాండురంగశాస్త్రి, రమాదేవి దంపతులు |
| **జన్మస్థలం** | : | గ్రా॥ సోమవరప్పాడు, మం॥ దెందులూరు, ఏలూరు ప.గో. |
| **ప్రస్తుత నివాసం** | : | హైద్రాబాద్. సెల్ నెం. 9963732303, 9550017546. |
| **విద్యార్హత, గురువులు** | : | శ్రీవేంకటేశ్వర వేదసంస్కృత పాఠశాలలో **మార్తి వెంకట్రామ శర్మ** గారి వద్ద వైదిక స్మార్తం, **యజ్ఞా శ్రీనివాస సిద్ధాన్తి** గారి వద్ద స్కందత్రయం (సిద్ధాన్తం, జ్యోతిషం, సంహిత) పూర్వసిద్ధాన్తం, కేత్కరీయ జ్యోతిర్గణిత దృక్ సిద్ధాన్తం, దేవాలయ వాస్తు, ఖగోళ గణితం, **మణికంఠన్** గారి వద్ద కేరళీయ ప్రశ్నా శాస్త్రం, ధర్మశాస్త్రం దూరవిద్యలో యం.ఏ. |
| **వృత్తి** | : | 2008 వ సం॥ నుండి సశాస్త్రీయమైన దృక్ సిద్ధాన్త రీత్యా శ్రీకంచి పీఠ పరిపాలిత **శ్రీకాలనిర్ణయ పంచాంగమును గణించుట**, పంచదశకర్మలు, దేవాలయ ప్రతిష్ఠాదులు, ఉగ్రరథ, భీమరథ, రుద్ర, సుదర్శన, చండీయాగాదులు చేయుంచుట, **ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ సలహాదారులు.** |
| **ప్రవృత్తి** | : | 157 దేశములకు కాలసవరణతో తిథి నక్షత్ర వర్జ్యాది గ్రహణ వివరములను ఇంటర్‌నెట్ ద్వారా అందించుట, పూరాతన గ్రంధములను, తాళపత్ర ప్రతులను పరిశోధన చేసి తెలుగులోకి అనువదించుట, నల్లగొండ, వరంగల్, రంగారెడ్డి వైదికబ్రాహ్మణ సంఘములకు పంచాంగమును అందించుట, ఉచితముగా జ్యోతిష విద్యాబోధన చేయుట, పుత్రజాతకము ద్వారా వంశములోని వారి జాతకములను పరిశీలించుట అంశము పై పరిశోధించుట, అపోలోవారి "బీ పాజిటీవ్" మాసపత్రికకు వ్యాసములు అందించుట |
| **సన్మానములు** | : | మాజీ సిక్కిం గవర్నర్ వి.రామారావు గారితో **"జ్యోతిషకేసరి"**<br>తేజ ఆర్ట్స్ వారి తరుపున సి.నా.రే. గారితో **పండితసత్కారం**<br>నల్లగొండ వైదిక బ్రాహ్మణ సంఘం, రంగారెడ్డి వైదిక బ్రాహ్మణ సంఘం వార్ల తరుపున **పండిత సత్కారం**<br>వైష్ణవీ ఆర్ట్స్ వారి తరుపున **"జ్యోతిషచతురానన"**<br>శ్రీకంచిపీఠం జగద్గురువుల సమక్షంలో పండిత సదస్సులో **"దైవజ్ఞ సత్కారం"**<br>విఖనస ఆర్ట్ తెనాలి వారి తరుపున **"దైవజ్ఞ శిరోరత్న"**<br>భక్తీ టీ.వి. వారి తరుపున కోటిదీపోత్సవంలో **"దైవజ్ఞ సత్కారం"** |

☎ : 044-27222115
Fax : 044-27224305, 372090060

Email :-skmkanci@md3vsnl.netin

Sri Chandramouleeswaraya Namaha:
Sri Sankara Bhaghavadpadacharya Paramparagatha Moolamnaya Sarvagnapeeta :

His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi

**JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL**

**Srimatam Samsthanam**

No. 1, Salai Street, Kanchipuram - 631 502.

యాత్రాస్థానం -కాంచీపురం
తిథి: శ్రావణ శుద్ధ చతుర్దశి (మన్మథ)



# శ్రీముఖమ్

వేదమున విధించబడిన నిత్యశ్రౌతస్మార్తాది సకల సత్కర్మానుష్ఠానమునకు తగిన కాలము నిర్ణయించుట జ్యోతిశ్శాస్త్రపు ముఖ్యప్రయోజనము. జటిల గణిత సాధ్యమైన తిథివార నక్షత్ర యోగకరణాదుల నిర్ణయము బహుప్రాచీన కాలము నుండి అట్టి గణనమునందు నిష్ణాతులైన మనపంచాంగకర్తలు చేయుచూ వచ్చుచున్నారు. కాగా కొన్ని పంచాంగములందు గ్రహణాది ప్రత్యక్ష గోచరములు కూడా తప్పిపోయెడి పొరపాట్లు దొర్లుచున్నవి. ఇట్టి ప్రమాదములను పరిహరించుటకు, తగునిర్ణయములు తీసుకొనుటకు దోహదముగా **శ్రీమఠం** పరాపర గురువుల కాలము నుండి **పంచాంగ పండిత సదస్సులు** నిర్వహించుచున్నది. ఈసంవత్సరము కూడా ఆగస్ట్ 11 వతారీఖునుండి మూడుదినములు ఈ సదస్సు జరిగినది.

గత మూడు సంవత్సరములుగా ఈసదస్సుకు వచ్చి చర్చలలో ప్రధాన భూమికను నిర్వహిస్తున్న శ్రీ **దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి** గారు **2008** నుండి **శ్రీకంచి కామకోటి పీఠ పరిపాలిత కాలనిర్ణయ పంచాంగమును** వెలువరించుచున్నారు. ఇందలి నిర్ణయములన్నియూ శ్రీమఠమునందు నిర్వహింపబడు పంచాంగ పండిత సదస్సు నందు ఆమోదింపబడినవిగా ఉండును.

దుర్ముఖి నామ సంవత్సరమునకు కూడా ఇదేవిధముగా పంచాంగము వెలువరించబోవుచున్నారని తెలుసుకొని ఎంతయో సంతసించినాము.

ఆస్తికులందరూ ఈ పంచాంగమును తమ అనుష్ఠానములలో ఉపయోగించుకుని ఫలితములను పరిపూర్ణముగా పొందగలరు గాక యనియు, పంచాంగకర్తకు సకలశ్రేయోభివృద్ధి కలుగగలదనియు నారాయణస్మృతి పూర్వకముగా ఆశీర్వదించుచున్నాము.



**నారాయణస్మృతిః**



# విషయ సూచిక




| | |
|---|---|
| ఇష్టదేవతా ప్రార్థన | 8-12 |
| ద్వాదశ రాశుల వారికి స్తోత్రములు | 13 |
| నామనక్షత్ర,రాశి,గణ,నాడి పొంతనములు | 14 |
| సందిగ్ధముగా ఉన్నపేర్లకు వివరణ | 15 |
| కలశ,వృషభ చక్రం | 16 |
| ప్రయణమునకు ఆనందాది యోగములు | 17 |
| తారాబల చక్రం | 18 |
| దినాధిపతుల, తారాబల ఫలములు | 19 |
| ప్రతిదిన హోరా చక్రం | 20 |
| హోరాధిపతుల ఫలములు | 21 |
| గౌరీపంచాంగం | 22 |
| **శ్రీదుర్ముఖినామ సం॥నిర్ణయపీఠిక** | **23** |
| **శ్రీదుర్ముఖినామ సం॥ఫలితాంశం** | **24-25** |
| **వర్షలగ్న జగల్లగ్న ఫలితములు** | **26-27** |
| అబ్దఫలనిరూపణ, ఫలితాంశములు | 28 |
| రాజాది నవనాయక, ఉపనాయక నిర్ణయ ఫలితములు | 29-33 |
| వాస్తుకర్తరి, మౌఢ్య, పుష్కర నిర్ణయములు | 34-35 |
| వర్షధాన్యాదుల నిర్ణయం | 36-37 |
| కార్తెల వివరములు | 38 |
| కందాయ ఫలములు, ఆదాయవ్యయములు | 39 |
| **పండుగల నిర్ణయములు** | **40-49** |
| వైష్ణవ తిరునక్షత్ర, మధ్వ పుణ్యతిథులు | 50-51 |
| సంక్రమణ పుణ్యకాల వివరములు | 52-53 |
| గ్రహ సంచారములు | 54-62 |
| అష్టసిద్ధాంత సార శుభకాలములు | 63 |
| శ్రీదుర్ముఖినామ సం॥మాసాధిపతులు | 64 |
| మాసాధిపతులు ఫలితములు | 65 |
| **వర్షాదియోగములు** | **66-67** |
| **సరుకుల ధరలు** | **68-69** |
| అదృష్ట సంఖ్యా వివరములు | 70 |
| ఏకవింశతి మహాదోషములు,అపవాదములు | 71-76 |
| **వివాహాది శుభముహూర్తములు** | **77-83** |
| మేష రాశి ఫలితములు | 84-85 |
| వృషభ రాశి ఫలితములు | 86-87 |
| మిధున రాశి ఫలితములు | 88-89 |
| కర్కాటక రాశి ఫలితములు | 90-91 |
| సింహ రాశి ఫలితములు | 92-93 |
| కన్య రాశి ఫలితములు | 94-95 |
| తుల రాశి ఫలితములు | 96-97 |
| వృశ్చిక రాశి ఫలితములు | 98-99 |
| ధనూ రాశి ఫలితములు | 100-101 |
| మకర రాశి ఫలితములు | 102-103 |
| కుంభ రాశి ఫలితములు | 104-105 |
| మీన రాశి ఫలితములు | 106-107 |
| వధూవర గుణమేళన చక్రం | 108-109 |
| శంఖుస్థాపనాది శుభముహూర్తములకు యోగ్యమైన తిథివార నక్షత్ర లగ్న శుద్ధి చక్రం | 110-111 |
| శిశుజనన పాదదోషవివరములు | 112-113 |
| వివాహ విషయమై అష్టకూటాది వివరములు | 114-115 |
| కుజదోషము వివరణ | 116 |
| ఉపయుక్త విషయములు | 117-118 |
| రాహుకాల, దుర్ముహూర్త, ఘాతవివరములు | 119 |
| శుభకార్యములకు శుభ సమయములు | 120 |
| పురిటి విషయములు | 121 |
| బిడ్డల విషయమై శుభాశుభములు | 122 |
| విద్యా విషయమై శుభాశుభములు | 123 |
| వ్యాపార విషయమై శుభాశుభములు | 124-125 |
| గృహ విషయమై శుభాశుభములు | 126 |
| వ్యవసాయ విషయమై శుభాశుభములు | 127-139 |
| జననకాల నక్షత్ర ఫలితములు | 130-131 |
| బాలారిష్టాది వివరములు | 132 |
| మృత విషయమై గృహ విసర్జన వివరములు | 133 |
| రజస్వలా విషయములు | 134 |
| ఆశౌచ సమయ నిర్ణయ చక్రం | 135-138 |
| బల్లిపాటు, శరీరమదురుట ఫలములు | 139 |
| ప్రయాణ సంబంధ విషయములు | 140 |
| స్వప్న విషయములు | 141 |
| రవ్యాది గ్రహ వివరములు | 142 |
| దశాంతర్దశా చక్రం | 143 |
| శాస్త్రీయ వాస్తువివరణ | 144-150 |
| **సంఖ్యాశాస్త్రంలో మెలకువలు** | **151-152** |
| కాల మహిమ | 153 |
| సూర్యోదయ, సూర్యాస్తమయ చక్రం | 154-155 |
| **దేశాంతర సంస్కార చక్రం** | **156-157** |
| ప్రతిదిన గ్రహస్ఫుట చక్రం | 158-172 |
| ప్రతిదిన లగ్నాంతకాలములు | 173-182 |
| **శ్రీదుర్ముఖి నామ సం॥ తిథ్యాది పంచాంగం** | **183-219** |
| కృష్ణా పుష్కరములపై వివరణ | 220-228 |
| అంగారక గ్రహం ప్రత్యేక వ్యాసం | 229-232 |

# పంచాంగ శ్రవణ ఫలం

**వేదాఙ్గమగ్ర మఖిలం జ్యోతిషాం గతికారణమ్ । ఆరధయన్నివసన్నంతం తపస్తేపే సుదుశ్చరమ్ ।**
**వికలానాం కలా షష్ట్యా తత్షష్ట్యా భాగ ఉచ్యతే । తత్రింశత్ భవేద్రాశిః భగణో ద్వాదశైవతే ॥**
**తిథిర్వార నక్షత్రం యోగః కరణమేవచ । పఞ్చాఙ్గమితి విఖ్యానాం లోకానాం ఉపకారకః ॥**
**వారశ్చ ఘటికాచైవ దివనిత్యా తతః పరమ్ । వర్షమాస యుగశ్చైవ పరివృత్తిః అనుక్రమాత్ ॥**
**తిథేశ్చ శ్రియమాప్నోతి, వారాదాయుష్య వర్ధనం। నక్షత్రాదుద్ధరతే పాపం, యోగాద్రాగ నివారణం।**
**కరణాత్కార్య సిద్ధిశ్చ పంచాంగ ఫలముత్తమం। కాలవిత్కర్మ కృద్ధీమాన్ దేవతానుగ్రహం లభేత్**

వేదములకు నేత్రస్థానమైనటువంటి జ్యోతిష శాస్త్రమునకు మూలాధారము వికలలు, కలలు, ఘడియలు, రాశులు, భగణములు, వర్షమాసాది గణితములసమాహారమగు పంచాంగము. ఈ పంచాంగము 5భాగములతో ఉండును. తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము అను ఈ అయిదింటినీ తెలుసుకుని శుభాశుభకర్మలను ఆచరించవలయును.

తిథులయందు జయ, భద్ర, నంద, రిక్త, పూర్ణ తిథులను భేదములు కలవు, ఒక్కొక్క తిథియందు ఒక్కొక్క కర్మ అతిశీఘ్రముగా ఫలించును. అట్టి తిథిని ప్రతినిత్యము తెలుసుకొనుట వలన కీర్తి ధనవృద్ధి కలుగును.

ఛాయాగ్రహములుకాక మిగిలిన సప్తగ్రహములకు సంకేతముగా ఏర్పడిన వారమును ప్రతిన్యిము తెలుసుకొనుట వలన ఆయుర్వృద్ధి కలుగి ఆపదలు తొలగును.

నక్షత్రముల యందు క్షిప్ర, దగ్ర, మైత్ర, మృదు, స్థిర, ఉగ్ర, సాధారణ, చర అనుభేదములు కలవు, ఒక్కొక్క నక్షత్రమందు ఒక్కొక్క కర్మ అతిశీఘ్రముగా ఫలించును , అట్టి అశ్విన్యాదిగా కల 27నక్షత్రములను తెలుసుకొనుట వలన పాపక్షయమగును.

విష్కంభాదిగా కల 27యోగములను తెలుసుకొనుట వలన రోగనివారణ జరుగును. బవాదిగా కల 11 స్థిర, చర కరణములను తెలుసుకొనుట ద్వారా కార్యసిద్ధి కలుగునని శాస్త్రవచనము.

**తిథులు :** పాడ్యమి, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య, అవమ, త్రిద్యుస్పృక్ ఈ తిథులు అశుభప్రదములు.

**వారములు :** ఆదివారము, మంగళవారము, శనివారములు అశుభప్రదములు.

**నక్షత్రములు :** భరణి, కృత్తిక, పునర్వసు, ఆశ్రేష, మఖ, పూర్వఫల్గుణి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు అశుభప్రదములు.

**యోగములు :** విష్కంభము, గండము, అతిగండము, శూలము, వ్యాఘాతము, వ్యతీపాత్, వైధృతి యోగములు అశుభప్రదములు.

**కరణములు :** శకుని, చతుష్పాత్, నాగవ, కింస్తుఘ్న కరణములు అశుభప్రదములు.

ఈ విధముగా తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాది వివరములను తెలుసుకుని ప్రతి పనులయందు ఏవిధముగా ప్రారంభించాలో, ఏసమయములో ప్రారంభించాలో అను విషయములను తెలుసుకుని ఆచరించిన విఘ్నములు లేకుండా సర్వ కార్యములు త్వరితముగా సిద్ధించునని శాస్త్రవచనము.

**యజ్ఞా వంశాబ్ధి చంద్రాయ శ్రీనివాస మహాత్మనే !**

**కళ్యాణ పుర వాసాయ దైవజ్ఞ గురవేనమః !!**

# నవగ్రహ స్తోత్రము



( గ్రహ దోషముల నివృత్తికై చదువ వలసిన స్తోత్రం)

శ్లో॥ వందనం సుముఖోదేవ వందనం చాఖువాహన ।
వందనం విఘ్నరాజాయ వందనం స్కంద పూర్వజ ॥

శ్లో॥ ఆదిత్య ప్రముఖాః ఖేటాస్తథా మేషాదిరాశయః ।
లోకానాముపకర్తారః పాతుమామిహ సర్వదా ॥

శ్లో॥ జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్ ॥



శ్లో॥ దధిశంఖ తుషారాభం క్షీరోదార్ణవ సముద్భవమ్ ।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥



శ్లో॥ ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్ ।
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥



శ్లో॥ ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సౌమ్య గుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్ ॥



శ్లో॥ దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచాన సన్నిభమ్ ।
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥



శ్లో॥ హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుమ్ ।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్ ॥



శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయ మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్ ॥



శ్లో॥ అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనమ్ ।
సింహికా గర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ ॥



శ్లో॥ ఫలాశ పుష్పసంకాశం తారాకా గ్రహమస్తకమ్ ।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ ॥



**పై స్తోత్రములను, శ్లోకములను నిత్యం పఠించుట వలన సర్వగ్రహ దోషములు తొలగుట, కార్యములలో ఆటంకములు తొలగి, ఆయురారోగ్య భాగ్యములతో విద్యా, ఉద్యోగ వ్యాపారాదులలో లాభములు చేకూరును.**

# గణేష పంచ రత్నమాల



శ్లో॥ ముదాకరాత్త మోదకం సదావిముక్తి సాధకం ।
కళాధరావ తంసకం విలాసిలోక రక్షకమ్ ।
అనాయకైక నాయకం వినాశి తేభ దైత్యకం ।
నతాశుభాశు నాశకం నమామితం వినాయకమ్ ॥ 1

శ్లో॥ నతేతరాతి భీకరం నవోది తార్క భాస్వరం ।
నమస్సురారి నిర్జరం నతాధి కాపదుర్ధరమ్ ।
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం ।
మహేశ్వరం తమాశ్రయే పరాత్పరం నిరంతరమ్ ॥ 2

శ్లో॥ సమస్త లోక శంకరం నిరస్త దైత్య కుంజరం ।
దరేతరో దరం వరం వరేభవక్త్ర మక్షరమ్ ।
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం ।
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్ ॥ 3

శ్లో॥ అకించ నార్తి మార్జనం చిరంత నోక్తి భాజనం ।
పురారి పూర్వ నందనం సురారిగర్వ చర్వణమ్ ।
ప్రపంచనాశ భీషణం ధనంజయాది భూషణం ।
కపోలదాన వారణం భజేపురాణ వారణమ్ ॥ 4

శ్లో॥ నితాంతకాంత దన్తకాన్తి మన్త కాన్త కాత్మజమ్ ।
అచింత్య రూప మన్త హీన మన్తరాయ కృన్తనమ్ ।
హృదన్తరే నిరన్తరం వసన్త మేవ యోగినాం ।
తమేక దన్త మేవతం విచిన్తయామి సంతతమ్ ॥ 5

శ్లో॥ మహాగణేశ పంచరత్న మాదరేణ యోన్వహం ।
ప్రజల్పతి ప్రభాతకే హృదిస్మరన్ గణేశ్వరమ్ ।
ఆరోగతామ దోషతాం సుసాహితీం సుపుత్రతాం ।
సమాహితాయురష్టభూతి మభ్యుపైతి సోచిరాత్ ॥



**॥ శ్రీ ఆది శంకరాచార్య కృత గణేష పంచరత్న మాలాస్తోత్రమ్ సంపూర్ణమ్ ॥**



శ్లో॥ చక్రస్థే చతురే చరాచర జగన్నాధే జగత్పూజితే
వార్తాళీ వరదేవతాభయకరే వక్షోజ భారాన్వితే
విద్యేవేదకలాప మౌళి గుళికే విద్యుల్లతా విగ్రహే
మధ్యేపూర్ణ సుధారసార్ద్ర హృదయే మాం పాహిలలితాంబికే॥

శ్లో॥ నాదే నారదమంతురాద్య వినుతే నాదాంత నాదాత్మికే
నిత్యే నీలపతాత్మికే నిరుపమే నీవారశూకోపమే
కాంతే కామకళే కదంబ నిలయే కామే కరాంతస్థితే
మద్విద్యే మదభీష్టకల్పలతికే మాం పాహి లలితాంబికే ॥



శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్వం యువానం
వర్శిష్ఠాంతే వసదృషి గణైః ఆవృతం బ్రహ్మనిష్ఠైః ।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ॥

శ్లో॥ విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం।
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రభోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

శ్లో॥ విశ్వంపశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్త్రాద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతివాయఏషపురుషో మాయా పరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥



శ్లో॥ దత్తాత్రేయం మహాత్మానం వరదం భక్తవత్సలం
ప్రసన్నార్తిహరం వందే స్మర్తృగామీ నమావతు ॥

శ్లో॥ శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణం
నారయణం విభుం వందే స్మర్తృగామీ నమావతు ॥



శ్లో॥ స్కందం షణ్ముఖం దేవం శివరూపం ద్విభ్జుజం
కుమారం స్వామినాథం తం కార్తికేయం నమామ్యహం ॥

శ్లో॥ ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః
ధైర్యం రాహుశ్చ కీర్తిం సకల శుభయుతాం కేతురిష్టార్థ సిద్ధిమ్ ॥

శ్లో॥ **శ్రీ వేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసం**
**శ్రిత చేతన మందారం శ్రీనివాసమహంభజే ॥**





# నిత్య పారాయణ శ్లోకములు



### నిద్రలేచునప్పుడు (భూ ప్రార్థన)

శ్లో॥ సముద్ర వసనే దేవీ పర్వత స్థన మండలే ।
విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥

### కర దర్శనం (లేవగానే అరచేతులు చూసుకుంటూ)



శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ ।
కరమూలే భవేద్గౌరీ ప్రభాతే కరదర్శనం ॥

### స్నానము చేయుటకు ముందు

శ్లో॥ అతిక్రూర మహాకాయ కల్పాంత దహనోపమ ।
భైరవాయ నమస్తుభ్యం అనుజ్ఞాం దాతుమర్హసి ॥

### తిలకధారణ చేయునప్పుడు

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే ।
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః ॥



### సూర్యనమస్కారం చేయుచూ

శ్లో॥ ఉదయే బ్రహ్మరూపశ్చ మధ్యాహ్నేతు మహేశ్వరః ।
అస్తకాలే స్వయం విష్ణుః త్రిమూర్తిశ్చ దివాకరః ॥

### తల్లి తండ్రులకు, గురువులకు నమస్కరించునప్పుడు

శ్లో॥ మాతాపితృసమం దైవం నదైవం పితరమర్చయేత్ ।
సర్వతీర్థఫలం జ్ఞేయం మాతృ (పితృ) వందనతాం సదా ॥

శ్లో॥ నిత్యానందైక కందాయ నిర్మలాయ చిదాత్మనే ।
జ్ఞానోత్తమాయ గురవే సాక్షిణే బ్రహ్మణే నమః ॥

### దేవతా దర్శనము చేయునప్పుడు

శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతం ।
ప్రతిమాః కర్మబుద్ధీనాం సర్వత్ర సమదర్శినాం ॥

### భోజనమునకు ముందు

శ్లో॥ అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం ॥

### భోజనము చేయునప్పుడు

శ్లో॥ అన్నం బ్రహ్మ రసో విష్ణోః భోక్తా దేవో మహేశ్వరః ।
ఏవం సంచిత్య భుంజానో దృష్టి దోషైర్నలిప్యతే ॥

### భోజనము చేసిన తరువాత

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ శమ్యంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం స్మరామిచ వృకోదరం ॥

**ఔషధ (వైద్య) సేవ చేయునప్పుడు**

శ్లో॥ ధన్వంతరిం గరుత్మంతం ఫణిరాజంచ కౌస్తుభం ।
అచ్యుతం చ అమృతం చంద్రం స్మరేత్ ఔషధ కర్మణీ ॥

**సంధ్యా దీపమును వెలిగించునప్పుడు**



శ్లో॥ శుభం భవతు కళ్యాణీ ఆరోగ్యం ధన సంపదం ।
మమ శత్రు వినాశాయ సాయం జ్యోతిర్నమోస్తుతే ॥

**చంద్ర దర్శనము చేయునప్పుడు**

శ్లో॥ క్షీరసాగర సంపన్న లక్ష్మీ ప్రియ సహోదర ।
హిరణ్య మకుటాన్ భాస్వత్ బాలచంద్ర నమోస్తుతే ॥

**గోసేవ చేయునప్పుడు**

శ్లో॥ గావోమే మాతరస్సర్వా గావోమే పితరస్సదా ।
గావో మమగ్రతస్సంతు గావోమే సంతు పృష్ఠతః ॥
గావోమే హృదయే సంతు గవాం మధ్యే వసామ్యహమ్ ॥



**తులసీ మాతను నమస్కరించినప్పుడు**

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వ వేదాశ్చ తులసీం త్వాం నమామ్యహమ్ ॥

**పిడుగులు పడినప్పుడు, భయము కల్గు సమయముల యందు**

శ్లో॥ అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీ శ్వేతవాహనః ।
భీభత్సుర్విజయః కృష్ణస్సవ్యసాచి ధనుంజయః ॥

**అశ్వత్థ (రావి) వృక్ష దర్శనము చేయునప్పుడు**

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రతో శ్శివరూపాయ వృక్షరాజాయతే నమః ॥

**బిల్వ (మారేడు) వృక్ష దర్శనము చేయునప్పుడు**

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచ త్రియాయుధం ।
త్రిజన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణం ॥

**ప్రయాణము చేయునప్పుడు**

శ్లో॥ వనమాలీ గదీశార్ఙ్గీ శంఖీచక్రీచనందకీ ।
శ్రీమాన్నారాయణో విష్ణుర్వాసుదేవోభిరక్షతు ॥



శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం ।
లోకాభిరాం శ్రీరాం భూయో భూయో నమామ్యహమ్ ॥

**నిద్రపోయే ముందు**

శ్లో॥ రామస్కందం హనూమంతం వైనతేయం వృకోదరం ।
శయనే యఃస్మరేన్నిత్యం దుఃస్వప్నం తస్య నశ్యతి ॥



శ్లో॥ బ్రహ్మాణం శంకరం విష్ణుం యమం రామం ధనుం బలిం ।
సప్తైతాన్ యఃస్మరేన్నిత్యం దుఃస్వప్నం తస్య నశ్యతి ॥

## ద్వాదశ రాశుల వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకములు

**మేష రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ గజాననం భూతగణాధిసేవితం ! కపిత్థ జంబూఫలసార భక్షితం !
ఉమాసుతం శోకవినాశ కారణం! నమామి విఘ్నేశ్వర పాదపంకజం !!

**వృషభ రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ సర్వదేవ మయే దేవి లోకానాం శుభనందినీ !
మాతః మమాభిలషితం సఫలం కురు నందినీ !!

**మిథున రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ సర్వభాధా ప్రశమనం త్రైలోక్య స్యాఖిలేశ్వరి !
ఏవమేవత్వయా కార్యం అస్మద్వైరి వినాశనమ్ !!

**కర్కాటక రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ నాగాయానంతరూపాయ శేషరూప నమోస్తుతే !
సర్పరూప నమస్తుభ్యం నాగేంద్రాయ నమోనమః !!

**సింహ రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ విరాజిత పదద్వంద్వం శంఖచక్రాది హేతిభిః !
గరుత్మతా సవినయం స్తూయమానం ముదాన్వితమ్ !!

**కన్య రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ ఆధివ్యాధి మహామారి గ్రహపీడాపహారిణే !
ప్రాణాపహర్త్రే దైత్యానాం రామ ప్రాణాత్మనే నమః !!

**తుల రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ ఆయూరక్షతు వారాహి ధర్మం రక్షతు వైష్ణవి !
యశం కీర్తించ లక్ష్మీంచ ధనం విద్యాంచ చక్రిణి !!

**వృశ్చిక రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ గంగాధరం శశిధరం ఉమాకాంతం జగత్ప్రభుం !
దధతం జ్ఞాన ముద్రాం చ దక్షిణామూర్తి మాశ్రయే !!

**ధనస్సు రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ అంతర్బహిః ప్రకాశాయ అచింత్యాయాత్మ రూపిణే !
అచ్యుతాయామరేషాయ పరస్మై జ్యోతిషే నమః !!

**మకర రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ తరుణీ శాంభవీ ఛిన్నఫాలా సాభద్రదాయినీ !
ఉగ్రా ఉగ్ర ప్రభా నీలా కృష్ణనీలా సరస్వతీ !!

**కుంభ రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ మేధాం విద్యాం బల ప్రజ్ఞాం సంపదం పుత్ర పౌత్రకం ।
దేహిమే శారదా దేవి స్మరామి ముఖ సంస్థితాం ॥

**మీన రాశి వారు ఈ సంవత్సరం పఠించవలసిన ధ్యాన శ్లోకం**



శ్లో॥ రక్తమాల్యాంబరధరం భూషణై రరుణైర్యుతం !
ఏవమాత్మని వాతీరే ధ్యాయేద్దేవం సుదర్శనం !!

**రాశి ఫలితములు ఈ సంవత్సరము గ్రహసంచారమును బట్టి వ్రాయడం జరిగింది. ప్రతి ఒక్కరి జాతకం వారి జన్మ జాతకము ద్వారా లభ్యమగును. ఇతర వివరములకై సిద్ధాంతి గారిని సంప్రదించగలరు. 9963732303, 9550017546, 9866839560.**

| నక్షత్ర, రాశి, గణ నాడీ పొంతనములు చూచుటకు సులభ చక్రము | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| **ప్రథమాక్షరాలు** | **నక్షత్రం** | **వర్గు** | **గణం** | **నాడి** | **రాశి** | **అదృష్ట దిశ** | **అదృష్ట వారం** |
| **చు,చె,చో,ల.** | **అశ్విని** | గుఱ్ఱం | దేవ | ఆది | మేషం | నైఋతి | గురు |
| **లీ,లు,లే,లో.** | **భరణి** | ఏనుగు | మనుష్య | మధ్య | మేషం | పడమర | శుక్ర |
| **అ,ఈ,ఊ,ఏ.** | **కృత్తిక** | మేక | రాక్షస | పార్శ్వ | 1మే,3వృ | తూర్పు | ఆది |
| **ఓ,వా,వీ,వు.** | **రోహిణి** | పాము | మనుష్య | పార్శ్వ | వృషభం | ఉత్తరం | సోమ |
| **వే,వో,కా,కి.** | **మృగశిర** | పాము | దేవ | మధ్య | 2వృ,2మి | దక్షిణం | మంగళ |
| **కూ,ఘం,జ్ఞ,ఛ.** | **ఆర్ద్రా** | కుక్క | మనుష్య | ఆది | మిధునం | వాయవ్యం | శుక్ర |
| **కే,కో,హా,హి.** | **పునర్వసు** | పిల్లి | దేవ | ఆది | 3మి,1కర్కా | ఈశాన్యం | గురు |
| **హూ,హే,హో,డ.** | **పుష్యమి** | మేక | దేవ | మధ్య | కర్కాటకం | దక్షిణం | శని |
| **డీ,డు,డే,డో.** | **అశ్రేష** | పిల్లి | రాక్షస | పార్శ్వ | కర్కాటకం | ఉత్తరం | బుధ |
| **మా,మీ,మూ,మే.** | **మఖ** | ఎలుక | రాక్షస | పార్శ్వ | సింహం | నైఋతి | గురు |
| **మో,టా,టీ,టు.** | **పుబ్బ** | ఎలుక | మనుష్య | మధ్య | సింహం | పడమర | శుక్ర |
| **టే,టో,పా,పి.** | **ఉత్తర** | ఆవు | మనుష్య | ఆది | 1సిం, 3క | తూర్పు | ఆది |
| **పూ,ష,ణ,ఠా.** | **హస్త** | బఱ్ఱె | దేవ | ఆది | కన్యా | ఉత్తరం | సోమ |
| **పే,పో,రా,రి.** | **చిత్తా** | పులి | రాక్షస | మధ్య | 2క,2తు | దక్షిణం | మంగళ |
| **రూ,రే,రో,తా.** | **స్వాతి** | బఱ్ఱె | దేవ | పార్శ్వ | తుల | వాయవ్యం | శుక్ర |
| **తీ,తూ,తే,తో.** | **విశాఖ** | పులి | రాక్షస | పార్శ్వ | 3తుల,1వృ | ఈశాన్యం | గురు |
| **నా,ని,నూ,నే.** | **అనూరాధ** | లేడి | దేవ | మధ్య | వృశ్చికం | దక్షిణం | శని |
| **నో,యా,యీ,యు.** | **జ్యేష్ఠ** | లేడి | రాక్షస | ఆది | వృశ్చికం | ఉత్తరం | బుధ |
| **యే,యో,బా,బి.** | **మూల** | కుక్క | రాక్షస | ఆది | ధనస్సు | నైఋతి | గురు |
| **బూ,ధా,భా,ఢా.** | **పూర్వాషాఢ** | కోతి | మనుష్య | మధ్య | ధనస్సు | పడమర | శుక్ర |
| **బే,బో,జా,జి.** | **ఉత్తరాషాఢ** | ముంగీసు | మనుష్య | పార్శ్వ | 1ధ,3మక | తూర్పు | ఆది |
| **జూ,జే,జో,ఖ.** | **శ్రవణం** | కోతి | దేవ | పార్శ్వ | మకరం | ఉత్తరం | సోమ |
| **గా,గి,గూ,గే.** | **ధనిష్ఠ** | సింహం | రాక్షస | మధ్య | 2మ,2కుం | దక్షిణం | మంగళ |
| **గో,సా,సీ,సు.** | **శతతార** | గుఱ్ఱం | రాక్షస | ఆది | కుంభం | వాయవ్యం | శుక్ర |
| **సే,సో,దా,ది.** | **పూర్వాభాద్రా** | సింహం | మనుష్య | ఆది | 3కుం,1మీ | ఈశాన్యం | గురు |
| **దూ,శం,ఝా,థ** | **ఉత్తరాభాద్రా** | ఆవు | మనుష్య | మధ్య | మీనం | పడమర | శని |
| **దే,దో,చా,చి.** | **రేవతి** | ఏనుగు | దేవ | పార్శ్వ | మీనం | ఉత్తరం | బుధ |

**స్త్రీ రాశి నుండి పురుష రాశి వరకు లెక్కించవలయును.**

2-12 మృత్యువు, 12-2 ఆయువు, 3-11 సౌఖ్యము, 11-3 దుఃఖము, 4-10 ప్రీతి, 10-4 హాని, 5-9 శుభం, 9-5 దరిద్రం, 6-8 లాభం, **(పాఠాంతరే కలహం)** 8-6 పుత్ర లాభం,7-7 శుభం, ఈ విధముగా రాశి కూటములు తెలియవలెను.

# సందిగ్ధముగా ఉన్న పేర్లకు నక్షత్ర వివరణ

**శ్లో ॥ నామాఖిలస్య వ్యవహారేతుః శుభావహం కర్మసు భాగ్యహేతుః !**
**నామ్నైవ కీర్తిం లభతే మనుష్యః తతః ప్రశస్తం ఖలు నామకర్మ !!**

**శ్లో ॥ ద్వంద్వాక్షరంతు యత్రోక్తం ప్రథమాక్షర వర్జితమ్ !**
**ద్వందనామ ఇతి ప్రోక్తం ద్వితీయం నామసంగ్రహమ్ !!**

**శ్లో ॥ వర్ణేశ్వరం చైత్వమౌత్వం యత్రాదౌ వర్తతే సదా !**
**తత్రపూర్వాక్షరం గ్రాహ్యమిత్యుక్తం బ్రహ్మయామిళే !!**

| | |
|---|---|
| ప్రహ్లాద్, ప్లవన్, హ్లాదిని, క్లేష, లౌకిక, | **అశ్విని 4 పాదం** |
| ఐశ్వర్య, ఐంద్ర | **కృత్తిక 1 పాదం** |
| తృణ,ఋష్యశృంగ | **కృత్తిక 3 పాదం** |
| వృష, స్వప్న, స్వాతి | **రోహిణి 2 పాదం** |
| శ్వేత, వైకుంఠ | **మృగశిరా 1 పాదం** |
| కృష్ణ, కృపా, క్రాంతి | **మృగశిరా 3 పాదం** |
| కీర్తి | **మృగశిరా 4 పాదం** |
| జ్ఞానానంద | **ఆర్ద్రా 3 పాదం** |
| కౌసల్య, కైక, కైంకరి, కైలాసం | **పునర్వసు 1 పాదం** |
| మౌనిక | **పుబ్బ 1 పాదం** |
| మృగ,మృడ,ఫణి,పౌడి,స్పందన,పౌరోహిత | **ఉత్తర 3 పాదం** |
| క్షేమ, క్షేత్రపాల | **హస్త 2 పాదం** |
| ప్రభాకర్, బ్రహ్మ, భ్రామరి,భ్రమరాంబ, | |
| ప్రణీత,ప్రేమ,స్రవంతి,శ్రావణ్,శ్రావ్య | **చిత్త 3 పాదం** |
| శ్రీనివాస్, శ్రీకర్, శ్రీకాంత్, శ్రీధర్ | **చిత్త 4 పాదం** |
| ద్రోణ, ద్రౌపతి | **స్వాతి 3 పాదం** |
| సృజన్, హృష్ణ | **స్వాతి 1 పాదం** |
| స్నుష | **అనూరాధ 3 పాదం** |
| స్నేహ | **అనూరాధ 3 పాదం** |
| త్ర్యంబక | **జ్యేష్ఠ 2 పాదం** |
| శ్యామల, చ్యవన, చ్యుతి, జ్యోతి | **మూల 2 పాదం** |
| భీముడు | **మూల 4 పాదం** |
| భారతి, భైరవుడు,భావానంద | **పూర్వాషాఢ 3 పాదం** |
| ధూర్జటి, ధ్వజ, ధ్యాస, ధృవ | **పూర్వాషాఢ 2 పాదం** |
| ఖుతుబుద్దీన్, ఖైరున్నీస | **శ్రవణం 4 పాదం** |
| గౌతమి, గౌరి | **శతభిష 1 పాదం** |
| సౌందర్య | **పూ.భా. 2 పాదం** |
| దైవజ్ఞ, ద్రాక్ష, ద్వజ, ద్యుతి | **పూర్వాభాద్ర 3 పాదం** |
| శాంకరి,శౌనక,శోభ, శైలజ, శృత,శివ,శంకర్ | **ఉత్తరాభాద్ర 2 పాదం** |
| చైతన్య, చౌదన్య | **రేవతి 3 పాదం** |

# కలశ వృషభ చక్రం

**గృహారంభ, గృహ ప్రవేశ శుద్ధి కొరకు ఉపయోగపడు చక్రము.**

**సూర్యుడున్న నక్షత్రం నుండి నిత్య నక్షత్రం వరకు లెక్కించవలెను.**

| కలశ శుద్ధి | | | వృషభ చక్రం | | |
|---|---|---|---|---|---|
| 1 | శిరస్సు ... | **మృత్యుప్రదం** | 3 | శిరస్సు ... | **మృత్యుప్రదం** |
| 4 | తూర్పుభాగం ... | **పరదేశ గమనం** | 4 | ముందుకాళ్ళు ... | **దురవస్థ** |
| 4 | దక్షిణభాగం ... | **నిర్భయం** | 4 | వెనుకకాళ్ళు ... | **చిరకాల శుభం** |
| 4 | పశ్చిమభాగం ... | **ధాన్యవృద్ధి** | 3 | తోకయందు ... | **దేశ సంచారం** |
| 4 | ఉత్తరభాగం ... | **దరిద్రం** | 4 | ఎడమప్రక్క ... | **ధనవృద్ధి** |
| 4 | మధ్యభాగం ... | **సంతానహాని** | 4 | కుడి పార్శ్వం ... | **ధాన్యవృద్ధి** |
| 3 | కంఠస్థానం ... | **సంపద** | 3 | వృష్ట భాగం ... | **సంపద** |
| 3 | క్రింది భాగం... | **పూర్ణాయుష్యం** | 3 | ముఖం ... | **పశువృద్ధి** |

**వాస్తు పురుష స్థితి :** భాద్రపద, ఆశ్వీయుజ కార్తీక మాసములయందు తూర్పు శిరస్సుగాను మార్గశిర పుష్య మాఘ మాసములయందు దక్షిణ శిరస్సుగాను, జ్యేష్ట ఆషాఢ శ్రావణ మాసములయందు ఉత్తర శిరస్సుగాను, ఎడమవైపున పరుండి యుండును కావున అతని దృష్టి ప్రసరించిన దిక్కునకు పాదములుండిన దిక్కునకు గృహమును కట్టకూడదు.

**గండ పురుష స్థితి :** వైశాఖ, ఆషాఢ, కార్తీక, ఫాల్గుణ మాసములలో నాకాశమునను చైత్ర ఆశ్వీయుజ భాద్రపద మాఘ మాసములలో పాతాళమునను, జ్యేష్ట, శ్రావణ, మార్గశిర, పుష్య మాసములలో భూమియందును గండపురుషుడు సంచరించును. భూమి యందున్నప్పుడు రజస్వల, ప్రసూతి మొదలగునవి సంభవించిన అశుభము తక్కిన ప్రదేశములనుండునప్పుడు శుభము.

**మాసనామ చక్రము (ధర్మ సింధు వచనాత్)**

| మాసం | స్త్రీలకు | పురుషులకు | మాసం | స్త్రీలకు | పురుషులకు |
|---|---|---|---|---|---|
| చైత్రం | భూదేవి | వైకుంఠుడు | ఆశ్వీయుజం | చంద్రావతి | యోగీషుడు |
| వైశాఖం | కళ్యాణి | జనార్ధనుడు | కార్తీకం | లక్ష్మి | పుండరీకాక్షుడు |
| జ్యేష్ఠం | సత్యభామ | ఉపేంద్రుడు | మార్గశిరం | వాగ్దేవి | కృష్ణుడు |
| ఆషాఢం | పుణ్యవతి | యజ్ఞపురుషుడు | పుష్యం | పద్మావతి | అనంతుడు |
| శ్రావణం | రూపవతి | వాసుదేవుడు | మాఘం | శ్రీదేవి | అచ్యుతుడు |
| భాద్రపదం | ఇందుమతి | హరిః | ఫాల్గుణం | సావిత్రి | చక్రి |



## ప్రయాణమునకు
## ఆనందాది యోగ వివరణ



| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగం | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | ఆనంద | **ద్రవ్యలాభం** |
| భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | కాలదండ | **కార్యవిఘ్నం** |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | ధూమ్రాక్ష | **ధనహాని** |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | ప్రజాపతి | **కార్యసిద్ధి** |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | సౌమ్యక | **కార్యసిద్ధి** |
| ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ధ్వాంక్ష | **కార్యవిఘ్నం** |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | ధ్వజ | **రాజ్యలాభం** |
| పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | **లక్ష్మిలాభం** |
| ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | వజ్ర | **కలహం** |
| మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ఆర్ద్రా | ముద్గర | **మరణం** |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | ఛత్ర | **రాజ్యలాభం** |
| ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర | **కార్యసిద్ధి** |
| హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | మానవ | **స్త్రీలాభం** |
| చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | పద్మకః | **ఐశ్వర్యం** |
| స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | అంబ | **భోజనలాభం** |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత | **ద్రవ్యనాశః** |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు | **ప్రాణహాని** |
| జ్యేష్ట | ఆభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | కాలః | **కార్యహాని** |
| మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి | **కార్యసిద్ధి** |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభం | **శుభకార్యసిద్ధి** |
| ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృతం | **స్త్రీ సంతోషం** |
| అభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | ముసలం | **భోజనహాని** |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా | **అశుభం** |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉప | విశా | పూషా | మాతంగ | **స్వర్ణలాభం** |
| శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | రాక్షస | **క్లేశం** |
| పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | చర | **దుర్వార్త శ్రవణం** |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థితి | **కార్యసిద్ధి** |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | వర్ధమాన | **శయ్యాలాభం** |

**వారశూలలు :-** శని, సోమ తూర్పు, గురు దక్షిణం, ఆది, శుక్ర పశ్చిమం మంగళ, బుధ ఉత్తరం వారశూలలు ఐనందున ఆ దిక్కున ప్రయాణం పనికిరాదు.

**ప్రయాణమునకు పనికి వచ్చునవి :-** మంగళవారం తూర్పు, సోమ, శనివారములు దక్షిణం, బుధ,గురువారంపశ్చిమం,ఆది,శుక్రవారములుఉత్తరదిక్కునకుప్రయాణంచేయుట శుభప్రదము.

## తారాబల చక్రం ( దినాధిపతుల నిర్ణయము )

| నిత్య నక్షత్రములు → | అశ్విని | భరణి | కృత్తిక | రోహిణి | మృగ | ఆర్ద్రా | పునర్వ | పుష్య | ఆశ్రేష |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జన్మ నక్షత్రములు | మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వాతి | విశాఖ | అనూ | జ్యేష్ఠ |
| ↓ | మూల | పూ.షా. | ఉ.షా. | శ్రవణం | ధనిష్ఠ | శత | పూ.భా. | ఉ.భా. | రేవతి |
| అశ్వి-మఖ-ముల | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర |
| భర-పుబ్బ-పూ.షా. | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర |
| కృత్తి-ఉత్త-ఉ.షా. | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన |
| రోహి-హస్త-శ్రవ | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన |
| మృగ-చిత్త-ధని | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ |
| ఆర్ద్రా-స్వాతి-శత | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ |
| పున-విశా-పూ.భా. | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ | విపత్ |
| పుష్య-అనూ-ఉ.భా. | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ | సంపత్ |
| ఆశ్రే-జ్యేష్ఠ-రేవతి | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమైత్ర | జన్మ |

**జన్మనక్షత్రం మొదలుకొని నిత్య నక్షత్రం వరకు గణించి వచ్చిన ఫలితాన్ని 9 చే భాగించగా శేషం** =

1 - జన్మతార - మయూరవాహనారూఢుడైన సూర్యుడధిపతి
2 - సంపత్తార - అశ్వవాహనారూఢుడైన బుధుడు అధిపతి
3 - విపత్తార - మేషారూఢుడైన రాహువు అధిపతి
4 - క్షేమతార - గజారూఢుడైన గురుడు అధిపతి
5 - ప్రత్యక్తార - వాయసారూఢుడైన కేతువు అధిపతి
6 - సాధనతార - జంబుకారూఢుడైన చంద్రుడు అధిపతి
7 - నైధనతార - సింహారూఢుడైన శని అధిపతి
8 - మిత్రతార - గరుత్మంతాధిష్ఠిత శుక్రుడు అధిపతి
9 - పరమమిత్రతార - హంసాధిష్ఠిత కుజుడు అధిపతి

జన్మ, విపత్ ప్రత్యక్ నైధన తారలు దోషప్రదం.

**విశేషం : ప్రథమ జన్మతార, ద్వితీయ విపత్‌తార, తృతీయ ప్రత్యక్ తార, సర్వకాలమున నైధన తారను విడువవలెను.**

**జన్మతారకు** - **తోటకూర** దానం
**విపత్తారకు** - **గుడం** దానం
**ప్రత్యక్తారకు** - **లవణదానం**
**నైధనతారకు** - **సువర్ణ** సహిత తిలలు దానమిచ్చిన దోషము తొలగునని శాస్త్ర వచనం.

## దినాధిపతుల, తారాబల ఫలములు

**1. రవి : (జన్మతార)** శారీరక శ్రమ అధికమగుట, శిరోవేదన, మానసిక ఆందోళనలు, అధిక శ్రమతో కార్యసఫలము, రాజకీయచర్చలు, అకాల భోజనము, విశ్రాంతి లేక సంచారము, సాయంత్రము వేళ శుభకార్యప్రాప్తి ధనలాభాదులు, గొప్పవారి దర్శనము.

**2. చంద్ర : (సాధనతార)** మిత్రులను,బంధువులను కలుసుకొనుట, గైరవ మర్యాదలు వృద్ధిచెందుట, ఆకస్మిక ఆనందములు, కార్యసిద్ధి, కుటుంబ సంతోషములు, స్త్రీ సౌఖ్యము, సంతోషవార్తలు వినుట, నూతన, వస్త్రధారణ, ధనప్రాప్తి, సద్గురువుల దర్శనము.

**3. కుజ : (పరమమిత్రతార)** ధనప్రయత్నములు, వ్యాపార, వృత్తియందు చర్చలు, ధనప్రాప్తి, ఎరుపు వస్తువులందు శ్రద్ధ, కఠిన వాదములు, శరీర చికిత్సలు కలుగును. పశువులు కొనుటకు, అమ్ముటకు, ప్రయాణములు చేయుట, ఆత్మస్తుతి, పరనింద.

**4. బుధుడు : (సంపత్తార)** శ్రమతో పనులు పూర్తి అగుట, శుభవార్తాశ్రవణము , యాత్రలు చేయుట, ఉద్యోగ, వృత్తులందు వ్యాపారములందు కొత్త ఆలోచనలు కలుగుట , శుభకార్యసిద్ధి, ఋణప్రాప్తి, వేదాంత శాస్త్ర విలాసవంతులతో గోష్ఠి, దైవతారాధన.

**5. గురువు : (క్షేమతార)** కార్యానుకూలము, శుచిత్వముపై శ్రద్ధ, గౌరవ వృద్ధి, సుఖ భోజనము, దైవపూజలు నూతన శుభ దర్శనములు కుటుంబ సౌఖ్యములు కులాచార ధర్మములాచరించుట, మిత్రుల కలయిక, పుణ్యకార్యములు చేయుట, స్వల్పమిత్ర విరోధములు, వృత్తి, ఉద్యోగములందు శ్రమఅధికం, అధికారుల మన్ననలు.

**6. శుక్ర : (మిత్రతార)** సుఖ వస్తువులపై ఇష్టత, కుటుంబ సౌఖ్యము, స్త్రీలతో ఆనందోత్సవములు, విలాస వస్తు సందర్శన, వస్తువాహనాదులు కొనుగోలు చేయుట, మిత్రులను కలుసుకొనుట, వృత్తియందు స్వల్పముగా చాంచల్య స్త్రీలతో వైరములు శుభమూలక చర్చలకు, ఋణములు తొలగుట, కళాకారులను కలుసుకొనుట.

**7. శని : (నైధనతార)** దేహబాధ, అలసట, తొందరపాటుతనము, కష్టనష్టములు ఏర్పడుట, మనోవేదన, పూర్వ వైరములు పెంచుకొనుట, వ్యతిరేక వాదములు, శరీరశ్రమ కొన్ని ప్రయాణములందు కార్య విఘాతములు, శ్రమతో కార్యనిర్వాహణ, వాహన సేవ.

**8. రాహు : (విపత్తార)** ఆకస్మిక కలహములు, భూసంబంధ చర్చలు, ఆరోగ్య లోపము, శతృవీక్షణ, శతృబాధ, ఆకస్మిక నిందలు, కార్యవిలంబనములు, జంతు, విషశస్త్ర బాధలు కల్గును. దుర్వార్తాశ్రవణము, కోపస్వభావము, మలిన వస్త్రధారణ,ఆడంబరమునకై వృధా ప్రయత్నములు, అకాల భోజనములు, విరక్తి, సాహసకార్యములకై యత్నించుట.

**9. కేతువు : (ప్రత్యక్తార)** శ్రమాధిక్యము, దేవతా సందర్శనములు, జంతు సంబంధమైన ఇబ్బందులు,చోరభీతి, కిందివర్గంతో, స్త్రీ, పురుషులలో వైరములు, దైవభక్తి, వృత్తియందు ఉద్యోగములందు కోపముతో సంచరించుట, అధికారుల వలన మాటలు పడుట,

## ప్రతి దిన హోరా చక్రము

**ప్రతీ హోర 1 గంట కాలము ఉండును.** **దివా హోరలు**

| | 6-7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **ఆది** | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| **సోమ** | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| **మంగ** | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| **బుధ** | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| **గురు** | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| **శుక్ర** | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| **శని** | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

### రాత్రి హోరలు

| | 6-7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **ఆది** | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| **సోమ** | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| **మంగ** | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| **బుధ** | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| **గురు** | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| **శుక్ర** | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| **శని** | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

**సూర్యోదయము 6-00 గం॥లకు అయినప్పుడు పై హోరలను తీసు కోవలయును. సూర్యోదయానికి 1 గంట కలిపిన అధిపతి వచ్చును.**

భూమికి పై భాగమున చంద్రుడు, చంద్రునికి పై భాగమున - బుధుడు, బుధుడికి పై భాగమున - శుక్రుడు, శుక్రునికి పై భాగమున - సూర్యుడు, సూర్యునికి పై భాగమున - కుజుడు, కుజునికి పై భాగమున - గురుడు, గురునికి పై భాగమున - శని, శనికి పై భాగమున నక్షత్ర మండలము కలదు.

సూర్య సిద్ధాంత గ్రంథమునందు చెప్పబడినట్లుగా భూమికి నాల్గవది మొదటి వారాధిపతిగా అతడి నుండి నాల్గవ వాడు ద్వితీయ వారాధిపతిగా ఈ విధముగా ఏడు వారములు ఏర్పడినవి. అదే విధముగా ఏ వారాధిపతికి అతడి హోర నుండే ఆ రోజు ప్రారంభమై మూడు పర్యాయములు తిరిగి, తిరిగి మరల ముగ్గురు హోరాధిపతులు పూర్తైయి నాల్గవ హోరాధిపతితో రెండవ రోజు ప్రారంభమగును.

**హోరాధిపతుల సూచిక : రవి, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, శని, గురుడు, కుజుడు ఈ విధంబుగా వారాలలో హోరలు ఏర్పడినవి.**

## హోరా కాలములో చేయు పనులు

**1. రవి :** రాజకీయ వ్యవహారములు, నోట్లు, దస్తావేజులు వ్రాయుటకు, క్రయవిక్రయాదులకు, ఉద్యోగ ప్రయత్నములకు, అప్లికేషనులు వ్రాయుటకు, సన్మానములకు, దావా, అపీళ్ళు చేయుటకు, ప్లీడర్లను, వైద్యులను కలుసుకొనుటకు సాహస కార్యములకు, అధికార దర్శనమునకు, చట్ట సంబంధమైన వ్యవ హారములు నడుపుటకు మంచిది.

**2. చంద్ర :** ఉద్యోగములో ప్రవేశం, వ్యవసాయం, తోటపనులు, పెద్దలను దర్శించుట, స్త్రీలను కలియుట, నీటి ప్రయాణము, గృహసంబంధ పనులు, నూతులు, చెఱువులు త్రవ్వుటకు, నూతన ఆభరణములు ధరించుటకు, వెండి పాత్రలు వాడుకొనుట, భుజించుట, తెలుపు వస్తు వ్యాపారములకు, స్థల మార్పులకు మంచిది.

**3. కుజ :** సాహస కార్యములకు, కృషికి, అగ్ని సంబంధమగు పనులు చేయుటకు, సైన్యములో చేరుటకు మంచిది. పొయ్యి వేయుటకు, శుభకార్యము లకు మంచిదికాదు. కష్టనష్టములు, విరోధములు, చిక్కులు కలుగును. అశుభమైనది. గ్యాస్ స్టౌ, ఫ్రిజ్, మిక్సీ, గ్రైండర్ మొ॥నవి వాడుటకు మంచిది.

**4. బుధ :** వ్యాపారమునకు సంబంధించిన పనులు, శుభ ప్రయత్నములు, నూతన కట్టుబడులకు, సమస్త వ్రాత పనులు, ప్రయాణమునకు, జ్యోతిష, శిల్ప, గణితములు నేర్చుకొనుటకు, రాయబారము సలుపుటకు, స్వర్ణ, వస్త్ర వ్యాపార విషయములకు మంచిది.

**5. గురు :** ఔషధ సేవకు, బాకీలు వసూళ్ళకు, లాటరీలు వేయుట, నూతన వస్తు వస్త్రాదులు ధరించుట, ఉద్యోగం, పిల్లలను ఉయ్యాలలో వేయుట, నూతన గ్రంథ పఠనము, వివాహ ప్రసంగములకు, అన్నిరకములైన శుభకార్యము లకు, ధనము బ్యాంకులలో నిల్వ చేయుటకు మంచిది.

**6. శుక్ర :** స్త్రీ – పురుషుల సమాగమం, శుభప్రయత్నములు, స్త్రీలతో ప్రసంగము, నూతన వస్తు వస్త్రధారణ, ప్రయాణం, ఔషదసేవ, పత్యం పెట్టుట, అలంకారములు చేయించుట. నిశ్చయ తాంబూలములకు, తీర్థయాత్రలు చేయుటకు, అధికారులకు కలుసుకొనుటకు, నూతన వాహనములు ఉపయోగించుటకు అన్నిటికి శుభం.

**7. శని :** సేవకావృత్తికి, ఇనుము, మినుగులు, నూనె, తారు కీలు, చేపలు, ఆయిల్స్, పాతయినుము వ్యాపారములకు, భూమి వ్యవహారములందు మంచిది. సేవకావృత్తియందు ప్రవేశించుటకు మంచిది. మిగిలిన ఎట్టి కార్యములు చేయరాదు.

# గౌరీ పంచాంగము

| గం॥ని॥ | (దివా ముహుర్తములు) ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | (రాత్రి ముహూర్తములు) ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7-30 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| 9-00 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 10-30 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం | జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | విషం |
| 12-00 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 1-30 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 3-00 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 4-00 | అమృ | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 6-00 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

# నవగ్రహములు ఇచ్చు స్థాన ఫలములు - దైవజ్ఞకర్ణామృతే

| గ్రహం | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవిః | చలనం | భయం | సంపత్ | హాని | చాపల్యం | శత్రునాశం | పీడా | రోగం | దుఃఖం | లాభం | జయం | వ్యయం |
| చంద్రః | సుఖం | వ్యయం | లాభం | హాని | కార్యహాని | శుభం | లాభం | మరణం | వైరం | లాభం | సుఖం | వ్యయం |
| కుజః | దుఃఖం | దౌర్భాగ్యం | లాభం | పీడ | భయం | ధనలాభం | అనర్ధం | భయం | వ్యయం | సుఖం | లాభం | రోగం |
| బుధః | బన్ధనం | సువర్ణం | పీడా | రిపుక్షయం | దరిద్రం | ఆభరణం | లాభం | సిద్ధి | నష్టం | లాభం | సుఖం | వ్యయం |
| గురుః | త్యాగం | ధనం | అనర్ధం | దరిద్రం | సంపద | క్లేశం | ఆరోగ్యం | నష్టం | లాభం | పీడ | లాభం | నష్టం |
| శుక్రః | ఆరోగ్యం | భూషణం | లాభం | రతి | ప్రియం | హాని | పీడా | భూలాభం | ధాన్యం | సంతోషం | ధనం | సుఖం |
| శనిః | ఆపద | హాని | సంపద | రోగం | నష్టం | లక్ష్మీ | దీనత్వం | మరణం | రోగం | సుఖం | లాభం | దరిద్రం |
| రాహు కేతు } | భయం | కలహం | భాగ్యం | మానహాని | వ్యయం | సుఖం | భయం | చౌర్యం | విరోధం | నష్టం | జయం | మరణం |

# శ్రీ దుర్ముఖి నామసంవత్సర నిర్ణయ పీఠిక

**శ్లో॥ అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్ !**
**వస్త్రైరాభరణైర్దైహ మలంకృత్య తతశ్శుచిః !!**
**విఘ్నేశం భారతీన్ ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్యచ !**
**సంవత్సర ఫలం సమ్యక్ఛృత్వా విప్రాన్ సమర్చయేత్ !!**
**యద్వర్షాదౌ నింబకుసుమం శర్కరామ్లఘృతైర్యుతం !**
**భక్షితం పూర్వయామేన తద్వర్షం సౌఖ్యదాయకమ్ !!**

## అథసృష్ట్యాది విచారః

స్వస్తిశ్రీ సూర్య సిద్ధాన్తానుసారేణ సకల శ్రౌత స్మార్త నిత్య కామ్య కర్మ అనుష్ఠాన సకల వ్యవహార సమస్త జగదుత్పత్తి స్థితి లయకారణ హేతు భూతస్య। శ్రీ మహావిష్ణోర్దివ్య నాభి కమల సముద్భూతస్య చతుర్ముఖ బ్రహ్మణః పరమాయుః వర్షశతం తత్రార్థం గతం, ద్వితీయ పరార్థే, శ్రీమత్ శ్వేత వరాహ కల్పే, ప్రథమ మాసే, ప్రథమ పక్షే, ప్రథమ దివసే, ద్వితీయ యామే, సూర్యోదయాది తృతీయ ముహూర్తె, త్రయోదశ ఘటికాయాం ద్విచాత్వారింశత్ విఘటికో పరియాతాః

| | |
|---|---|
| **సృష్ట్యాధిగతసౌరాబ్దాః** | **1955885117** |
| **వర్తమాన మహాయుగ గతాబ్దాః** | **3897216** |
| **వర్తమాన కలియుగ గతాబ్దాః** | **5117** |
| **శాలీవాహన శకగతాబ్దాః** | **1938** |
| **శ్రీమత్ శంకరాచార్య అవతారగతాబ్దాః** | **2088** |
| **ప్రభవాది గతాబ్దాః** | **30** |

## అబ్ద నిరూపణం

అథాస్మిన్ దేశలోక వ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యాః, చాంద్రమానేన చైత్ర శు॥ ౧ దివి 08-04-2016 భృగువార ప్రభృతి **శ్రీ "దుర్ముఖి"** నామ సంవత్సరః శ్రీశైలస్య దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యాః, సౌరమానేన చైత్ర శు॥ ౮ దివి 14-04-2016 బృహస్పతివార ప్రభృతి పునః రవి మేష సంక్రమణ పర్యన్తం **శ్రీ"దుర్ముఖి"** నామ సంవత్సరః. వింధ్యస్య ఉత్తరదేశే బార్హస్పత్య మానాబ్దోగ్రాహ్యాః, బార్హస్పత్యమానేన **శ్రీ "సౌమ్య"**నామ సంవత్సరః. సర్వత్ర ఫలదర్శనార్థం గురూదయాబ్దో గ్రాహ్యాః, సర్వత్ర గురూదయవశాత్ **"ఫాల్గుణాబ్దః"**॥

తత్ర అహిర్బుధ్నియ దేవతాకం షష్టమ యుగం వర్తమానం, అస్మిన్ మహాయుగే సంవత్సర పరివత్సర, ఇదావత్సర, అనువత్సర, ఇద్వత్సరాణాం మధ్యే రుద్ర దేవతాకం **"ఇద్వత్సర"** నామక సమస్త కళ్యాణభాజనస్య **శ్రీ "దుర్ముఖి" నామ సంవత్సరః.**

# శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ఫలితాంశ నిర్ణయం

శ్లో॥ **శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహమ్ ।**
**గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణామ్ ॥**
**ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదమ్ ।**
**నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగమాకర్ణ్యతామ్ ॥**

శ్లో॥ **మరీచిః దుర్ముఖాఖ్యానం మన్యుం మర్కటమాశ్రితమ్ ।**
**వివృతాస్యం జగద్భీతిదాయకం సంశ్రయేముదే ॥**

శ్రీ **"దుర్ముఖి"** నామ సంవత్సరమునకు అధిదేవత రక్త వర్ణపు ముఖముతో గదను, వృక్షమును, ఖడ్గమును, శూలమును చేతధరించి క్రోధరూపుడైన **"మరీచి"** అను నామధేయము కలిగిన శ్రీ సూర్యభగవానుడు. ఈ దుర్ముఖి నామ సంవత్సరం **12** మాసములతో **354** రోజులతో విరాజిల్లుతున్నది.

ఈ సంవత్సరమున నృపాధిపత్యం **శుక్రునకు,** మంత్రిత్వం **బుధునకు,** సేనాధిపత్యం, అర్ఘాధిపత్యం, మేఘాధిపత్యములు అను 3 ఆధిపత్యములు **కుజునకు,** ధాన్యాధిపత్యం **గురునకు,** రసాధిపత్యము **చంద్రునకు,** సస్య, నీరసాధిపత్యములు **శనికి,** పశుపాలకాధిపత్యం **శ్రీకృష్ణునకు,** స్థానరక్షక, స్థానబహిష్కర్త్రాధిపత్యములు **యముడికి** కల్గినవి. సముద్ర రోహిణీ చక్రమునకు **సంధివాసము** కలుగుట వలన ఖండవర్షములు, సముద్ర, పర్వత ప్రాంత వర్షములు, చోరభయములు, శతృత్వములు అధికమగుట, ఆభరణాది సౌఖ్య వస్తువులకు ధరలధికమగుట జరుగును.

**ఈ సంవత్సరమున** గ్రహాధిపత్యములను పరిశీలించగా ప్రజల మన్ననలను పొందుటకు అనేకవిధములైన పథకములను ఏర్పాటు చేసిననూ అధికారుల అలసత్వం వలన ఆటంకములు అధికమగుట, రక్షణ వర్గం వారికి అధికారుల ఒత్తిడి అధికమగుట, రాష్ట్రముల మధ్య వైరము అధికమగుట, దొంగతనములు అధికమగుట, ఉగ్రవాద చర్యలను అరికట్టుటకు రక్షణ యంత్రాంగము అధికముగా శ్రమించవలసి వచ్చుట, ప్రకృతి వైపరీత్యముల వలన వచ్చు ఇబ్బందులను అరికట్టుటకు చేయు ప్రభుత్వ ప్రయత్నములు విజయవంతముగా పూర్తియగుట, స్త్రీలోలత్వం అధికమగుట, సౌఖ్యవస్తువుల ధరలు అధికమగుట, గోధుమలు, పెసలు, ఆవాలు, మినుములు, బొబ్బర్లు, పప్పుదినుసులు, వేరుశనగ, పత్తి, దూది, వెండి, బంగారం, కాగితం, కలప, బ్యాంక్ వాటాలు, నూనెల ధరలు అధికమగుట జరుగును.

**ఈ సంవత్సరమున** పరిశోధనారంగము యందు విశేషమైన మార్పులు వచ్చుట, మీడియారంగము యందు భారీమార్పులు వచ్చుట, నావికారంగములో దేశము ముందంజలో ఉండుట, క్రీడారంగముయందు ఆశించినంత గుర్తింపులు రాకపోవుట, అంతర్జాల మోసములు అధికమగుట, పాలక వర్గం వారికి సొంత విరోధులు అధికమగుట, భూసంబంధమైన వివాదములు, భారీకుంభకోణములు బయట పడుట, కొన్ని ప్రాంతముల

యందు జల ప్రళయములు వచ్చుట, జననష్టములు ఏర్పడుట, ఆషాఢ, శ్రావణ, భాద్రపద మాసముల యందు బంగారం,వెండి ధరలలో అధికమైన ఒడిదుడుకులు ఏర్పడుట, మంచు సంబంధమైన ప్రమాదములు ఏర్పడుట, స్త్రీలకు అధికారములు వచ్చుట, ప్రాంతీయ వర్గపోరులు అధికమగుట, ప్రజా పరిపాలకులు సమయోచితమైన పథకములను అమలు చేసినా వాటిని ఆచరణలోకి తీసుకువచ్చే అధికారుల నిర్లక్ష్యం వలన ప్రజలకు ఉపయుక్తం కాకపోవుట, సుగంధ ద్రవ్యములకు, భూములకు, గృహములకు, గృహనిర్మాణ సామాగ్రికి ధరలు అధకమగుట, బ్యాంక్ షేర్ మార్కెట్ విలువలు అధికమగుట, పన్నుశాతం పెరుగుట, నిత్యావసర వస్తువుల ధరలన్నీ అధికమగుట, వాయుసంబంధమైన పీడలు అధికమగుట, కొన్నిచోట్ల అల్పవృష్టులు, మరికొన్ని చోట్ల అతివృష్టులు, ప్రజలకు పన్నుభారములు అధికమగుట, ఉత్తర,పశ్చిమ ప్రాంతములయందు జననష్టములు వాటిల్లుట, ధాన్యాదుల ధరలధికమగుట, పాలకులకు పరస్పర విరోధములు అధికమగుట జరుగును.

**చైత్రాది** మాసత్రయమున ధాన్యములకు ధరలధికమగుట, రక్షణ శాఖవారికి పనిభారము అధికమగుట, ఉగ్రవాద చర్యలు అదుపుచేయుటకు అధికశ్రమ చేయుట, కర్మాగారములలో అగ్ని ప్రమాదములు ఏర్పడుట, ఆషాఢమున స్వల్ప మేఘములు, శ్రావణమున వాయు సహిత వర్షములు, అధికముగా గాలులు, కొన్నిచోట్ల వాయుపరమైన ఇబ్బందులు, నిత్యావసర వస్తువుల ధరలలో మార్పులధికమగుట, భాద్రపదమున ఖండవృష్టులు, ఆశ్వీయుజమున రసధాతువస్తువులకు ధరలు తగ్గుముఖం పట్టుట, కార్తీకాది మాస చతుష్టయమున రోగములు, దొంగతనములు అధికమగుట, జలసంబంధమైన విరోధములు అధికమగుట, పాలక వర్గం వారు సమస్యలను తగ్గించుకొనుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట జరుగును.

**ఈ సంవత్సరమున** 04-05-2016 బుధవారం ఉ॥ 08-31 ని॥ నుండి 28-05-2016 శనివారం మ॥ 01-28 ని॥ వరకు **వాస్తు కర్తరి.**

30-04-2016 శనివారం నుండి 13-07-2016 బుధవారం వరకు **శుక్రమౌఢ్యమి.**

11-09-2016 ఆదివారం నుండి 10-10-2016 సోమవారం వరకు **గురుమౌఢ్యమి.**

20-03-2017 సోమవారం నుండి 31-03-2017 శుక్రవారం వరకు **శుక్రమౌఢ్యమి.**

ఈ సంవత్సరం 12-08-2016 శుక్రవారం నుండి శ్రీ సార్ధ త్రికోటి తీర్థరాజ సహిత **కృష్ణా నదికి** పుష్కర ప్రారంభం జరుగును.

ఈ సంవత్సరమున భారతదేశమందు గ్రహణములు ఏమియూ లేవు.

ఈ సంవత్సరమునందు **4తూముల వర్షము, 3 తూములగాలితో 9 వీసముల పంటతో** దేశము క్షేమారోగ్యములతో సుభిక్షముగా ఉండును.

**స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేన మహిం మహీశాః ।**
**గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినో భవంతు ॥**

**॥ సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు శ్రీ శుభమస్తు ॥**

## వర్షలగ్న జగల్లగ్న ఫలితాంశములు

| | | | |
|---|---|---|---|
| చంద్ర రవిశుక్ర | బుధ | | |
| కేతు | వర్షలగ్న | | |
| | కుండలి | | (గురు) రాహు |
| | కుజ (శని) | | లగ్నం |

| | | | |
|---|---|---|---|
| శుక్ర | రవి బుధ | | చంద్ర |
| కేతు | జగల్లగ్న | | |
| | కుండలి | | రాహు (గురు) |
| | కుజ (శని) | లగ్నం | |

**శ్రీ దుర్ముఖినామ సంవత్సరం వర్షలగ్నం కన్యలగ్నం, అధిపతి బుధుడు. జగల్లగ్నం తుల లగ్నం, అధిపతి శుక్రుడు.**

**వర్షలగ్నమును** పరిశీలించగా లగ్నదశమాధిపతి అష్టమస్థానమందుండి ద్వితీయస్థానమును వీక్షించుట, ద్వితీయభాగ్యాధిపతి సప్తమమందు లాభవ్యయాధిపతితో కలిసి ఉచ్ఛస్థితితో లగ్నమును వీక్షించుట, తృతీయ అష్టమాధిపతి తృతీయమందు పంచమ షష్ఠమాధిపతితో కలిసి షష్ఠమభాగ్య దశమ స్థానములను వీక్షించుట, చతుర్థ సప్తమాధిపతి వ్యయమందు వక్రించి రాహువుతో కలిసి చతుర్థ షష్ఠమ అష్టమ స్థానములను వీక్షించుట, పంచమ షష్ఠమాధిపతి తృతీయమందు వక్రించి తృతీయాధిపతితో కలిసి పంచమ నవమ వ్యయస్థానములను వీక్షించుట, లాభ, వ్యయాధిపతులు సప్తమమందుండి లగ్నమును వీక్షించుట, గురుచండాల, రవిగురుపరివర్తన, సునభ, పుష్టి, సంచార, ద్విగ్రహ, త్రిగ్రహాది **యోగముల వలన**

సాఫ్ట్‌వేర్ రంగముయందు మంచి అభివృద్ధి వచ్చుట, వ్యాపారలావాదేవీలు అధికమగుట, నిరుద్యోగ సమస్య తగ్గుముఖం పట్టుట, పుణ్యకార్యక్రమములు అధికమగుట, దొంగతనములు ప్రబలుట, గృహములకు, గృహనిర్మాణ, అలంకార వస్తువులకు, స్థలములకు, వాహనాదులకు ధరలధికమగుట, మాదకద్రవ్యములు అధికమగుట, ఉగ్రవాదచర్యలు తగ్గించుటకు తీవ్ర ప్రయత్నములు చేయవలసి వచ్చుట, విమాన, రైలు ప్రయాణములలో ప్రమాదములు ఏర్పడుట, ప్రముఖులకు మరణభయములు ఏర్పడుట, విద్యా, వైద్యరంగములో భారీమార్పులు వచ్చుట, మీడియారంగం, సినీరంగం వారికి ఇబ్బందులు వాటిల్లుట, రక్షణశాఖకు మంచిగుర్తింపు వచ్చుట, ఆర్థికపరమైన ఒడిదుడుకులు తగ్గుముఖం పట్టుట, పక్కరాష్ట్రములవారితో సరిహద్దు ప్రాంతము వారితో లావాదేవీలు సరిగా కుదరక పోవుట, వర్గపోరులు, ఆధిపత్యపోరులు అధికమగుట, యజ్ఞయాగాది క్రతువులు ఆచరించువారు అధికమగుట, మతోన్మాదులవలన వైరములు అధికమగుట, జలసంబంధమైన వాయుసంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట, తూర్పు ప్రాంతముయందు ఉత్తర ప్రాంతముయందు

జనక్షయములు ఏర్పడుట జరుగును.

**జగలగ్నమును** పరిశీలించగా లగ్నాధిపతి షష్ఠమ స్థానమందుండి ఉచ్ఛస్థితితో వ్యయమును వీక్షించుట, ద్వితీయ సప్తమాధిపతి ద్వితీయస్థానమందు చతుర్థపంచమాధిపతితో కలిసి పంచమ అష్టమ భాగ్యస్థానములను వీక్షించుట, తృతీయ షష్ఠమాధిపతి లాభములో రాహువుతో కలిసి తృతీయ పంచమ సప్తమ స్థానములను వీక్షించుట, చతుర్థపంచమాధిపతి వక్రించి ద్వితీయమందుండి చతుర్థ అష్టమ లాభస్థానములను వీక్షించుట, భాగ్యవ్యయాధిపతి, లాభాధిపతులు సప్తమమందుండి లగ్నమును వీక్షించుట, దశమాధిపతి భాగ్యస్థానమందుండి తృతీయమును వీక్షించుట, బుధాదిత్య, రాజ, వసుమతి, అమల, శంఖ, ధన, ద్విగ్రహాది యోగముల వలన

**సంవత్సరార్థమున** మతమార్పిడిలు అధికమగుట, వర్గపోరులు, కులపోరులు అధికమగుట, బంగారం, వెండి, ఆభరణములకు, రాతివస్తువులకు, సౌఖ్యవస్తువులకు, ఎలక్ట్రానిక్ వస్తువులకు ధరలధికమగుట, పన్నుశాతం అధికమగుట, సాఫ్ట్‌వేర్ రంగమందు భారీకుంభకోణములు బయటపడుట, గ్యాస్, విద్యుత్, నీటి సంబంధమైన ఇబ్బందులు పాలక పక్షం వారికి ప్రశ్నార్థకముగా మారుట, మఠాధిపతులు, పీఠాధిపతులు, రాజకీయనాయకులు ఒకరిపై ఒకరు వ్యక్తిగత భేదాభిప్రాయములతో నిందించుకొనుట, తద్వారా విలువను పోగొట్టుకొనుట, పురావస్తుశాఖలో భారీమార్పులు, మంచిగుర్తింపులు వచ్చుట, నూతన రోగములు ప్రబలుట, ఇనుపకర్మాగారములయందు అగ్ని ప్రమాదములు ఏర్పడుట, ప్రముఖనాయకులకు గండములు ఏర్పడుట, అంతరిక్ష పరిశోధనలు, సాఫ్ట్‌వేర్ పరిశోధనలు సఫలమగుట, న్యాయాధికారులకు గౌరవ మర్యాదలు లభించుట, కవులకు, విద్వాంసులకు, భారీవ్యాపారస్తులకు, న్యాయాధిపతుల కు ప్రభుత్వ గుర్తింపులు వచ్చుట, వ్యవసాయరంగమునందు ఇబ్బందులు అధికమగుట, కీటక వాయుసంబంధమైన బాధలు అధికమగుట, ధాన్యములకు ధరలు అధికమగుట, చేనేత కార్మికులకు తగిన గుర్తింపులు వచ్చుట, కేంద్రమున ఆధిపత్యపోరు ఏర్పడుట, దేవాలయాదులకు విశేషమైన గుర్తింపు వచ్చుట, ప్రభత్వ సహకారము వలన చిన్నతరహా పరిశ్రమలు అభివృద్ధిచెందుట, ఆటుపోట్లు ఉన్ననూ అన్నిరంగముల యందు అభివృద్ధి ఏర్పడుట జరుగును.

కావున ప్రతిఒక్కరు ప్రతి గ్రామమందు గోవులను సేవించుట, వృక్ష సేవ చేయుట, సహస్రలింగార్చనలు, రుద్రయాగములు చేయుట, పండితులను, గురువులను, దైవజ్ఞులను సత్కరించుట, బీదలకు తెలుపు వస్త్రాలు దానం చేయటం వలన దేశమునందు శుభములు చేకూరును.

**- దైవానుగ్రహ సిద్ధిరస్తు -**

**- మంగళం మహత్ - శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ -**

# అబ్ద ఫలనిరూపణం

## శ్రీ దుర్ముఖి నామ సంవత్సరం

శ్లో॥ **దుర్ముఖాబ్దే మధ్యవృష్టిరీతి చౌరాకులాధరా !**
**మహావైరా మహీనాథా వీరవారణ వాజిభిః !!**

శ్రీ దుర్ముఖి నామ సంవత్సరమున దొంగలభయములధికమగుట, పరస్పర విరోధములు ఏర్పడుట, నూతన ఉద్యోగ యోగములు ఏర్పడుట, బ్రాహ్మణులకు నిలకడ లేక చంచలత్వములేర్పడుట, మధ్యవృష్టి, కొన్ని ప్రాంతముల యందు ఈతిబాధలు ఏర్పడుట, సైనిక, వాహన, అధికార, జల సంబంధమైన ఇబ్బందులు ప్రక్క ప్రభుత్వ ము వారితో అధికమగుట, సరిహద్దులలో యుద్ధవాతావరణములు ఏర్పడుట జరుగును.

## వత్సరారంభ భృగు వార ఫలం

శ్లో॥ **శుక్రస్య రాజ్యే బహు సస్యసంకులానుతీవ్ర వేగా స్సరితోంబురాశిభిః !**
**ఫలంతి వృక్షా బహు గోప్రసూతిః వసుంధరా పార్థివ సౌఖ్యసంయుతా !!**

శ్రీ దుర్ముఖి నామ సంవత్సరారంభము శుక్రవారం అగుట వలన పంటలు సమృద్ధిగా పండుట, నదులు జలములచే కళకళలాడుట, వృక్షములు బాగుగా ఫలించుట, గోవృద్ధి జరుగుట, అధికారములు రాజ్యమేలుట జరుగును.

## బార్హస్పత్యమానేన శ్రీ సౌమ్య నామ సంవత్సరం

శ్లో॥ **ధరణీ జల సంపూర్ణా సర్వ సస్య ఫలాన్వితా !**
**మిత్రసంప్రీతి రన్యోన్యం సౌమ్యాబ్దే సౌమ్యదాజనాః !!**

సౌమ్య వత్సరములో జలము వృద్ధిగా నుండుట, పంటలు బాగుగా పండుట, అన్యోన్యత్వము వృద్ధిచెందుట జరుగును.

## గురూదయ వశాత్ ఫాల్గుణాబ్ద ఫలం

శ్లో॥ **చోరాశ్చ ప్రబలాః స్త్రీణాం దౌర్భాగ్యం సుజనాః ఖలాః !**
**క్వచిద్వృష్టిః క్వచిత్ సస్యం క్వచిద్వృద్ధిశ్చ ఫాల్గుణే !!**

ఫాల్గుణాబ్దమున కొద్దిపాటి వర్షములు, సస్యములు మధ్యమముగా ఫలించుట, స్త్రీలకు మనోవేదన కలుగుట, దొంగల భయమధికమగుట, అధికారులు పరస్పర విరోధములు పొందుట, తూర్పు దక్షిణ ప్రాంతముల యందు నష్టములు వాటిల్లుట, మరికొన్ని ప్రాంతములయందు అనుకూల వాతావరణములు ఏర్పడుట జరుగును.

పంచవర్షాత్మకమగు యుగము(చక్రం)లో అహిర్బుధ్నియ ఆధిపత్యమైన 6వ యుగము(చక్రము)నందు ఇద్వత్సర నామక వత్సర ప్రీతికై **రుద్రుని ఆరాధించుట, రుద్రాభిషేకములు, శాన్తికళ్యాణ, బ్రహ్మోత్సవములు**, పౌష్టికమైన యాగములు, ధాన్యము, వెండి, తెలుపు వస్త్రములు దానముచేయుట, దేవాలయములను, అనాథశరణాలయములను నిర్మించుట, పోషించుట, **అన్నదానములు చేయుట,** వృక్షములను పెంచుట, **గురువులను, దైవజ్ఞులను, పండితులను సత్కరించుట** వలన శుభములు చేకూరును.

## శ్రీ దుర్ముఖి నామ సం॥ నాయక ఉపనాయక నిర్ణయః

| | | | | |
|---|---|---|---|---|
| వత్సరారంభం | **రాజ్ఞః** | రాష్ట్రాధిపః | శుభాధిపః | **శుక్రుడు** |
| మేష సంక్రమణం | **మంత్రిః** | దేశోద్యోగాధిపః | అశ్వాధిపః | **బుధుడు** |
| వృషభ సంక్రమణం | | పురోహితః | గజాధిపః | **శని** |
| మిథున సంక్రమణం | **అర్ఘాధిపః** | పశూనామధిపః | | **కుజుడు** |
| కర్కాటక సంక్రమణం | **సస్యాధిపః** | దేవాదయాధిపః | | **శని** |
| సింహ సంక్రమణం | **సేనాధిపః** | పురుషాధిపః | | **కుజుడు** |
| కన్య సంక్రమణం | | పరీక్షకః | గ్రామనాయకః | **శుక్రుడు** |
| తుల సంక్రమణం | **రసాధిపః** | వస్త్రాధిపః | | **చంద్రుడు** |
| వృశ్చిక సంక్రమణం | | గ్రామపాలకః | రత్నాధిపః | **కుజుడు** |
| ధను స్సంక్రమణం | **ధాన్యాధిపః** | వృక్షాధిపః | | **గురుడు** |
| మకర సంక్రమణం | **నీరసాధిపః** | జంగమాధిపః | | **శని** |
| కుంభ సంక్రమణం | | గణకః | సర్పాధిపః | **సూర్యుడు** |
| మీన సంక్రమణం | | దైవజ్ఞః | మృగాధిపః | **కుజుడు** |
| ఆర్ద్రా ప్రవేశం | **మేఘాధిపః** | స్త్రీణామధిపః | | **కుజుడు** |
| కుంభాయనం | | | వర్షాధిపః | **గురుడు** |
| మీనాయనం | | | తటాకాధిపః | **శని** |

**నాయక, ఉపనాయకులు 32 మందిలో 13 మంది శుభులు, 19 మంది అశుభులు.**

**అశుభాధిపత్యం అధికంగా ఉన్నది.**

## దేశఫల నిర్ణయం

**శ్లో॥** కాంభోజ కాశ్మీర కళింగ దేశే రాజ్ఞ ఫలం । బాహ్లిక మాళవేషు మంత్ర్యుద్భవం ।
పౌంద్ర విధర్భదేశే సస్యాధినాథస్య ఫలంతు శిష్టం ।
చీనాంగ వంగదేశేషు రసాధిఫలం జగుః ।
గౌడమాగధ దేశేషు నీరసాధిపతేః ఫలం । **ఆంధ్రదేశేషు** సర్వేషు ఫలమార్ద్రాదిజం భవేత్ ।
మేషరాశిఫలం మత్స్యే గౌడే శేషంతు సర్వతః ।
పురోహితోద్భవం వంగేష్వంగేషు చ పరిక్షకమ్ ।
కైరాతదేశే గణకాత్ కృకరే గ్రామపాలకమ్ ।
దైవజ్ఞాద్బర్బరేదేశే కాశ్మీరే మేషసంక్రమాత్ ॥
**సంవత్సరఫలంశృత్వా** యస్సాంవత్సరికోత్తమమ్ ।
సంతోషయతి తేనైవ తోషితాస్సకలా గ్రహాః ॥

# రాజాది నవనాయక ఫలములు

## రాజా శుక్రః

**శ్లో॥ సమృద్ధసస్యా వసుధా సువృష్టిః గావోహి సంపూర్ణ పయః ప్రదాస్స్యుః !**
**ప్రియాః ప్రియాణాం జనయంతి తోషం కామోపచారైః భృగజేబ్దనాథే !!**

శుక్రుడు రాజు అగుట వలన మంచివర్షములు కురియుట, పంటలు సమృద్ధిగా నుండుట, పశువులు పుష్కలముగా పాలుఇచ్చుట, యువతీ యువకులు కామలోలసులై ఉండుట, వెండి, బంగారం, కుసుమధాన్యము, తెల్లని ధాన్యములు, వజ్రములు, మణులు, ఆహారధాన్యములు, పట్టు,ముత్యములు, జొన్న, సజ్జ, కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యములు, చింతపండు, పసుపు, కషాయదినుసులు, మిర్చి, మిరియాలు, నూనెగింజలు, వేరుశనగ, తెల్లనిరంగు గాజుపాత్రలు, అద్దములు, రాగి, వెండి, వ్యాపార వాటాలు షేర్ల విలువలు, పన్నుశాతముల ధరలు పెరుగును.

## వాహన ఫలము

**శ్లో॥ గజారూఢే వత్సరశ్చ సుభిక్షంచ ప్రజాసుఖం !**
**వర్షాకాలే సువృష్టిశ్చ సుఖినః సర్వాజంతవః !!**

రాజు గజారూఢుడగుటచే సుభిక్షము, సుభిక్షము, ప్రజాసౌఖ్యము కలుగును.

## మంత్రి బుధః

**శ్లో॥ వాయునా పీడితా మేఘాస్సర్వే పాపరతానరాః !**
**సోమ పుత్రస్య మంత్రిత్వే జాయతే మధ్యమం ఫలం !!**

బుధుడు మంత్రి అగుట వలన మహావాయువులు ఏర్పడుట, పాప సంబంధమైన కార్యక్రమములు అధికమగుట, మధ్యమ ఫలితములు ఏర్పడుట జరుగును.

## సైన్యాధిపతి కుజః

**శ్లో॥ ఆతంకపీడా భువి సస్యనాశో లోకాస్సమస్తా జ్వలితా భవన్తి !**
**అత్యన్త యుద్ధం క్షితిపాలకానాం సైన్యాధిపత్యే ధరణీసుతస్య !!**

కుజుడు సైన్యాధిపతి (రక్షణశాఖకు) అధిపతి అగుటవలన పాలకులకు నిత్యము యుద్ధములు ఏర్పడుట, రక్షణ శాఖవారికి కొత్తకొత్త సమస్యలు ఏర్పడుట, అడవులు, వనములు అగ్నికి ఆహుతి అగుట, సోదర విరోధములు అధికమగుట జరుగును.

## సస్యాధిపతి శనిః

**శ్లో॥ తిలమాష కుళుత్థాది కృష్ణధాన్యాని యానిచ !**
**కృష్ణభూమి స్సుఫలితా మందే సస్యాధిపేసతి !!**

శని సస్యాధిపతి అగుట వలన నల్లని భూములు, నల్లని ధాన్యములు బాగుగా ఫలించుట, నువ్వులు, మినుములు, అవిసెలు, నల్లధాన్యములు, ఉలవలు, చింతపండు, పొగాకు, చర్మములు, ఇనుము, యంత్రపరికరములు, కర్ర, బొగ్గు ధరలు సరసమగును.

**ధాన్యాధిపతి గురుః**

**శ్లో॥ సువృష్టిః సర్వదేశేషు సర్వ సస్య సమృద్ధయః !**
**భవంతిగావః సుదుఘాః గురౌ ధాన్యాధిపేసతి !!**

గురుడు ధాన్యాధిపతి అగుట వలన సువృష్టులు, పాడిపంటలు వృద్ధిచెందుట జరుగును.

**అర్ఘాధిపతి కుజః**

**శ్లో॥ అర్ఘాధీశే భౌమే భూపానాం భూరిభీతిదం యుద్ధం !**
**కృషిపణ్యా గవాంహానిః లోహిత ధాన్యార్ఘ వృద్ధిస్యాత్ !!**

కుజుడు అర్ఘాధిపతి అగుట వలన ముంబయి, కలకత్తా, ఢిల్లి ప్రాంతములయందు వ్యాపారపరముగా భారీ కుంభకోణములు బయటపడుట, వ్యాపార నష్టములు వాటిల్లుట, వెండి, బంగారం, కందులు, మిర్చి, వేరుశనగ, ఇనుము, ఉక్కు, రాగి, సీసం, ఇత్తడి, సత్తు మొదలగువాటికి ధరలధికమగును.

**మేఘాధిపతి కుజః**

**శ్లో॥ అతివాయురనర్ఘశ్చ స్వల్పవృష్టిః తథాభువి !**
**రక్తసస్యాని జాయంతే భౌమే మేఘాధిపేసతి !!**

కుజుడు మేఘాధిపతి అగుట వలన వాయుసంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట, ధరలు అధికమగుట, ఎర్రని ధాన్యములు బాగుగా ఫలించుట జరుగును.

**రసాధిపతి చంద్రః**

**శ్లో॥ ఘృత తైల గుడ క్షౌద్ర పయాంసి దధిశర్కరాః !**
**అర్ఘ వృద్ధ్యా ప్రజాయేత చంద్రో యది రసాధిపః !!**

చంద్రుడు రసాధిపతి అగుట వలన నెయ్యి, నూనెగింజలు, కొబ్బరినూనె, వేరుశనగనూనె, ఆముదము, నువ్వులనూనె, కిరోసిన్, పెట్రోల్, డిజిల్, బెల్లం, చెరకు, తేనె, పాలు, పెరుగు, పంచదార, చింతపండు, కూరగాయలకు ధరలధికమగును.

**నీరసాధిపతి శనిః**

**శ్లో॥ అయఃపిండస్య లోహస్య కృష్ణవస్త్రాది వస్తూనాం !**
**అర్ఘవృద్ధి సదాలోకే నీరసేశే శనైశ్చరే !!**
**స్వర్ణ మణిరత్న మౌక్తిక చందన కర్పూర రజతనాశస్స్యాత్ !**
**రవి తనయే నీరసపే లోహత్రపు తైల వృద్ధిశ్చ !!**

శని నీరసాధిపతి అగుట వలన బంగారం, వెండి, రత్నములు, ముత్యములు, చందనము, కర్పూరము ధరలధికమగును, ఇనుము, ఇత్తడి, నూనెలకు ధరలు తగ్గుముఖము పట్టును, షేర్ మార్కెట్ విలువలు, బ్యాంక్ వాటాల విలువలు పెరుగును, నలుపు రంగు వస్తువులు, నీలి రంగు వస్తువులు చౌకయగును.

## పశుపాలకః శ్రీ కృష్ణః

**శ్లో॥ పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘ సంపదః !**
**సంపూర్ణ తృణ వృష్టిశ్చ శ్రీ కృష్ణే పశునాయకే !!**

పశుపాలకత్వం శ్రీకృష్ణునకు వచ్చుట వలన పాడిపంటలు వృద్ధిచెందుట, పశుసంపద వృద్ధిచెందుట జరుగును.

## గోష్టప్రాపకః గోష్ట బహిష్కర్తా యమః

**శ్లో॥ పశుపీడాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా గవాం !**
**యమే గోష్ఠ ప్రాపకేతు బహిష్కారక ఏవచ !!**

గోష్టప్రాపక,గోష్టబహిష్కర్త్రాధిపత్యములు యమునికి వచ్చుట వలన స్వదేశీ పశుసంపదకు అనారోగ్యములు వాటిల్లుట, విదేశీ పశుసంపదలకు గిరాకీ అధికమగును.

## నీల నామాకో మేఘః తత్ఫలం

**శ్లో॥ నీలమేఘం నిరాలంబం అల్పవృష్టిః అనర్ఘతా !**
**అశోభనంచ జీవానాం నీలమేఘస్య లక్షణం !!**

ఉత్తర ప్రాంతములయందు అల్పవృష్టులు ఏర్పడుట, ధాన్యాదులకు ధరలధికమగుట, జనక్షయములేర్పడుట, రోగములు ప్రబలుట, మేఘాడంబరములు ఏర్పడుట జరుగును.

## ఆఢక నిర్ణయము

**శ్లో॥ అశీతియోజనం దివ్యం విస్తీర్ణంచ ఉన్నతం శతం !**
**ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే !!**

**విభాగం ః- శ్లో॥ సప్తభాగాస్సముద్రేషు పర్వతేషు తథానవ !!**
**చతుర్భాగధరణ్యాంస్యు దేవం వర్షతిచ త్రిథ !!**

దేవమానముచే కొలుచు పాత్ర 80 యోజనముల విస్తీర్ణం, 100 యోజనముల ఎత్తు కలిగి 7 భాగములు సముద్రమందు, 9 భాగములు పర్వతములయందు, 4 భాగములు భూమియందు వర్షం కురుయుట జరుగును. 4 తూముల వర్షం, 3 తూముల గాలి, 9 వీసముల పంట కలుగును.

## భూ వాహక శంఖ నామ శేషః తత్ఫలం

**శ్లో॥ శంఖకాఖ్యే భూమివహే సుఖం భవతి భూతలే !!**

శంఖుడు భూవాహకుడు అగుట సుభిక్షములు, జంతువృద్ధి కలుగును.

## సముద్ర రోహిణి చక్రం - సంధి స్థానం తత్ఫలం

**శ్లో॥ సంధిసంస్థం యదా బ్రాహ్మభం జాయతే !**
**ఖండవృష్టిః తదా సర్వధాన్యాప్తయః !!**

రోహిణి సంధిస్థానమందు వసించుట వలన ఖండవృష్టి, ధరలధికమగును.

## గురు సంచార ఫలం

**శ్లో॥ సింహరాశిగతే జీవేనిస్వోభూసుర సజ్జనాః !**
**అతివృష్టిర్వాదిభయం నృపా యుద్ధే లయం యయుః !!**

**శ్లో॥ యదా కన్యాగతే జివే హృష్టాః పృష్టాః ధరాసురాః !**
**అధ్వరే నిరతాస్సర్వే సదాస్వస్థాః క్షితీశ్వరాః !!**

గురుడు సింహ, కన్యా రాశుల యందు సంచారము చేయుట వలన రాజులకు, సజ్జనులకు, బ్రాహ్మణులకు విరోధములధికమగుట, రోగములు ప్రబలుట, పాలకులకు వర్గపోరులధికమగుట, నిరుద్యోగ సమస్య అధికమగుట జరుగును.

## శని సంచార ఫలం

**శ్లో॥ ఆళిస్థితే రోగభయం ప్రజానాం భవేత్పశూనాం మృతి రర్కపుత్రే !**
**శ్రేణికులానాంచ గణస్యనాశో మహీపతీనాం ముపజాపనంస్యాత్ !!**
**శ్లో॥ ధనూరాశి స్థితే మందే భూపానాం మహోపద్రవః !**
**జనానాం వ్యాధిపీడా చక్షుఃపీడా శస్త్రబాధతః !!**
**శ్లో॥ ఐంద్రాది త్రితయే వక్రం కరోతి రవినందనః !**
**రాజ్యాధీశ మృతిం కుర్యాత్ ఋతుత్రయే !**
**జ్యేష్ఠా మూలం తథాషాఢా పుచ్ఛే కూర్మస్య సంస్థితా పారావతం బర్బరంచ అవంతీ పూర్వమాలవం !**
**సైంధవంచ సురాష్ట్రంచ హ్యావస్థానం త్రిరక్తకం ఏతే దేశా వినశ్యంతి కూర్మ పుచ్ఛస్య పీడనే !!**

శని వృశ్చిక, ధనస్సు రాశుల యందు, అనూరాధ, జ్యేష్ఠ, మూల నక్షత్రముల యందు సంచారము చేయుట వలన కాశ్మీర ప్రాంతములయందు, సరిహద్దు ప్రాంతముల యందు, రక్షకభటులకు, రాజపురోహితులకు, ప్రభుత్వ అధికారులకు బెడదలు అధికమగుట, రోగ భయములధికమగుట, అకాలమరణములు, పశ్చిమ, ఉత్తర ఈశాన్య ప్రాంతముల యందు కలహములు, కల్లోలములధికమగుట, ప్రముఖులైన పాలకులు అకాల మరణములు పొందుట, పారవతం, బర్బర, అవంతీ, పూర్వమాలవం, సైంధవం, సురాష్ట్రం, అగర్తల ప్రాంతముల యందు ప్రాణ నష్టములు వాటిల్లును.

# వాస్తుకర్తరి, మౌఢ్య, పుష్కర, నిర్ణయములు

## వాస్తుకర్తరి నిర్ణయము

ఈ సంవత్సరం చైత్ర బ॥ ౧౨ ద్వాదశి బుధవారం దివి.04-05-2016 న ఉ॥ 08-31 ని॥లకు వాస్తు కర్తరి(డొల్లు కర్తరి) ప్రారంభం.

దివి.11-05-2016 బుధవారం ఉ॥ 05-49 ని॥లకు నిజ కర్తరి ప్రారంభం.

దివి.28-05-2016 శనివారం మ॥01-28 ని॥లకు వాస్తుకర్తరి సమాప్తం.

**కర్తరి లో చేయకూడనివి :-** కర్తరి యందు వాస్తు సంబంధమైన పనులు కర్ర మట్టి రాయి వాటితో చేయుపనులు గృహారంభాలు, వాపికూప తటాకాదుల నిర్మాణము చేయకూడదు.

**కర్తరి లో చేయదగినివి :-** **శ్లో॥** **మౌంజీబంధే వివాహేచ ప్రవేశే యజ్ఞకర్మణి !**
**భరణీ కృత్తికా చైవ న దోషో మండపాదిషు !!**

ఉపనయనం, వివాహం, గృహప్రవేశం, యజ్ఞం, మండపాదులు గట్టుట చేయవచ్చును.

## శుక్ర మౌఢ్య నిర్ణయం

ఈ సంవత్సరం చైత్ర బ॥ ౮ అష్టమి శనివారం దివి. 30-04-2016 న రా॥11-26 ని॥లకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.

ఈ సంవత్సరం ఆషాఢ శు॥ ౯ నవమి బుధవారం దివి. 13-07-2016న ఉ॥07-39 ని॥లకు పశ్చాదుదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.

తిరిగి మరలా

ఈ సంవత్సరం ఫాల్గుణ బ॥ ౭ సప్తమి తత్కాల అష్టమి సోమవారం దివి. 20-03-2017 న సా॥05-02 ని॥లకు పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.

శ్రీ హేవిళంబి నామ సం॥ చైత్ర శు॥ ౪ చవితి తత్కాల పంచమి శుక్రవారం దివి. 31-03-2017న రా॥01-08 ని॥లకు ప్రాక్ ఉదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.

## గురు మౌఢ్య నిర్ణయం

ఈ సంవత్సరం భాద్రపద శు॥౯ నవమి తత్కాల దశమి ఆదివారం దివి. 11-09-2016 న రా॥తె॥03-09 ని॥లకు పశ్చాదస్తమిత గురుమౌఢ్యమి ప్రారంభం.

ఈ సంవత్సరం ఆశ్వీయుజ శు॥ ౯ నవమి సోమవారం దివి. 10-10-2016న సా॥05-51 ని॥లకు ప్రాక్ ఉదయ గురుమౌఢ్యమి సమాప్తం.

**పై మౌఢ్యములయందు శుభకార్యక్రమములు వర్జనీయము. కావున చేయకూడదు.**

## పుష్కర నిర్ణయం

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర శ్రావణ శు॥ ౮ అష్టమి తత్కాల నవమి గురువారం దివి. 11-08-2016 న రా॥ 09-28 ని॥లకు గురువు కన్యారాశిలో ప్రవేశిస్తున్నాడు.

రాత్రి సమయమందు ప్రవేశించడం వలన మరునాడు ఉదయం అనగా

దివి. 12-08-2016 నుండి శ్రీసార్ధత్రికోటి తీర్థరాజ సహిత **కృష్ణా నదికి** పుష్కర ప్రారంభము జరుగును.

**సూచన :-** గురు గ్రహం రాశి మారినప్పటి నుండి పన్నెండు రోజులపాటు పుష్కరములు జరుగును. అటువంటి పుణ్య సమయమునందు తృణము దానము చేసిననూ అనంతకోటి ఫలితములను ఇచ్చును. కావున పుష్కర సమయమునందు దానాదులు, జపాదులు, పితృదేవతల సంతృప్తికై చేయు పితృకర్మలు చేసిన శుభములు చేకూరును.

**"పూర్తివివరములకు కృష్ణా పుష్కర ప్రత్యేక వ్యాసము చూడగలరు."**

# గ్రహణ నిర్ణయము

**ఈ సంవత్సరమందు భారతదేశమందు కనిపించు గ్రహణములు ఏమియూ లేవు.**

**భారతదేశమున కనిపించని గ్రహణములు**

**01-09-2016** న **కంకణాకార సూర్యగ్రహణం** ఆఫ్రిక, అట్లాంటిక్, హిందూ మహాసముద్ర ప్రాంతములయందు కనిపించును.

**26-02-2017** న **కంకణాకార సూర్యగ్రహణం** సౌత్ అమెరిక, అట్లాంటిక్, అంటార్కిటిక, ఆఫ్రిక, చీలి, ఫసిఫిక్ మహాసముద్ర ప్రాంతముల యందు కనిపించును.

**16-09-2016** న **ప్రచ్ఛాయ చంద్రగ్రహణం** యూరప్, ఆఫ్రిక, ఆసియా, ఆస్ట్రేలియా, పశ్చిమ ఫసిఫిక్ సముద్ర ప్రాంతములయందు కనిపించును.

**11-02-2017** న **ప్రచ్ఛాయ చంద్రగ్రహణం** యూరప్, అమెరికా, ఆఫ్రిక, ఆసియా, ప్రాంతములయందు కనిపించును.

కనిపించని గ్రహణములకు నియమములు పాటించవలసిన అవసరములేదు.

**రవిచారౌ ఆర్ద్రా ప్రవేశ కాలఫలమ్**

**శ్రీ దుర్ముఖి నామ సంవత్సరం జేష్ఠ బ॥ ప్రతిపద తత్కాల బ॥విదియ మంగళవారం దివి. 21-06-2016 న రా॥ 11-00-45 సె॥కు శ్రీ సూర్య భగవానుడు ఆర్ద్రా నక్షత్రములో ప్రవేశించుచున్నాడు.**

| | | |
|---|---|---|
| బ॥ విదియ తిథి | - | **సస్యవృద్ధిః** |
| మంగళవారం | - | **శిలావృష్టి** |
| పూర్వాషాఢ నక్షత్రం | - | **సుభిక్షం** |
| బ్రాహ్మ్యం యోగం | - | **జనక్షయం** |
| తైతుల కరణం | - | **శుభం** |
| కుంభ లగ్నం | - | **అర్ఘనాశం** |
| నిశీ కాలం | - | **జలప్రళయం** |
| ధరణీమండలే | - | **జనక్షయం** |

| శ్రీ దుర్ముఖి నామ సం॥ వర్ష ధాన్యాదుల నిర్ణయము | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వర్షం | - | 05 | మాత్సర్యం | - | 13 | నిద్ర | - | 09 |
| ధాన్యం | - | 07 | సుఖం | - | 03 | ఆలస్యం | - | 06 |
| శీతం | - | 13 | దుఃఖం | - | 07 | ఉద్యోగం | - | 09 |
| తృణం | - | 07 | భోగం | - | 09 | శాంతం | - | 10 |
| ఉష్ణం | - | 17 | విడంబం | - | 09 | క్రోధం | - | 09 |
| మరుతం | - | 13 | మనోవేదన | - | 07 | డంబం | - | 05 |
| ప్రజావృద్ధి | - | 15 | ద్వేషం | - | 03 | మిత్రబేధం | - | 04 |
| తన్నాశం | - | 15 | ప్రతిష్ఠ | - | 15 | ఇష్టత | - | 10 |
| రాజత్వం | - | 11 | అప్రతిష్ఠ | - | 09 | రసనిష్పత్తి | - | 07 |
| ఉగ్రం | - | 05 | ద్యూతం | - | 19 | ఫలనిష్పత్తి | - | 09 |
| పుణ్యం | - | 05 | మత్తత | - | 11 | ఉత్సాహం | - | 08 |
| పాపం | - | 05 | పురుషోత్పత్తి | - | 19 | **జ్ఞానం** | - | 17 |
| **వ్యాధి** | - | 13 | స్త్రీ ఉత్పత్తి | - | 09 | అజ్ఞానం | - | 03 |
| ఉపశమనం | - | 13 | ధాతువాదం | - | 15 | కపటం | - | 17 |
| ఆచారం | - | 19 | భయం | - | 03 | నిష్కపటం | - | 07 |
| అనాచారం | - | 19 | శౌర్యం | - | 07 | ధార్మికం | - | 09 |
| జననం | - | 17 | దుష్టనిగ్రహం | - | 11 | అధార్మికం | - | 03 |
| మరణం | - | 17 | శిష్టపాలనం | - | 15 | **గో వృద్ధి** | - | 07 |
| దేశోపప్లవం | - | 05 | సత్యం | - | 19 | తన్నాశం | - | 13 |
| దేశస్వాస్థ్యం | - | 19 | అసత్యం | - | 05 | సస్యకీటవృద్ధి | - | 04 |
| చోరభయం | - | 11 | విశ్వాసం | - | 07 | తన్నాశం | - | 13 |
| తన్నాశం | - | 17 | అవిశ్వాసం | - | 09 | శరభవృద్ధి | - | 01 |
| అగ్నిభయం | - | 05 | దయ | - | 11 | తన్నాశం | - | 01 |
| శాంతి | - | 11 | నిర్దయ | - | 13 | మశకవృద్ధి | - | 01 |
| మృగవృద్ధి | - | 03 | న్యాయం | - | 15 | తన్నాశం | - | 07 |
| మృగ దుర్భిక్షం | - | 17 | అన్యాయం | - | 17 | మత్కుణవృద్ధి | - | 04 |
| కీటకభయం | - | 03 | **సస్యవృద్ధి** | - | 07 | తన్నాశం | - | 07 |
| తన్నాశం | - | 13 | తన్నాశం | - | 04 | వృశ్చికవృద్ధి | - | 10 |
| మూషకోద్భవం | - | 15 | పశువృద్ధి | - | 04 | తన్నాశం | - | 10 |
| తన్నాశం | - | 09 | తన్నాశం | - | 07 | వ్యాఘ్రవృద్ధి | - | 13 |
| సర్పవృద్ధి | - | 13 | శుకవృద్ధి | - | 07 | తన్నాశం | - | 10 |
| తన్నాశం | - | 11 | తన్నాశం | - | 07 | **పక్షివృద్ధి** | - | 03 |
| కామం | - | 03 | ధృమవృద్ధి | - | 08 | తన్నాశం | - | 02 |
| లోభం | - | 07 | తన్నాశం | - | 08 | ధేనువృద్ధి | - | 01 |
| మోహం | - | 07 | **క్షుధ** | - | 04 | తన్నాశం | - | 01 |
| మదం | - | 03 | తృష్ణ | - | 05 | మహిషవృద్ధి | - | 05 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తన్నాశం | - 05 | **సువర్ణవృద్ధి** | - 00 | ధాత్రీవృద్ధి | - 01 |
| మృగవృద్ధి | - 01 | రజితవృద్ధి | - 02 | **అతివృష్టి** | - 17 |
| తన్నాశం | - 04 | తామ్రవృద్ధి | - 08 | అనావృష్టి | - 17 |
| ఖగవృద్ధి | - 04 | కాంస్యవృద్ధి | - 02 | మూషికవృద్ధి | - 11 |
| తన్నాశం | - 01 | లోహవృద్ధి | - 12 | శలభవృద్ధి | - 03 |
| అశ్వవృద్ధి | - 03 | అయస్కాంతవృద్ధి | - 08 | శుకవృద్ధి | - 09 |
| తన్నాశం | - 03 | త్రపువృద్ధి | - 10 | స్వచక్రవృద్ధి | - 03 |
| గజవృద్ధి | - 01 | సీసవృద్ధి | - 10 | పరచక్రవృద్ధి | - 17 |
| తన్నాశం | - 01 | రసవృద్ధి | - 06 | **స్వప్న** | - 00 |
| ఉష్ట్రవృద్ధి | - 02 | **వ్రీహివృద్ధి** | - 14 | సుషుప్తి | - 02 |
| తన్నాశం | - 02 | శాలివృద్ధి | - 14 | జాగ్రత | - 08 |
| విప్రవృద్ధి | - 03 | కుళుత్థవృద్ధి | - 14 | పైశూన్య | - 02 |
| తన్నాశం | - 02 | తిలవృద్ధి | - 02 | క్రోధం | - 12 |
| క్షత్రియవృద్ధి | - 05 | మాషవృద్ధి | - 10 | సంగవం | - 08 |
| తన్నాశం | - 04 | ముద్గవృద్ధి | - 08 | జ్ఞానం | - 10 |
| వైశ్యవృద్ధి | - 04 | సర్షపవృద్ధి | - 02 | అజ్ఞానం | - 10 |
| తన్నాశం | - 01 | చణకవృద్ధి | - 14 | భుక్తి | - 06 |
| శూద్రవృద్ధి | - 05 | ఆఢకవృద్ధి | - 14 | ధ్యానం | - 00 |
| తన్నాశం | - 03 | గోధుమవృద్ధి | - 12 | **అండజవృద్ధి** | - 05 |
| మ్లేచ్ఛవృద్ధి | - 04 | కోద్రవవృద్ధి | - 04 | తన్నాశం | - 07 |
| తన్నాశం | - 04 | ప్రియంగవవృద్ధి | - 10 | స్వేదజవృద్ధి | - 13 |
| సంకరవృద్ధి | - 03 | యవవృద్ధి | - 12 | తన్నాశం | - 07 |
| తన్నాశం | - 01 | శ్యామావృద్ధి | - 06 | ఉద్భిజవృద్ధి | - 17 |
| నవరత్నవృద్ధి | - 03 | రాజమాషవృద్ధి | - 14 | తన్నాశం | - 13 |
| తన్నాశం | - 05 | నీవారవృద్ధి | - 16 | జరాయుజవృద్ధి | - 15 |
| మరకతవృద్ధి | - 02 | శింబుధాన్యవృద్ధి | - 12 | తన్నాశం | - 15 |
| మాణిక్యవృద్ధి | - 03 | **పనసవృద్ధి** | - 22 | స్థావరవృద్ధి | - 11 |
| వజ్రవృద్ధి | - 04 | నారికేళవృద్ధి | - 19 | తన్నాశం | - 05 |
| వైఢూర్యవృద్ధి | - 05 | మాతువృద్ధి | - 22 | జంగమవృద్ధి | - 05 |
| గోమేధికవృద్ధి | - 01 | జంబీరవృద్ధి | - 04 | తన్నాశం | - 05 |
| పుష్యరాగవృద్ధి | - 01 | ఖర్జూరవృద్ధి | - 10 | **విద్యుత్తు** | - 07 |
| ఇన్ద్రనీలవృద్ధి | - 01 | రంభాఫలవృద్ధి | - 19 | శిలాపాతం | - 00 |
| ప్రవాళవృద్ధి | - 01 | చూతఫలవృద్ధి | - 07 | గర్జితం | - 03 |
| మౌక్తికవృద్ధి | - 01 | కపిత్థవృద్ధి | - 19 | | |
| ఇతరరత్నవృద్ధి | - 01 | తింత్రిణీవృద్ధి | - 25 | | |

**Brahma Sri.DAIVAGNA SUBRAHMANYA SIDDHANTHY**
**e-mail: lssiddhanthy@gmail.com, 9963732303,9866839560**.

## కార్తెల చక్రం

| కార్తె పేరు | తేది | వారం | సమయం | | వాహనం | ఫలం |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | 13-04-2016 | బుధ | రా॥ | 07-48 | గాడిద | అల్పవృష్టి |
| భరణి | 27-04-2016 | బుధ | ఉ॥ | 11-43 | గుఱ్ఱం | సుభిక్షం |
| కృత్తిక | 11-05-2016 | బుధ | ఉ॥ | 05-49 | దున్న | అల్పవృష్టి |
| రోహిణి | 24-05-2016 | మంగళ | రా॥ | 02-07 | ఏనుగు | సుభిక్షం |
| మృగశిర | 07-06-2016 | మంగళ | రా॥ | 11-57 | కప్ప | సువృష్టి |
| ఆర్ద్రా | 21-06-2016 | మంగళ | రా॥ | 11-00 | నెమలి | మహావాయువు |
| పునర్వసు | 05-07-2016 | మంగళ | రా॥ | 10-34 | నక్క | సువృష్టి |
| పుష్యమి | 19-07-2016 | మంగళ | రా॥ | 10-07 | దున్న | అల్పవృష్టి |
| ఆశ్రేష | 02-08-2016 | మంగళ | రా॥ | 09-01 | గుఱ్ఱం | సుభిక్షం |
| మఖ | 16-08-2016 | మంగళ | సా॥ | 06-40 | కప్ప | సువృష్టి |
| పుబ్బ | 30-08-2016 | మంగళ | మ॥ | 02-39 | ఏనుగు | సుభిక్షం |
| ఉత్తర | 13-09-2016 | మంగళ | ఉ॥ | 08-28 | ఎలుక | పర్వత వృష్టి |
| హస్త | 26-09-2016 | సోమ | రా॥ | 12-01 | నెమలి | మహావాయువు |
| చిత్త | 10-10-2016 | సోమ | మ॥ | 12-55 | ఏనుగు | సుభిక్షం |
| స్వాతి | 23-10-2016 | ఆది | రా॥ | 11-29 | మేక | నిర్జలం |
| విశాఖ | 06-11-2016 | ఆది | ఉ॥ | 07-32 | నెమలి | మహావాయువు |
| అనూరాధ | 19-11-2016 | శని | మ॥ | 01-38 | ఎలుక | పర్వత వృష్టి |
| జ్యేష్ఠ | 02-12-2016 | శుక్ర | సా॥ | 05-52 | కప్ప | సువృష్టి |
| మూల | 15-12-2016 | గురు | రా॥ | 08-55 | గాడిద | అల్పవృష్టి |

శ్లో॥ స్త్రీ స్త్రీ వ్యసనంకుర్యాత్ స్త్రీ పుంసోర్వృష్టిరుచ్యతే ।
స్త్రీ నపుంసకయోర్వాయుః పురుషః పురుశ్చదాహకః ॥

శ్లో॥ ఆఖుశ్చ స్వల్పవృష్టిశ్చ జంబుకే జలదాగమః ।
మండూకమత్యన్త వృష్టిశ్చ ఖర మహిష నిర్జలః ॥

శ్లో॥ అజశ్చ నిర్జలః ప్రోక్తం గజాశ్వశ్చ సుభిక్ష కృత్ ।
మయూరశ్చ మహావాయురిత్యేతద్వర్ష లక్షణమ్ ॥

శ్లో॥ ఋక్షం భాను ప్రవేశఘటికాయస్తద్దినం వారభం యుక్తం ।
పంచదశేన షష్ఠగుణితం నాగాప్తశేషం తథా ॥

శ్లో॥ వృష్టిశ్చేప్యతి వృష్టి వహ్ని పవన వృష్టి వృష్ట్యాగమః ।
వృష్టిర్నాశముపైతి వృష్టిఫలదం విచింత్యేద్బుధః ॥

## కందాయ ఫలములు

| అ | భ | కృ | రో | మృ | ఆ | పు | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | ప్రథమం |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | ద్వితీయం |
| 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | తృతీయం |

| చి | స్వా | విశా | అనూ | జ్యే | ము | పూ.షా. | ఉ.షా. | శ్ర | ధ | శత | పూ.భా. | ఉ.భా. | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 |

**శ్లో॥ ఆదిశూన్యే మహా వ్యాధి ! మధ్య శూన్యే మనో వ్యథా !!**
**అంత్యశూన్యేర్థ నాశస్యాత్ ! త్రిశూన్యే నిష్ఫలం భవేత్ !!**
**విషమేష్వర్థ లాభస్యాత్ ! సమేతు సమతా భవేత్ !!**
**శూన్యేతు శూన్య మాప్నోతి ! కందాయ ఫలమీదృషం !!**

మొదటి సున్నా ఉన్నచో మహా వ్యాధి(భయం), మధ్య సున్నాఉన్నచో మనో వ్యధ(ఋణాధికం) చివరి సున్నా ఉన్నచో ధనహాని, మూడు సున్నాలు ఉన్నచో అనేకమగు ఇబ్బందులు కలుగును. సరిసంఖ్య వచ్చిన సమమైన ఫలితము, బేసిసంఖ్య వచ్చినచో ధనలాభము కలుగును. (ఒక్కొక్క కందాయము నాలుగు మాసములు ఫలితము నిచ్చును.)

## ఆదాయ వ్యయములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 02 | 08 | 01 | 07 |
| వృషభం | 11 | 14 | 04 | 07 |
| మిధునం | 14 | 11 | 07 | 07 |
| కర్కాటకం | 08 | 11 | 03 | 03 |
| సింహం | 11 | 05 | 06 | 03 |
| కన్య | 14 | 11 | 02 | 06 |
| తుల | 11 | 14 | 05 | 06 |
| వృశ్చికం | 02 | 08 | 01 | 02 |
| ధనస్సు | 05 | 14 | 04 | 02 |
| మకరం | 08 | 08 | 07 | 02 |
| కుంభం | 08 | 08 | 03 | 05 |
| మీనం | 05 | 14 | 06 | 05 |

## శ్రీ దుర్ముఖి నామ సం॥ పండుగల నిర్ణయం

### జ్యేష్ఠ బహుళ ఏకాదశి నిర్ణయం

ది.వి.30-06-2016 గురువారం జ్యేష్ఠ బ॥దశమి ఉ॥05-58, (౦-౩౩),
ఉపరి ఏకాదశి రా॥తె॥03-14 (౫౩-౪౩).
ది.వి.01-07-2016 శుక్రవారం జ్యేష్ఠ బ॥ద్వాదశి రా॥ 12-23, (౪౬-౩౫).
ది.వి.02-07-2016 శనివారం జ్యేష్ఠ బ॥త్రయోదశి రా॥ 09-33, (౩౯-౨౮).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ విద్ధాప్యేకాదశీ గ్రాహ్యా పరతో ద్వాదశీ యది ॥**

పై ఆధారముల వలన స్మార్తులు దివి. 30-06-16 గురువారం బ॥దశమి ఉపరి బ॥ఏకాదశి రోజున ఉపవసించి దివి. 01-07-16 శుక్రవారం బ॥ద్వాదశి రోజున పారణ చేయవలయును.

**శ్లో॥ విద్ధైకాదశీ యత్ర పరతో ద్వాదశీ యది ।**
**ద్వాదశ్యాముపవాసంచ త్రయోదశ్యాంతు పారణం ॥**

పై ఆధారముల వలన మధ్వ, వైష్ణవులు విద్ధ ఏకాదశిని విడిచిపెట్టి దివి. 01-07-16 శుక్రవారం బ॥ద్వాదశి రోజున ఉపవసించి దివి. 02-07-16 శనివారం బ॥ త్రయోదశి రోజున పారణ చేయవలయును.

### స్మార్త శ్రీకృష్ణాష్టమి నిర్ణయం

ది.వి.24-08-2016 బుధవారం శ్రావణ బ॥సప్తమి రా॥10-17, (౪౦-౪౧).
భరణి మ॥ 01-34, (౧౮-౫౩).
ది.వి.25-08-2016 గురువారం శ్రావణ బ॥అష్టమి రా॥08-07, (౩౫-౧౬).
కృత్తిక మ॥ 12-06, (౧౫-౧౩).
ది.వి.26-08-2016 శుక్రవారం శ్రావణ బ॥నవమి సా॥06-13, (౩౦-౩౦).
రోహిణి ఉ॥ 10-52, (౧౨-౭).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ అష్టంమ్యాం శ్రావణేమాసి కృష్ణపక్షే నరాధిప ।**
**అర్ధరాత్రే జగన్నాథో దేవక్యాం అవతారయేత్ ॥**

**శ్రావణ కృష్ణాష్టమి శ్రీ కృష్ణ జన్మాష్టామి । సా అర్ధరాత్ర వ్యాపిని గ్రాహ్యా ॥**

పై ఆధారముల వలన స్మార్తులకు నక్షత్రము కంటే తిథి ప్రాధాన్యము అధికము కావున అష్టమికి అర్ధరాత్రి వ్యాపినీత్వం కలిగిన దివి 24-08-2016 బుధవారం రోజుననే స్మార్తులు శ్రీకృష్ణాష్టమి వ్రతం ఆచరించవలయును.

### వైఖానస వైష్ణవ శ్రీకృష్ణాష్టమి నిర్ణయం

## శ్రీ దుర్ముఖి నామ సం॥ పండుగల నిర్ణయం

ది.వి.24-08-2016 బుధవారం శ్రావణ బ॥సప్తమి రా॥10-17, (౪౦-౪౧).
భరణి మ॥ 01-34, (౧౮-౫౩).
ది.వి.25-08-2016 గురువారం శ్రావణ బ॥అష్టమి రా॥08-07, (౩౫-౧౬).
కృత్తిక మ॥ 12-06, (౧౫-౧౩).
ది.వి.26-08-2016 శుక్రవారం శ్రావణ బ॥నవమి సా॥06-13, (౩౦-౩౦).
రోహిణి ఉ॥ 10-52, (౧౨-౭).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ వర్జనీయా ప్రయత్నేన సప్తమీ సంయుతాష్టమీ ।**
**సబుక్షాపి నకర్తవ్యా సంయుతాష్టమీ అపి ॥**

పై ఆధారముల వలన వైఖానసులకు పూర్వ విద్ధలేని అష్టమీతిథి ప్రాధాన్యము, పరవిద్ధయైన అష్టమి శ్రేష్ఠము, దివి 25-08-2016 గురువారం రోజుననే వైఖానసులు శ్రీకృష్ణాష్టమి వ్రతం ఆచరించవలయును.

### పాంచరాత్ర వైష్ణవ శ్రీకణ్ణన్ తిరు నక్షత్ర నిర్ణయం

ది.వి.24-08-2016 బుధవారం శ్రావణ బ॥సప్తమి రా॥10-17, (౪౦-౪౧).
భరణి మ॥ 01-34, (౧౮-౫౩).
ది.వి.25-08-2016 గురువారం శ్రావణ బ॥అష్టమి రా॥08-07, (౩౫-౧౬).
కృత్తిక మ॥ 12-06, (౧౫-౧౩).
ది.వి.26-08-2016 శుక్రవారం శ్రావణ బ॥నవమి సా॥06-13, (౩౦-౩౦).
రోహిణి ఉ॥ 10-52, (౧౨-౭).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ అష్టమీ సప్తమీయుక్త రోహిణీ కృత్తికాన్వితా ।**
**తద్దినం వర్జయేద్ధీమాన్ తదన్యేవాసరే చరేత్ ॥**
**శ్లో॥ అష్టమ్యాం నవమ్యాం వా దశమ్యాం చ తథా పునః ।**
**మృగేణ సహితాష్టమ్యాం జయంత్యారాధనం కురు ॥**
**శ్లో॥ అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం యది రోహిణీ ।**
**సా జయన్తి ఇతి విఖ్యాతా విష్ణువ్రత పరాయణైః ॥**
**శ్లో॥ వాజి విద్ధాష్టమీ త్యాజ్యా వహ్ని విద్ధాచ రోహిణీ ।**
**దశమ్యామేకాదశీ విద్ధాహంతి పుణ్యం పురాకృతం ॥**

పై ఆధారముల వలన దివి. 26-08-2016 శుక్రవారం రోజున పాంచరాత్ర వైష్ణవులు గోకులాష్టమిని, శ్రీ కణ్ణన్‌తిరునక్షత్ర వ్రతములను ఆచరించవలయును.

# శ్రీ దుర్ముఖి నామ సం॥ పండుగల నిర్ణయం

## శ్రీ దేవీశ్వరన్నవరాత్రి కలశస్థాపన నిర్ణయం

దివి.01-10-2016 శనివారం ఆశ్వీయుజ శు॥పాడ్యమి పూర్తి 24గం॥, (౬౦-౦౦).
దివి.02-10-2016 ఆదివారం ఆశ్వీయుజ శు॥పాడ్యమి ఉ॥ 07-45, (౪-౬).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ సోదయత్రిముహూర్తాయాం కుర్యాద్దాన వ్రతానిచ।**
**ఉభయత్ర తథాత్వేతు పూర్వేద్యుస్తదనుష్ఠితః ॥**

**శ్లో॥ యాతిథిః పూర్వేద్యురుదయమారభ్య ప్రవృత్తా।**
**సాతిథిర్వృద్ధివశాత్ పరేద్యురుదయాదూర్ధ్వం విద్యమానాపి సాతిథిః పూర్వైవ గ్రాహ్యా ॥**
**దినద్వయే సోదయ ముహూర్తవ్యాప్తావపి పూర్వైవ గ్రాహ్యా ॥**

పై ఆధారముల వలన శు॥ప్రతిపద రెండురోజులయందు సూర్యోదయమునకు ఉన్ననూ పూర్వదినమే గ్రాహ్యం.
దివి. 01-10-16 శనివారం రోజుననే శరన్నవరాత్రి కలశస్థాపన చేయవలయును.

## శ్రీ సరస్వతీ పూజా నిర్ణయం

దివి.07-10-2016 శుక్రవారం ఆశ్వీయుజ శు॥షష్ఠి రా॥ 07-41, (౩౩-౫౩),
జ్యేష్ఠ మ॥02-26, (౨౦-౪౫).
దివి.08-10-2016 శనివారం ఆశ్వీయుజ శు॥సప్తమి రా॥ 09-24, (౩౮-౧౦),
మూల సా॥04-47, (౨౬-౩౮).

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ మూలాద్యృక్షత్రయే రాజన్ దేవీం పుస్తక రూపిణీం।**
**పూజయేత్ భక్తి భావేన శ్రవణార్క్షే విసర్జయేత్ ॥**

**శ్లో॥ మూలాదౌ పూజనం దేవ్యా శ్రృవాణాదౌ విసర్జనం।**
**తావుభౌ నిశిచేత్ స్యాతాముఖే ప్రాతః పరేహని ॥**

**శ్లో॥ ఏతత్సరస్వతీ పూజనం మూలస్యాద్య పాదే కార్యమ్।**
**శ్రవణాద్యపాదే విసర్జనం ॥**

పై ఆధారముల వలన మూలా నక్షత్రం మొదటి పాదములో పుస్తకరూపిణి, జ్ఞాన ప్రదాయిని అయిన సరస్వతీదేవిని ఆరాధించవలయును. మూలానక్షత్రం రాత్రి సమయములో (సూర్యాస్తమయం తరువాత) ప్రారంభమయితే మరునాడు ఉదయం ఆచరించవలయును. అట్లుగాక మధ్యాహ్నం నుండియే మూలా నక్షత్రం ఉండుట వలన మూలానక్షత్రం మొదటిపాదం ఉన్న దివి.07-10-16 శుక్రవారం రోజుననే సర్వులూ శ్రీసరస్వతీదేవి ఆరాధన చేయవలయును.

## శ్రీ దుర్ముఖి నామ సం॥ వర్షాది యోగములు

1. **చైత్రమాసం :** ఈ మాసమందు రవి దహన వాయు నాడుల యందు, కుజుడు దహన నాడులయందు, గురుడు జల నాడులయందు, శని వాయు నాడుల యందు సంచారం చేయుటచే ఉష్ణోగ్రతయందు మార్పులు ఏర్పడుట, అక్కడక్కడ స్వల్ప వర్షములు ఏర్పడుట, క్రమేపీ ఉష్ణోగ్రతలు పెరిగి వేడిగాలులు వీచుట జరుగును. ఏప్రియల్ 14,15,17,18,19 తేదీలయందు వాయు యుక్త వర్షములు ఏర్పడును.
2. **వైశాఖ మాసం :** ఈ మాసమునందు రవి దహన, వాయు నాడులయందు, కుజుడు దహన నాడుల యందు, గురుడు జలనాడులయందు, శని దహన నాడుల యందు సంచారం చేయుటచే ఉష్ణోగ్రతలు పెరుగుట, వాతావరణంలో అనుకూలత లేకపోవుట, అధిక వేడిగాలులు ఏర్పడుట, అక్కడక్కడ స్వల్ప వర్షములు, గాలి దుమారములు ఏర్పడుట జరుగును. మే 8,9,10,11,19,22, జూన్ 4,5,6 తేదీలయందు స్వల్పముగా వర్షసూచనలు, గాలిదుమారములు ఏర్పడును.
3. **జ్యేష్ఠమాసం :** ఈ మాసమందు రవి దహన నాడుల యందు, కుజుడు దహన నాడులయందు, గురుడు జల నాడులయందు, శని దహన నాడులయందు సంచారం చేయుటచే మిశ్రమ వాతవరణములు ఏర్పడుట, తేమ, వేడి శాతములు ఏర్పడుట, జూన్ 10,11,12,13,16,19,28,29 తేదీలయందు ఆకస్మిక వర్షములు ఉండును.
4. **ఆషాఢమాసం :** ఈ మాసమందు రవి రస, జల, అమృత నాడులయందు, కుజుడు దహన నాడులయందు, గురుడు జల నాడులయందు, శని వాయునాడుల యందు సంచారం చేయుటచే గాలులు అధికంగా ఏర్పడుట, తేమ శాతం పెరుగుట, మేఘములు ఏర్పడుట, సువృష్టులు కలుగుట జరుగును. జూలై 7,8,10,11, 12,13,15,16,17,28,29, అగస్ట్1,2,3 తేదీలయందు వర్షాభావం కలుగును.
5. **శ్రావణమాసం :** ఈ మాసమందు రవి అమృత నాడుల యందు, కుజుడు దహన నాడులయందు, గురుడు రసనాడులయందు, శని వాయునాడుల యందు సంచారం చేయుటచే వర్షాభావం ఏర్పడుట, పశ్చిమ ప్రాంతములయందు మేఘాడంబరంచేత వర్షములు కురియుట, ఆగ్నేయ ప్రాంతములయందు జన నష్టములు ఏర్పడుట జరుగును. అగస్టు 25,26,27,28,29,30, తేదిలయందు వర్షములు కురియును.
6. **భాద్రపదమాసం :** ఈ మాసమందు రవి జల, రసనాడులయందు, కుజుడు వాయు, దహననాడులయందు, గురుడు రస నాడుల యందు, శని వాయునాడులయందు సంచారం చేయుటచే వర్షయోగములు ఏర్పడుట, పశ్చిమ వాయువ్య ప్రాంతములయందు అనావృష్టులు ఏర్పడుట జరుగును. సెప్టెంబర్ 23,24,25, 26,27,28,29 తేదిలయందు అక్కడక్కడ వర్షములు ఏర్పడును.

**7. ఆశ్వీయుజమాసం :** ఈ మాసమందు రవి సౌమ్య, దహన, వాయునాడుల యందు, కుజుడు మహావాయు నాడులయందు, గురుడు సౌమ్య నాడులయందు, శని వాయు నాడులయందు సంచారం చేయుటచే పశ్చిమ ప్రాంతము నందు, తూర్పు ఆగ్నేయ ప్రాంతములయందు జల సంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట జరుగును. అక్టోబర్ 21,22,24,25,27,29,30, తేదీల యందు వర్షాభావం కలుగును.

**8. కార్తీకమాసం :** ఈ మాసమందు రవి వాయు, దహన నాడులయందు, కుజుడు అమృత నాడులయందు, గురుడు జల నాడులయందు, శని వాయు నాడులయందు సంచారం చేయుటచే ఉష్ణోగ్రతలో మార్పులు ఏర్పడుట, పశ్చిమ నైరుతి ప్రాంతముల యందు వర్షాభావములు ఏర్పడుట జరుగును. నవంబర్ 1,2,5,6,7,9, 13,19,20,24,26 తేదీలయందు వాయు,జల జలభయములు ఏర్పడుట జరుగును.

**9. మార్గశిరమాసం :** ఈ మాసమందు రవి వాయు, దహన నాడులయందు, కుజుడు రస, జల అమృత నాడులయందు, గురుడు దహన నాడులయందు, శని దహన, వాయు నాడులయందు, సంచారం చేయుటచే తేమ శాతం అధికముగా ఉండుట, వాతవరణంలో మార్పులు ఏర్పడుట, చలితీవ్రత కొద్దికొద్దిగా పెరుగుట, పొగ మంచులేర్పడుట, డిసెంబర్ 12,13,15,16,17,23,24,25,27, తేదీలయందు మంచుజల్లులు అధికమగుట జరుగును.

**10. పుష్యమాసం :** ఈ మాసమందు రవి సౌమ్య, రస నాడులయందు, కుజుడు రస సౌమ్య నాడులయందు, గురుడు దహన నాడులయందు, శని వాయునాడుల యందు సంచాంరం చేయుటచే చలిగాలులు అధికముగా వీచుట, ఉత్తర వాయవ్యప్రాంతము ల యందు చల్లనిగాలులు అధికముగా ఉండుట, పొగ మంచులేర్పడుట, ఆగ్నేయ ప్రాంతములయందు జల సంబంధ విఘాతములు ఏర్పడుట జరుగును.

**11. మాఘమాసం :** ఈ మాసమందు రవి అమృత, జలనాడులయందు, కుజుడు సౌమ్య, దహననాడులయందు, గురుడు దహననాడులయందు శని దహన నాడులయందు సంచారం చేయుటచే పశ్చిమ దక్షిణ ప్రాంతముల యందు తేమ శాతం అధికముగా పెరుగుట, చల్లని గాలులు వీచుట, కొన్ని ప్రాంతములయందు ఫిబ్రవరి 11,14,15,17,19,20 తేదీలయందు చిరుజల్లుల పడుట జరుగును.

**12. ఫాల్గుణమాసం :** ఈ మాసమందు రవి జల, రస, సౌమ్యనాడులయందు, కుజుడు దహన, వాయు నాడులయందు, గురుడు దహన నాడులయందు, శని వాయునాడుల యందు సంచారం చేయుటచే చల్లని గాలులు క్రమేపి తగ్గుట, వాతవరణమందు క్రమేపి ఉష్ణోగ్రత పెరుగుట, దక్షిణఆగ్నేయ ప్రాంతములయందు మంచుతో కూడిన జల్లులు పడుట, చల్లదనం తగ్గుట, గాలులువీచుట జరుగును. మార్చి11,12,13,14,15 తేదీలయందు చిరుజల్లుల పడుట జరుగును.

## శ్రీ దుర్ముఖి నామ సం॥ అర్ఘానర్ఘములు (సరుకుల ధరలు)

శ్లో॥ సౌమ్యవేధే సమార్ఘత్వం క్రూరవేధే మహార్ఘతా !
దేశ కాలశ్చ వస్తూని గ్రహవేధే త్రిభిస్మృతః !!

1. **చైత్రమాసం :** ఈ మాసములో 5 శుక్రవారములు వచ్చుట వలన బంగారం, వెండి, సుగంధ ద్రవ్యములు, అలంకార వస్తువుల ధరలు పెరుగును. రసాయనములు, మనులు, పగడాలు, ముత్యములకు, వజ్రములకు, వాహనములకు ధరలు పెరుగును. నూనె, బెల్లం, వస్త్రములు, కొబ్బరి, పసుపు, కందుల ధరలు తగ్గుముఖం పట్టును. షేర్ మార్కెట్ విలువలలో అధికమగు మార్పులు ఏర్పడును. కాగితం, కలప ధరలు పెరుగును. కాగితం ముద్రణ ధరలు స్వల్పముగా పెరుగును.
2. **వైశాఖమాసం :** ఈ మాసములో 5 శని, 5ఆది వారములు వచ్చుట వలన నువ్వులు, వంటనూనెల ధరలు పెరుగును. పత్తి, బంగారం, ధరలు స్వల్పముగా తగ్గుట, గృహోపకరణముల ధరలు, గృహముల ధరలు పెరుగుట, నెయ్యి, కూరగాయలు, యంత్రములకు వాహనములకు, షేర్ మార్కెట్‌కు విలువలు పెరుగును. పాలు, పాల పదార్థములకు పొగాకు పదార్థములకు ధరలు స్వల్పముగా తగ్గును. పండ్లధరలు కొద్దిగా తగ్గుముఖం పట్టును. పూలధరలు పెరుగును.
3. **జ్యేష్ఠమాసం :** ఈ మాసములో 5 సోమవారములు వచ్చుట వలన తెల్లని ధాన్యములకు, వస్త్రములకు, పాల ఉత్పత్తులకు, కొబ్బరి, గోధుమలు, జొన్నలకు ధరలు పెరుగను. వెండి, బంగారం, లోహాలకు ధరలలో స్వల్పముగా మార్పులు ఏర్పడును. అలంకార వస్తువులకు, ఆహార పదార్థములకు, పసుపు, ముత్యములకు, బెల్లం, సుగంధ ద్రవ్యములకు ధరలు పెరుగును. షేర్ మార్కెట్‌లలో హెచ్చుతగ్గులు అధికమగును. నిర్మాణ ధరలు అధికమగును.
4. **ఆషాఢమాసం :** ఈ మాసములో 5 మంగళవారములు వచ్చుట వలన శనగలు, కందులు, ఎర్రని పదార్థములకు, ఎలక్ట్రానిక్ వస్తువులకు, చెఱకు, పత్తి, నువ్వులకు, పాలఉత్పత్తులకు, మాంసమునకు ధరలు పెరుగును. బంగారం, వెండి, రాగి, ఇత్తడి, లోహముల ధరలు కొద్దిగా పెరుగును. గృహోపకరణములు, వెల్లుల్లి, పసుపు, ముత్యముల ధరలలో స్వల్పముగా మార్పులు ఏర్పడును. చమురు పదార్థములు, కూరగాయలు, మినుములు, బొబ్బర్లు, దుంపకూరలకు ధరలు పెరుగును.
5. **శ్రావణమాసం :** ఈ మాసములో 5 బుధ, 5 గురువారములు వచ్చుట వలన ధాన్యములకు, సజ్జలు, జొన్నలు, దుంపపదార్థములు, కాఫీ గింజలు, కంబళ్లు, పూలు, పండ్లు, చందనము, మిర్చి, కాగితము ధరలు పెరుగను. రత్నాదుల, వస్త్రముల, శనగల ధరలు మాసారంభంలో కొద్దిగా పెరిగి మాసాంతమున స్వల్పముగా తగ్గును. కలప ధరలో హెచ్చుతగ్గులు ఏర్పడును. పశుసంపదకు కంచు లోహములకు, వైద్య రంగమునందు ధరలు పెరుగును.
6. **భాద్రపదమాసం :** ఈ మాసములో 5 శుక్రవారములు వచ్చుట వలన ఆహార పదార్థములకు, పత్తి, ఉప్పు, కొబ్బరి, బెల్లం, నెయ్యి, నూనె, బంగారం, లోహములకు పశుసంపదకు, తెలుపు పదార్థములకు, రత్నములకు, వాహనములకు ధరలు

పెరుగును. తేనే, పాలు, పెరుగు, ఆవాలు, మినుములు, కంబళ్ళకు ధరలు కొద్దిగా తగ్గును. గోమేధికం, వైడూర్యం, ముత్యముల ధరలు స్వల్పముగా పెరుగును. కూరగాయల, మాంసముల ధరలు తగ్గును.

7. **ఆశ్వీయుజమాసం :** ఈ మాసములో 5 శని, 5 ఆది వారములు వచ్చుట వలన ఆభరణములకు, రత్నములకు, నూనె పదార్థములకు, ఆముదమునకు, గృహోపకరణ వస్తువులకు, గృహనిర్మాణ వస్తువులకు (ఇనుము, సిమెంట్) ధరలు పెరుగును. పాదరసం, పాలు, వస్త్రముల ధరలు స్వల్పముగా తగ్గి మరల పెరుగును. పశుసంపద కు ధరలలో మార్పులు అధికమగును. ఎలక్ట్రానిక్ వస్తువులకు ధరలు అధికమగును. షేర్‌మార్కెట్ విలువలలో మార్పులు అధికమగును.

8. **కార్తీకమాసం :** ఈ మాసములో 5 సోమ, 5 మంగళ వారములు వచ్చుట వలన ఎర్రని ధాన్యములకు, ఎర్రని పదార్థముల ధరలు అధికమగుట, బంగారం, వెండి, రాగి, ఇత్తడి లోహముల ధరలు కొద్దిగా పెరిగి మరల కొద్దిగా తగ్గును. ఎలక్ట్రానిక్ వస్తువుల ధరలు మాసారంభంలో పెరిగి కొద్దిగా తగ్గును. గృహోపకరణములకు ధరలు అధికమగును. రత్నములకు ధాన్యములకు పుష్పములకు చెఱుకు, పత్తి, నువ్వులకు ధరలు పెరుగును.

9. **మార్గశిరమాసం :** ఈ మాసములో 5 బుధ 5 గురువారములు వచ్చుట వలన ఇనుము, సిమెంట్ ధరలు నిలకడగా ఉండును. సజ్జలు, జొన్నలు, ధాన్యములు, దుంప పదార్థములు, కాఫీ గింజలు, కంబళ్ళు, పూలు, పండ్ల ధరలు పెరుగును. చందనం, మిర్చి, కాగితం ధరలు పెరుగును. కూరగాయల ధరలు, రత్నాదుల ధరలు పెరుగును. కలప ధర మాసాంతమున తగ్గుముఖం పట్టును.

10. **పౌష్యమాసం :** ఈ మాసములో 5 శుక్రవారములు వచ్చుట వలన ఎర్రని ధాన్యములు, ఎర్రని పదార్థముల ధరలు అధికమగును. బంగారం, వెండి, రాగి, ఇత్తడి, లోహముల ధరలు కొద్దిగా పెరుగును. ఎలక్ట్రానిక్ వస్తువుల ధరలు మాసారంభంలో కొద్దిగా పెరిగి, మాసాంతమునకు కొద్దిగా తగ్గును. రియల్ ఎస్టేట్ రంగం మందకొడిగా సాగును. పాల ఉత్పత్తుల ధరలు పెరుగును. చెఱకు, పత్తి, నువ్వుల ధరలు పెరుగును.

11. **మాఘమాసం :** ఈ మాసములో 5 శని, 5ఆది వారములు వచ్చుట వలన నువ్వులు, వంటనూనెల ధరలు పెరుగును. పత్తి, బంగారం, ధరలు స్వల్పముగా తగ్గుట, గృహోపకరణముల ధరలు, గృహముల ధరలు పెరుగుట, నెయ్యి, కూరగాయలు, యంత్రములకు వాహనములకు, షేర్ మార్కెట్‌కు విలువలు పెరుగును. పాలు, పాల పదార్థములకు పొగాకు పదార్థములకు ధరలు స్వల్పముగా తగ్గును. పండ్లధరలు కొద్దిగా తగ్గుముఖం పట్టును. పూలధరలు పెరుగును.

12. **ఫాల్గుణమాసం :** ఈ మాసములో 5 సోమ 5 మంగళవారములు వచ్చుట వలన ఎర్రని ధాన్యములకు, ఎర్రని పదార్థములకు, ఎలక్ట్రానిక్ వస్తువులకు, బంగారం, వెండి, రాగి, ఇత్తడి, లోహముల ధరలు పెరుగును. కలప ధర మాసారంభంలో పెరిగి, మాసాంతమున స్వల్పముగా తగ్గును. షేర్ల ధరలు తగ్గును. వస్త్రములు, బెల్లం, పాదరసము, కొబ్బరి ధరలు సమముగా ఉండును. రసపదార్థముల, చమురు పదార్థముల ధరలు క్రమేపి పెరుగుచుండును.

# నవరత్న ధారణ (లక్కీ స్టోన్)అదృష్ట సంఖ్యా (లక్కీ నెం.) వివరములు

| జననతేదీలు | ఆధిపత్యగ్రహం | ధరించవలసిన రత్నములు,వారసంఖ్యలు | జననక్షత్రాలు,అదృష్టతేదీలు | కలుగుశుభఫలితాలు |
|---|---|---|---|---|
| 1-10-19-28 | 1. రవి | కెంపు<br>ఆది,సోమ | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ<br>1,10,19,28 | ఆరోగ్యము, మనశ్శాంతి, కన్యలకు శీఘ్రవివాహము, చర్మరోగాల నివారణ, నేత్రవ్యాధుల నివారణము |
| 2-11-20-29 | 2. చంద్రుడు | ముత్యము<br>ఆది,సోమ,శుక్ర | రోహిణి, హస్త, శ్రవణం<br>2,11,20,29 | జ్ఞాపకశక్తివృద్ధి, భార్యాభర్తల అన్యోన్యత, సంసార సుఖము,మనశ్శాంతి, వివాహ ఆటంకాలు తొలగుట. |
| 3-12-21-30 | 3. గురువు | పుష్యరాగము<br>మంగ,గురు,శుక్ర | పునర్వసు,విశాఖ,పూర్వభాద్ర<br>3,12,21,30 | సంతానప్రాప్తి, వంశవృద్ధి, ఋణవిముక్తి, శత్రుజయం |
| 4-13-22-31 | 4. రాహువు | గోమేధికము<br>ఆది,సోమ,శని | ఆర్ద్ర, స్వాతి, శతభిషం<br>4,13,22,31 | నష్టద్రవ్యలాభం, స్త్రీమూలకలాభం, ఆకర్షణ, గృహ లాభం, శత్రుజయం, వ్యాపారాభివృద్ధి, మానసిక వ్యాధుల నివారణ |
| 5-14-23 | 5. బుధుడు | పచ్చ<br>ఆది,బుధ,శుక్ర | ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి<br>5,14,23 | వ్యాపారాభివృద్ధి, విద్యార్థులకు జ్ఞాపకశక్తి, ఉన్మాదం, గణిత శాస్త్రమందు ప్రావీణ్యత |
| 6-15-24 | 6. శుక్రుడు | వజ్రము<br>మంగ,గురు,శుక్ర | భరణి, పుబ్బ, పూర్వాషాఢ<br>6,15,24 | ఆకర్షణ, విరోధాలు, ఎడబాటులనివారణ, కళారంగంలో రాణింపు. |
| 7-16-25 | 7. కేతువు | వైఢూర్యం<br>ఆది,సోమ | అశ్విని, మఖ, మూల<br>7,16,25 | దైవచింతన, ఉత్సాహము, లాభం, శత్రునాశనం |
| 8-17-26 | 8. శని | నీలము<br>ఆది,సోమ,శని | పుష్యమి,అనూరాధ,ఉత్తరభాద్ర<br>8,17,26 | అపమృత్యుదోషనివారణ, ప్రమాదాల నుండి రక్షణ |
| 9-18-27 | 9. కుజుడు | పగడము<br>మంగ,గురు,శుక్ర | మృగశిర, చిత్త, ధనిష్ఠ<br>9,18,27 | సాహసం, ధైర్యం, ఋణవిముక్తి, మాటచలాయింపు, కల్గును. |

# శుభకార్యక్రమ ముహూర్త విషయాదులలో ధర్మశాస్త్ర వివరము

**ఏకవింశతి మహాదోషములు ః-**

**శ్లో॥ అద్యః పంచాంగశుద్ధిస్స్యా ద్వితీయస్సూర్యసంక్రమః ! తృతీయ కర్తరీదోషశ్చంద్ర షష్టాష్ట రిప్ఫగః ! ఉదయాస్తాంశయో శుద్ధిరహితో దుర్ముహూర్తజః ! గండాంతం పాపషడ్వర్గం భృగుషట్కం కుజాష్టమమ్ ! దాంపత్యోరష్టమం లగ్నం రాశేర్విషఘటీభవేత్ ! కునవాంశో వారదోషః ఖర్జూరిక సమాంఘ్రిభమ్ ! గ్రహణోత్పాతభం కౄరవిద్ధం కౄరసంయుతమ్ ! అకాల గర్జితం వృష్టిర్మహాపాతస్య వైధృతీ !!**

మహర్షులు ముహూర్తవిషయములలో తప్పనిసరిగా పై ఏకవింశతి (21) మహాదోషములు లేకుండా ముహూర్తమును నిర్ణయించాలని తెలిపిరి . ఆ దోషములు

01. పంచాంగ శుద్ధిరాహిత్య దోషం, 02. సూర్యసంక్రమణ దోషం, 03. పాపకర్తరీ దోషం, 04. షడష్టరిఫ చంద్రదోషం, 05. సగ్రహ చంద్రదోషం, 06.ఉదయాస్తమయదోషం, 07. వారజనిత దుర్ముహూర్త దోషం, 08. గండాంత దోషం, 09. పాపషడ్వర్గ దోషం, 10. భృగుషట్కదోషం, 11.కుజాష్టమదోషం, 12.అష్టమ లగ్నదోషం, 13.కునవాంశ దోషం, 14. విషనాడీదోషం, 15.ఖర్జరీదోషం, 16. గ్రహణోత్పాత దోషం, 17. కౄరవిద్ధ దోషం, 18. కౄర సంయుత దోషం, 19. లగ్నాన్త దోషం, 20. ఉత్పాత దోషం, 21.మహాపాతదోషం.

**శ్లో॥ ఉద్వాహాదిషుచైకవింశతి మహాదోషాన్ విసృజ్యేతరాన్ !**
**స్వల్పాన్ దోషగణాం గుణాంశ్చ గణితాన్ నిశ్చిత్య శాస్త్రాత్స్ఫుటం !**
**లగ్నం యత్ర గణాధికంచ సకలైర్గ్రాహ్యం నదోషాధికం !**
**బ్రహ్మోవాపరిహర్తుమత్ర సకలాన్ దోషాన్ సమర్థో నహి !!**

శుభకార్యక్రమ ముహూర్తములయందు ఏకవింశతి మహాదోషములు లేకుండా ముహుర్తమును నిర్ణయించవలయును. ఎటువంటి దోషము లేకుండా ముహూర్తమును నిర్ణయించుట బ్రహ్మాదులకైననూ సాధ్యముకాదు. ఉన్న ముహూర్తములలో **స్వల్పదోషం గుణాధిక్యం** అను సూత్రముననుసరించి ముహూర్తములను నిర్ణయించుకోవలెను అని మహర్షుల వచనం.దోషాదులకు కూడా దోషాపవాదములు తెలిపినారు వాటి ననుసరించి శుభ ముహూర్తమును నిర్ణయించుకోగలరు. అటులని పూర్తిగా దోష భూయిష్టమైన ముహూర్తములకు **ఈవాక్యములను ఉదహరించవద్దని ముహూర్త నిర్ణయకర్తలకు, పౌరోహితులకు, విజ్ఞులకు మనవి.**

**ఏకవింశతి మహాదోషములుకు దోషాపవాదములు ః-**

**శ్లో॥ తిథిరేక గుణం ప్రోక్తం వారాదష్టగుణం భవేత్ !**
**నక్షత్రాశ్శతగుణం ప్రోక్తం లగ్నంచ కోటిగుణ్యతే !!**

తిథి ఒకగుణమును, వారము 8గుణములను, నక్షత్రం 100గుణములను, లగ్నం కోటిగుణములు కల్గి ఉండును.

**శ్లో॥ తిథిదోషం హరేద్వారం వారదోషం హరేస్త్రభః !**
**స్త్రభదోషం హరే లగ్నం లగ్నదోషం హరే గ్రహ !**
**గ్రహణమయుతం దోషం లగ్నకేంద్ర గురౌ భృగౌ !**

తిథిదోషమును వారము, వారదోషమును నక్షత్రం, నక్షత్రదోషమును లగ్నం, లగ్నదోషమును గ్రహసంపత్తి, కౄరగ్రహసంపత్తి దోషమును లగ్నమందుండిన గురుశుక్రులు తొలగించుదురు. గురు శుక్రులు లగ్నమందుండిన సమస్తదోషములు తొలగిపోవును.

శ్లో॥ **శుక్రః పంచసహస్రాణి బుధః పంచ శతానిచ !**
**లక్షమేకంతు దోషాణాం గురుః కేంద్రో వ్యపోహతి !!**

కేంద్రస్థానములైన 4,7,10 స్థానములందు శుక్రుడున్న 5వేల దోషములను, బుధుడున్న 5వందల దోషములను, గురుడున్న లక్షదోషములను తొలగించును.

శ్లో॥ **లగ్నస్థో భార్గవో జీవో యదివా చంద్రనందనః !**
**నాశయద్యఖిలాన్ దోషాన్ తూలసంఘ మివానలః !!**

లగ్నమందు గురు శుక్ర బుధులున్న యెడల సకలదోషములనూ హరించును.

శ్లో॥ **లగ్నైకాదశగో రవిశ్చ సకలాన్ దోషాన్నిహంత్యేవతాన్ !!**

పదకొండవ స్థానమందు రవి ఉన్నయెడల సకలదోషములనూ హరించును.

శ్లో॥ **కుజాష్టమదోషం భృగుషట్కదోషం వధూవరౌ అష్టమలగ్నదోషం !**
**గండాదిదోషం కుళికాది దోషం సర్వం నిహంతి త్రిషడాయగేరవౌ !!**

కుజాష్టమదోషం, భృగుషట్కదోషం, వధూవరుల అష్టమలగ్నదోషం, గండాది దోషం, కుళికాది దోషములను రవి లగ్నాదిగా 3,6,11 స్థానములలో ఉన్నప్పుడు పూర్తిగా తొలగించును.

శ్లో॥ **జామిత్ర దోషం గుళికాది దోషం వధూవరౌ అష్టమలగ్నదోషం !**
**గండంతు దోషం దుర్ముహూర్త దోషం నిహంతి త్రిషడాయగేరవౌ !!**

జామిత్ర దోషం, గుళికాది దోషం, వధూవరుల అష్టమ లగ్నదోషం, దుర్ముహూర్త దోషం, గండాది దోషములను రవి లగ్నాదిగా 3,6,11 స్థానములలో ఉన్నప్పుడు పూర్తిగా తొలగించును.

శ్లో॥ **అస్తగే నీచగే భౌమే శతృక్షేత్ర గతోపివా !**
**కుజాష్టమోద్భవేదోషా నకించిదపి విద్యతే !!**

కుజుడు అస్తంగతుడై రవితో కలసి ఉన్ననూ, నీచస్థానమందు, శతృస్థానమందు ఉన్ననూ కుజాష్టమ దోషము తొలగును.

శ్లో॥ **ఏకస్మిన్ కేంద్రగే జీవే శుక్రేవా పాపకేంద్రజాః !**
**దోషావినాశమాయాంతి పాపం భాగీరథీ జలాత్ !!**

గురు శుక్రులలో ఎవరైననూ కేంద్రగతులైనప్పుడు కౄరగ్రహములు కేంద్ర స్థానమునందుండు దోషములు తొలగును.

శ్లో॥ **నక్షత్రదోషం తిథివారదోషం లగ్నాదిదోషం చ ముహూర్త దోషం !**
**పాతాదిదోషం బహుజన్మదోషం జ్వాలాముఖీచ విషనాడికానాం !**
**ఏతాని దోషాని వినాశయంతి సర్వత్రదోషం గురుశుక్రలగ్నే !**

దుష్ట గ్రహ సంచార నక్షత్ర, తిథి, వార, లగ్న, దుర్ముహూర్త, పాతాది దోషములు గురు శుక్రులు లగ్నమందుండిన తొలగిపోవును.

శ్లో॥ **వివాహేషుచ దేవానాం ప్రతిష్ఠాసూపనయనే !**
**ఛాయాగ్రహేతు విజ్ఞేయౌ రాహుకేతూ నదోషదౌ !!**

వివాహ శుభకార్యక్రమములయందు, దేవతా ప్రతిష్ఠ, ఉపనయనాదుల యందు లగ్నస్థిత రాహుకేతు దోషము లేదని శాస్త్రవచనం.

శ్లో॥ **అభిషేకే నిషేకేచ ప్రవేశే వ్రతబంధనే !**

**పాణిగ్రహే ప్రయాణేచ చంద్రే ద్వాదశగే శుభే !!**

అభిషేకమునకు, నిషేకమునకు, వ్రతప్రారంభములకు, ప్రవేశమునకు, ఉపనయన, వివాహ, ప్రయాణముల యందు ద్వాదశ చంద్ర దోషము లేదని శాస్త్రవచనం.

శ్లో॥ **ఏకరాశిగతోవాపి నక్షత్రాంతర్గత శ్శశీః !**
**యదిచేత్సగ్రహభయం నాస్తీతి ధృఢనిశ్చయః !!**

శ్లో॥ **గురుస్స్వకీయ వర్గస్థో బలవా స్కంటకాశ్రితః !**
**పశ్యంత్సగ్రహశీతాంశుం తద్దోషం విలయం వ్రజేత్ !!**

చంద్రుడు ఇతర గ్రహములతో కలసి ఏకరాశిలో ఉన్నప్పటికీ నక్షత్రభేదము ఉన్నయెడల సగ్రహచంద్ర దోషము లేదని శాస్త్రవచనం. గురువు స్వ వర్గమందుగానీ, స్వాంశయందుగానీ, కేంద్రమందుగానీ బలవంతుడై ఉండి ఇతర గ్రహములతో కూడిన చంద్రుని చూస్తున్నయెడల సగ్రహచంద్ర దోషము లేదని శాస్త్రవచనం.

**మౌఢ్య సమయమున వివాహాది ముహూర్త విషయం ః-**

శ్లో॥ **ఏకోమూఢో భవేదస్య స్వోచ్ఛమిత్రాంశగో యది !**
**స్వరాశిమూర్తిగశ్చైవ మౌఢ్య దోషో నవిద్యతే !!**

శ్లో॥ **గురోరస్తంగతో దోషో నాస్తి శుక్రోదయో యది !**
**ద్వయో రస్తమయస్స్యాచ్చేత్ అపవాదైర్నభిద్యతే !!**

గురు శుక్రమౌఢ్యమిలలో వివాహాది శుభకార్యక్రమములు పూర్తిగా నిషిద్ధమని శాస్త్రవచనం.కానీ ప్రస్తుత కాలములో కొంతమంది పై శ్లోకములను ఆధారముగా చూపి **ఏకవింశతి మహాదోషములలో కూడా మౌఢ్యదోషము లేదని** మరియూ ఒకరి మౌఢ్యమిలో మరియొకరు ఉచ్ఛ, మిత్ర, స్వక్షేత్ర అంశలను పొందిన మౌఢ్యదోషములేదని, ఒకరు అస్తమించినప్పుడు వేరొకరు పూర్తి బలముగా ఉన్న శుభకార్యక్రమములు చేయవచ్చని చెప్పుచుంటిరి. **కానీ ఈవిషయము ఆపత్కాల విషయముగా** అనగా మారణాది విపత్తులు దగ్గర్లో ఉన్నప్పుడు పరిగణించవలయును, కానీ సామాన్య సమయమున కాదు. గురుశుక్రమౌఢ్యమిలలో వివాహము చేసిన సంతానహీనత లేక వైధవ్యం ప్రాప్తించునని శాస్త్రవచనం.

**మీన చైత్రమున వివాహాది ముహూర్త విషయం ః-**

శ్లో॥ **ముండనం మీనచైత్రేతు మండనం మేషచైత్రకే !**
**ముండనం మండనం చైవ మేష చైత్రే విధీయతే !!**

మీనరవి చైత్రమాసంలో ఉపనయనమును, మేషరవి చైత్రమాసంలో వివాహమును చేయవచ్చును, విశేషించి మేషరవి చైత్రమాసంలో ఉపనయన,వివాహమును చేయవచ్చును.

శ్లో॥ **మీన చైత్రో ధనుఃపుష్యో మిధునాషాఢకోపిచ !**
**కన్యా భాద్రపదో మాసః శూన్యమాసాః ప్రకీర్తితాః !!**
**వింధ్యస్య దక్షిణ దేశానాం మీనచైత్రం నదోషకృత్ !!**

మీనరవి చైత్రమాసంలో, ధనుస్సురవి పుష్యమాసములో, మిధునరవి ఆషాఢమాసములో, కన్యరవి భాద్రపదమాసములు శూన్యమాసములు అట్టి సమయమున శుభకార్యక్రమములు చేయకూడదు.

శ్రీశైలమునకు వింధ్యకు మధ్యప్రాంతీయులైన దక్షిణ దేశస్థులకు మీనచైత్ర దోషముండదు కనుక యథావిధిగా ఆప్రాంతమువారు వివాహాది శుభకార్యక్రమములు జరుపుకోవచ్చును.

| 27 నక్షత్రములవారికి శుభకార్యక్రమముల యందు తారాబలము కలిగిన నక్షత్రముల వివరణ | |
|---|---|
| **1. అశ్విని** | రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ,మూల, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి. |
| **2. భరణి** | మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని. |
| **3. కృత్తిక** | రోహిణి, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని. |
| **4. రోహిణి** | మృగశిర, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, రేవతి. |
| **5. మృగశిర** | పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని,రోహిణి. |
| **6. ఆర్ద్రా** | పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ, శతతార, రేవతి, రోహిణి, మృగశిర. |
| **7. పునర్వసు** | పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర. |
| **8. పుష్యమి** | హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు. |
| **9. ఆశ్రేష** | మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి. |
| **10. మఖ** | హస్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, రోహిణి, పుష్యమి. |
| **11. పుబ్బ** | ఉత్తర, చిత్త, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, మఖ. |
| **12. ఉత్తర** | హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ. |
| **13. హస్త** | చిత్త, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర. |
| **14. చిత్త** | స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని,రోహిణి, మృగశిర, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త. |
| **15. స్వాతి** | శ్రవణం, ధనిష్ఠ, శతతార, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త. |
| **16. విశాఖ** | అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి. |

| | |
|---|---|
| **17. అనూరాధ** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి. |
| **18. జ్యేష్ఠ** | మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ. |
| **19. మూల** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ. |
| **20. పూర్వాషాఢ** | ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, మూల. |
| **21. ఉత్తరాషాఢ** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల. |
| **22. శ్రవణం** | ధనిష్ఠ, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, ఉత్తరాషాఢ. |
| **23. ధనిష్ఠ** | శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం. |
| **24. శతతార** | రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ. |
| **25. పూర్వాభాద్ర** | ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార. |
| **26. ఉత్తరాభాద్ర** | రేవతి, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, శతతార. |
| **27. రేవతి** | అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర. |

**శ్లో॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం !**
**తృతీయే పంచమం త్యాజ్యం నైధనం సర్వత్ర వర్జయేత్ !!**

**జన్మనక్షత్రమందు చేయుదగినవి :-** నిషేకము, చౌలము, త్యాగము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, అక్షరాభ్యాసము, పట్టాభిషేకము చేయవచ్చును. స్త్రీలకు వివాహం శ్రేష్టం కాని **జన్మతారయందు** కాకుండా **అనుజన్మతారయందు** చేసిన శ్రేష్ఠం

**జన్మ నక్షత్రమందు చేయగూడనవి :-** గర్భాదానము,వివాహం,పుంసవనము,సీమంతము, ప్రయాణం,ఔషధ,సేవ,క్షౌరం చేయకూడదు.

**శ్లో॥ వివాహోత్సవాది కార్యాణి స్వపితుర్భాగ్యభాక్కాలే !**
**కర్మ నక్షత్ర (అనుజన్మతార) కాలే శుభం నిత్యం మహత్ !! ॥ దేవకేరళం ॥**

పై ఆధారమువలన జన్మ నక్షత్రమందు కాక అనుజన్మ నక్షత్రముల యందు (అనుజన్మతారల యందు) స్త్రీపురుషులిరువురూ శుభకార్యక్రమములు చేసుకొనవచ్చును.

## పంచక రహిత వివరము

**1. పంచక రహితం :-**

**శ్లో॥ తిథిరోడుబిర్యుక్తం తత్కాలోదయ మిశ్రితం !**
**నవభిస్తు హరేర్భాగం శేషం పంచకమీరితమ్ !!**

తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1 వచ్చిన మృత్యుపంచకం, శేషం 2 వచ్చిన అగ్నిపంచకం, శేషం 4 వచ్చిన రాజపంచకం, శేషం 6 వచ్చిన చోరపంచకం, శేషం 8 వచ్చిన రోగపంచకం మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో పంచకరహితమైనది, శుభప్రదమని భావించవలయును.

**2. మార్తాండపంచక రహితం :-**

**శ్లో॥ గతతిథి సంయుక్తం తత్కాలోదయ మిశ్రితం !**
**నవభిస్తు హరేర్భాగం శేషం మార్తాండమీరితమ్ !!**

గతతిథి, తాత్కాలిక లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం **3,5,7,9** వచ్చినచో మార్తాండపంచకరహితమైనది, శుభప్రదమని భావించవలయును.

**3. ధృవక రహితం :- 1 వ పద్ధతి**

**శ్లో॥ శృతిః బాణః ఋతుః పంచ వేద త్రీణి ద్వి చంద్రమాః !**
**గగనేందు ద్వయం త్రీణి ధృవకంచే త్యనుక్రమాత్ !!**

మేషమునకు **4,** వృషభమునకు **5,** మిథునమునకు **6,** కర్కాటకమునకు **5,** సింహమునకు **4,** కన్యకు **3,** తులకు **2,** వృశ్చికమునకు **1,** ధనస్సునకు **0,** మకరమునకు **1,** కుంభమునకు **2,** మీనమునకు **3,**

**ఈవిధముగా చెప్పబడిన సంఖ్యను మరియూ** తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1,2,4,6,8 వచ్చిన పంచకశుద్ధి కాలేదని మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనది భావించవలయును.

**4. ధృవక రహితం :- 2 వ పద్ధతి**

**శ్లో॥ వసు శైల పురారంధ్ర గజ వేదార్క శైలయోః !**
**నాగాబ్ధి వసునేత్రాణాం మేషాద్యాదనుక్రమాత్ !!**

మేషమునకు **8,** వృషభమునకు **7,** మిథునమునకు **3,** కర్కాటకమునకు **8,** సింహమునకు **8,** కన్యకు **4,** తులకు **12,** వృశ్చికమునకు **7,** ధనస్సునకు **8,** మకరమునకు **4,** కుంభమునకు **8,** మీనమునకు **2,**

**ఈవిధముగా చెప్పబడిన సంఖ్యను మరియూ** తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1,2,4,6,8 వచ్చిన పంచకశుద్ధి కాలేదని మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనది భావించవలయును.

రాజసేవకు రాజపంచకం, ప్రయాణమునకు చోరపంచకం, వివాహ ఉపనయనములకు రోగ, మృత్యు పంచకములు పనికిరావు. ఈ విషయమున బహుపాఠాంతరములు కలవు.

॥శ్రీ లక్ష్మీ గణపతయేనమః॥ ॥శ్రీలలితాత్రిపుర సుందర్యై నమః॥ ॥శ్రీ దక్షిణామూర్తయే నమః॥

# శ్రీ దుర్ముఖి నామ సంవత్సరంలో వివాహాది శుభముహూర్తములు

**"ప్రమాదో ధీమతామపి"** ముహూర్తములను నిర్ణయించుకొనే ముందు పంచాంగ పీఠికయందు సరి చూసుకొనగలరు. పుష్కర, శుభ, వర్గోత్తమాంశ వివరాదులను గమనించగలరు. స్వల్ప దోషం గుణాధిక్యం అను వాక్యానుసారం ముహూర్తములను నిర్ణయించడం జరిగినది.

## చైత్ర మాసం 08-04-2016 నుండి 06-05-2016 వరకు

| తేది,వారం ఏప్రిల్ | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 11సోమ | శు॥ పంచమి | రోహి | మిధు | ఉ.11-42 | ఉపనయనం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 14గురు | శు॥ అష్టమి | పునర్వ | మిధు | ఉ.11-30 | శుభాదులు | పుష్కర |
| 15శుక్ర | శు॥ నవమి | పుష్య | మిధు | ఉ.11-27 | శుభాదులు | పుష్కర |
| 16శని | శు॥ దశమి | మఖ | తుల | రా.07-59 | గృహప్రవేశం. | పుష్కర |
| 16శని | శు॥ ఏకాదశి | మఖ | ధనస్సు | రా.12-06 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 16శని | శు॥ ఏకాదశి | మఖ | మీనం | రా.తె.4-35 | వివాహం,గృహారంభం,గృహప్రవేశం. | పుష్కర |
| 17ఆది | శు॥ ఏకాదశి | మఖ | మిధు | ఉ. 11-19 | వివాహ, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 17ఆది | శు॥ ఏకాదశి | మఖ | కర్కా | ఉ. 11-52 | వివాహ,ఉపనయన, గృహారంభ, ప్రతిష్ఠ. | వర్గో |
| 20బుధ | శు॥ చతుర్దశి | హస్త | మిధు | ఉ. 09-28 | వివాహ ఉపనయన, ప్రతిష్ఠ. | శుభ |
| 20బుధ | శు॥ చతుర్దశి | హస్త | ధనస్సు | రా. 11-51 | వివాహం. | పుష్కర |
| 20బుధ | శు॥ చతుర్దశి | చిత్త | మీనం | రా.తె.4-20 | వివాహం,గృహారంభం,గృహప్రవేశం. | పుష్కర |
| 21గురు | శు॥ పౌర్ణిమ | చిత్త | మిధు | ఉ. 09-23 | వివాహఉపన,గృహారంభ,గృహప్రవేశ,ప్రతిష్ఠ | శుభ |
| 21గురు | శు॥ పౌర్ణిమ | చిత్త | కర్కాట | ఉ. 11-59 | వివాహ,ఉపనయన గృహారంభ ప్రతిష్ఠ. | పుష్కర |
| 21గురు | శు॥ పౌర్ణిమ | చిత్త | ధనస్సు | రా. 11-46 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 21గురు | శు॥ పౌర్ణిమ | చిత్త | మీనం | రా.తె.4-15 | వివాహం,గృహారంభం,గృహప్రవేశం. | పుష్కర |
| 22శుక్ర | బ॥ పాద్యమి | స్వాతి | మిధు | ఉ. 10-58 | వివాహ,ఉపన,గృహారంభ,గృహప్రవేశ,ప్రతిష్ఠ | పుష్కర |
| 22శుక్ర | బ॥ పాద్యమి | స్వాతి | కర్కాట | ఉ. 11-55 | వివాహ, ఉపనయన, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 22శుక్ర | బ॥ పాద్యమి | స్వాతి | ధనస్సు | రా. 11-42 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 23శని | బ॥ పాద్యమి | స్వాతి | మిధు | ఉ. 09-16 | వివాహం,ఉప,గృహారంభ,గృహప్రవేశ,ప్రతిష్ఠ | శుభ |
| 24ఆది | బ॥ తదియ | అనూ | ధనస్సు | రా. 11-34 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 25సోమ | బ॥ తదియ | అనూ | మిధు | ఉ. 10-47 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 27బుధ | బ॥ పంచమి | మూల | మిధు | ఉ. 09-05 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | శుభ |
| 27బుధ | బ॥ పంచమి | మూల | కర్కాట | ఉ. 11-12 | వివాహ, ఉపనయన, గృహారంభ, ప్రతిష్ఠ. | శుభ |
| 28గురు | బ॥ సప్తమి | ఉ.షా॥ | ధనస్సు | రా. 11-18 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 28గురు | బ॥ సప్తమి | ఉ.షా॥ | మీనం | రా.తె.3-47 | వివాహం,గృహారంభం,గృహప్రవేశం. | పుష్కర |
| 29శుక్ర | బ॥ సప్తమి | ఉ.షా॥ | మిధునం | ఉ. 10-30 | వివాహ, ఉపనయన, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 29శుక్ర | బ॥ సప్తమి | ఉ.షా॥ | కర్కాట | ఉ. 11-28 | గృహారంభం. | పుష్కర |
| 29శుక్ర | బ॥ అష్టమి | శ్రవణ | ధనస్సు | రా. 11-15 | వివాహం. | పుష్కర |
| 29శుక్ర | బ॥ అష్టమి | శ్రవణ | మీనం | రా.తె.3-44 | వివాహం. | పుష్కర |

**30-04-2016 నుండి 13-07-2016 వరకు శుక్ర మౌఢ్యమి, మరియూ ఆషాఢ మాసము అగుట వలన 30-04-2016 నుండి 02-08-2016 వరకు శుభముహూర్తములు లేవు.**
**ఈ సంవత్సరం కృష్ణా పుష్కరములు కలవు అట్టి ప్రాంతీయులు పుష్కరముల ప్రత్యేక వ్యాసము చూసి ముహూర్తములు నిర్ణయించుకోగలరు**

## శ్రావణ మాసం 03-08-2016 నుండి 01-09-2016 వరకు

| తేది,వారం ఆగస్టు | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 3 బుధ | శు॥ విదియ | మఖ | మిధు | రా.తె.4-13 | వివాహం,గృహారంభం,గృహప్రవేశం. | పుష్కర |
| 4గురు | శు॥ విదియ | మఖ | కన్య | ఉ.09-56 | వివాహం, శుభాదులు. | పుష్కర |
| 4 గురు | శు॥ విదియ | మఖ | తుల | ఉ.11-10 | వివాహం, శుభాదులు. | వర్గో |
| 4 గురు | శు॥ విదియ | మఖ | మీనం | రా.09-25 | వివాహం. | పుష్కర |
| 6 శని | శు॥ చవితి | ఉత్తర | కన్య | ఉ.09-49 | వివాహం,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 6 శని | శు॥ చవితి | ఉత్తర | తుల | ఉ.11-03 | వివాహం, ప్రతిష్ఠ. | వర్గో |
| 6 శని | శు॥ చవితి | ఉత్తర | మీనం | రా.09-18 | వివాహం, గృహప్రవేశం | పుష్కర |
| 6 శని | శు॥ చవితి | ఉత్తర | మిధు | రా.తె.4-02 | వివాహం,గృహారంభ,గృహప్రవేశ | పుష్కర |
| 7 ఆది | శు॥ పంచ | హస్త | కన్య | ఉ.09-45 | వివాహం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 7 ఆది | శు॥ పంచ | హస్త | తుల | ఉ.10-59 | వివాహం, ప్రతిష్ఠ. | వర్గో |
| 7 ఆది | శు॥ పంచ | హస్త | మీనం | రా.09-14 | వివాహం. | పుష్కర |
| 7 ఆది | శు॥ పంచ | హస్త | మిధు | రాతె. 3-58 | వివాహం. | పుష్కర |
| 8సోమ | శు॥ షష్ఠి | చిత్త | కన్య | ఉ.09-41 | ప్రతిష్ఠ, శుభాదులు. | పుష్కర |
| 8సోమ | శు॥ షష్ఠి | చిత్త | తుల | ఉ.10-55 | ప్రతిష్ఠ, శుభాదులు. | వర్గో |
| 10బుధ | శు॥ సవమి | స్వాతి | కన్య | ఉ.09-33 | వివాహ,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 11గురు | శు॥ నవమి | అనూ | మీనం | రా.08-59 | వివాహం. | పుష్కర |
| 11గురు | శు॥ నవమి | అనూ | మిధు | రాతె. 3-43 | వివాహం. | పుష్కర |
| 12శుక్ర | శు॥ నవమి | అనూ | కన్య | ఉ. 10-25 | వివాహం. | వర్గో |
| 12శుక్ర | శు॥ నవమి | అనూ | తుల | ఉ. 10-40 | వివాహం. | వర్గో |
| 14ఆది | శు॥ ఏకాదశి | మూల | కన్య | ఉ. 09-16 | వివాహ,గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 14ఆది | శు॥ ఏకాదశి | మూల | తుల | ఉ. 10-31 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 14ఆది | శు॥ ద్వాదశి | మూల | మీనం | రా. 08-46 | శుభాదులు. | పుష్కర |
| 17బుధ | శు॥ చతుర్దశి | శ్రవణ | కన్య | ఉ. 09-05 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 17బుధ | శు॥ చతుర్దశి | శ్రవణ | తుల | ఉ. 10-19 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 17బుధ | శు॥ పౌర్ణిమ | శ్రవణ | మీనం | రా. 08-34 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 17బుధ | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | మిధునం | రా.తె.3-19 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 18గురు | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | కన్య | ఉ. 09-02 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 18గురు | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | తుల | ఉ. 11-54 | వివాహం, ప్రతిష్ఠ | పుష్కర |

| తేది,వారం ఆగస్టు | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 18గురు | బ॥ పాడ్య | ధనిష్ఠ | మీనం | రా.08-31 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 18గురు | బ॥ పాడ్య | శతతార | మిథు | రా.తె.3-16 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 19శుక్ర | బ॥ పాడ్య | శతతార | కన్య | ఉ.09-58 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 19శుక్ర | బ॥ పాడ్య | శతతార | తుల | ఉ.11-50 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 19శుక్ర | బ॥ విది | శతతార | మీన | రా.08-27 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 20శని | బ॥ తది | ఉ.భాద్ర | మీన | రా.09-32 | గృహప్రవేశం, శుభాదులు. | వర్గో |
| 20శని | బ॥ తది | ఉ.భాద్ర | మిథు | రా.తె.3-08 | వివాహ, గృహప్రవేశ, శుభాదులు. | పుష్కర |
| 21ఆది | బ॥ చవితి | ఉ.భాద్ర | కన్య | ఉ.08-50 | గృహారంభం, ప్రతిష్ఠ, శుభాదులు. | పుష్కర |
| 21ఆది | బ॥ చవితి | ఉ.భాద్ర | తుల | ఉ. 11-42 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 21ఆది | బ॥ చవితి | రేవతి | మీనం | రా. 08-19 | శుభాదులు. | పుష్కర |
| 21ఆది | బ॥ చవితి | రేవతి | మిథు | రా.తె.3-04 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 22సోమ | బ॥ పంచ | రేవతి | కన్య | ఉ. 08-46 | గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 22సోమ | బ॥ పంచ | రేవతి | తుల | ఉ. 11-38 | గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 25గురు | బ॥ నవమి | రోహిణి | మీనం | రా. 09-12 | శుభాదులు. | వర్గో |
| 25గురు | బ॥ నవమి | రోహిణి | మిథు | రా. 02-48 | శుభాదులు. | పుష్కర |
| 26శుక్ర | బ॥ నవమి | మృగ | తుల | ఉ. 11-22 | శుభాదులు. | పుష్కర |
| 26శుక్ర | బ॥ దశమి | మృగ | మీనం | రా. 07-59 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 26శుక్ర | బ॥ దశమి | మృగ | మిథు | రా. 02-44 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 27శని | బ॥ దశమి | మృగ | కన్య | ఉ. 08-27 | వివాహ, గృహారంభ, శుభాదులు. | పుష్కర |
| 28ఆది | బ॥ ఏకా | పున | తుల | ఉ. 11-15 | శుభాదులు. | పుష్కర |

**02-09-2016 నుండి 30-09-2016 వరకు భాద్రపద మాసం మరియూ 11-09-2016 నుండి 10-10-2016 వరకు గురు మౌఢ్యమి వలన 02-09-2016 నుండి 10-10-2016 వరకు శుభముహూర్తములు లేవు.**

**అక్టో ఆశ్వీయుజ మాసం 01-10-2016 నుండి 30-10-2016 వరకు**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 12బుధ | శు॥ ఏకాదశి | ధనిష్ఠ | తుల | ఉ. 08-16 | వివాహం,గృహారంభం. | పుష్కర |
| 12బుధ | శు॥ ఏకాదశి | ధనిష్ఠ | మేషం | రా. 07-19 | శుభాదులు. | పుష్కర |
| 13గురు | శు॥ ద్వాదశి | శత | తుల | ఉ. 08-12 | వివాహం,గృహారంభం. | పుష్కర |
| 14శుక్ర | శు॥ చతుర్దశి | ఉ.భాద్ర | మేషం | రా. 07-11 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 14శుక్ర | శు॥ చతుర్దశి | ఉ.భాద్ర | కర్కాట | రా. 12-26 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 15శని | శు॥ చతుర్దశి | ఉ.భాద్ర | తుల | ఉ. 08-24 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | శుభ |
| 15శని | శు॥ పౌర్ణిమ | రేవతి | మేష | రా. 07-07 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 16ఆది | శు॥ పౌర్ణిమ | రేవతి | తుల | ఉ. 08-01 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 16ఆది | బ॥ పాడ్యమి | అశ్విని | కర్కాట | రా. 12-19 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 19బుధ | బ॥ పంచమి | రోహిణి | కర్కాట | రా. 12-06 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 19బుధ | బ॥ పంచమి | మృగ | కన్య | రా.తె.4-52 | వివాహం,గృహారంభ,గృహప్రవేశ. | పుష్కర |

| తేది,వారం అక్టోబర్ | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 21శుక్ర | బ॥ సప్తమి | పున | కర్కా | రా. 11-58 | గృహప్రవేశం, శుభాదులు. | పుష్కర |
| 21శుక్ర | బ॥ సప్తమి | పున | కన్య | రా.తె.4-44 | శుభాదులు. | పుష్కర |

## కార్తీక మాసం 31-10-2016 నుండి 29-11-2016 వరకు

| నవంబర్ | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2బుధ | శు॥ తది | అనూ | ధనస్సు | ఉ. 10-21 | వివాహ, ఉపనయన, గృహారంభ, ప్రతిష్ఠ. | శుభ |
| 3గురు | శు॥ చవితి | మూల | కన్య | రా.తె. 3-53 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 4శుక్ర | శు॥ పంచ | మూల | ధనస్సు | ఉ. 10-52 | వివాహ,ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 5శని | శు॥ షష్ఠి | ఉ.షా॥ | కన్య | రా.తె. 3-45 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 6ఆది | శు॥ సప్తమి | శ్రవణ | కన్య | రా.తె. 3-41 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 7సోమ | శు॥ సప్తమి | శ్రవణ | ధనస్సు | ఉ. 10-40 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 7సోమ | శు॥ అష్టమి | శ్రవణ | కన్య | రా.తె. 3-37 | శుభాదులు. | పుష్కర |
| 9బుధ | శు॥ నవమి | శత | ధనస్సు | ఉ. 10-32 | వివాహం. | పుష్కర |
| 9బుధ | శు॥ దశమి | శత | కన్య | రా.తె. 3-29 | వివాహం. | పుష్కర |
| 10గురు | శు॥ ఏకా | ఉ.భాద్ర | కన్య | రా.తె. 4-25 | వివాహం, గృహప్రవేశం. | వర్గో |
| 11శుక్ర | శు॥ ద్వాద | ఉ.భాద్ర | ధనస్సు | ఉ. 10-25 | వివాహ,ఉపనయన, గృహారంభ, ప్రతిష్ఠ. | పుష్కర |
| 11శుక్ర | శు॥ ద్వాద | రేవతి | కన్య | రా.తె. 3-22 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 12శని | శు॥ త్రయో | రేవతి | ధనస్సు | ఉ. 10-21 | వివాహ,ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 12శని | శు॥ చతుర్ద | అశ్విని | కన్య | రా.తె. 3-18 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 13ఆది | శు॥ చతుర్ద | అశ్విని | ధనస్సు | ఉ. 10-17 | వివాహ,ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 16బుధ | బ॥ విదియ | రోహిణి | ధనస్సు | ఉ. 10-06 | వివాహ,ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | పుష్కర |
| 16బుధ | బ॥ తదియ | మృగ | కన్య | రా.తె. 3-03 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 18శుక్ర | బ॥ పంచ | పున | ధనస్సు | ఉ. 10-28 | ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | వర్గో |
| 18శుక్ర | బ॥ పంచ | పున | కన్య | రా. 02-56 | గృహప్రవేశం. | పుష్కర |
| 23బుధ | బ॥ దశమి | ఉత్తర | ధనస్సు | ఉ. 09-39 | వివాహ,ఉపనయన, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 23బుధ | బ॥ దశమి | ఉత్తర | కన్య | రా. 02-37 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 23బుధ | బ॥ ఏకా | ఉత్తర | తుల | రా.తె. 5-29 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 24గురు | బ॥ ఏకా | ఉత్తర | ధనస్సు | ఉ. 08-55 | వివాహం, శుభాదులు. | శుభ |
| 24గురు | బ॥ ఏకా | హస్త | కన్య | రా. 02-32 | వివాహం, శుభాదులు. | పుష్కర |
| 24గురు | బ॥ ఏకా | హస్త | తుల | రా.తె. 5-24 | వివాహం, శుభాదులు. | పుష్కర |

## మార్గశిర మాసం 30-11-2016 నుండి 29-12-2016 వరకు

| తేది,వారం డిశంబర్ | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 1గురు | శు॥ విదియ | మూల | ధనస్సు | ఉ. 09-06 | వివాహం. | పుష్కర |
| 1గురు | శు॥ తదియ | మూల | కన్య | రా. 02-04 | వివాహం. | పుష్కర |
| 3శని | శు॥ చవితి | ఉ.షా॥ | ధనస్సు | ఉ. 09-28 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 3శని | శు॥ పంచ | ఉ.షా॥ | కన్య | రా. 01-56 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 3శని | శు॥ పంచ | ఉ.షా॥ | తుల | రా.తె. 4-48 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 4ఆది | శు॥ పంచ | ఉ.షా॥ | ధనస్సు | ఉ. 08-55 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 4ఆది | శు॥ పంచ | శ్రవణ | కన్య | రా. 01-53 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 4ఆది | శు॥ షష్ఠి | శ్రవణ | తుల | రా.తె. 4-45 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 5సోమ | శు॥ షష్ఠి | శ్రవణ | ధనస్సు | ఉ. 08-50 | గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 5సోమ | శు॥ షష్ఠి | ధనిష్ఠ | కన్య | రా. 01-48 | శుభాదులు. | పుష్కర |
| 5సోమ | శు॥ సప్తమి | ధనిష్ఠ | తుల | రా. 03-02 | శుభాదులు. | వర్గో |
| 7బుధ | శు॥ అష్టమి | శత | ధనస్సు | ఉ. 8-42 | శుభాదులు. | పుష్కర |
| 8గురు | శు॥ దశమి | ఉ.భాద్ర | కన్య | రా. 02-37 | శుభాదులు. | వర్గో |
| 8గురు | శు॥ దశమి | ఉ.భాద్ర | తుల | రా.తె. 4-29 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 9శుక్ర | శు॥ దశమి | ఉ.భాద్ర | ధనస్సు | ఉ. 07-55 | వివాహ,గృహారంభ,గృహప్రవేశ, ప్రతిష్ఠ. | శుభ |
| 9శుక్ర | శు॥ ఏకాదశి | రేవతి | కన్య | రా. 01-32 | గృహప్రవేశం. | పుష్కర |
| 9శుక్ర | శు॥ ఏకాదశి | రేవతి | తుల | రా.తె. 4-24 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 10శని | శు॥ ఏకాదశి | అశ్విని | ధనస్సు | ఉ. 09-00 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 10శని | శు॥ ద్వాదశి | అశ్విని | తుల | రా.తె. 4-20 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 14బుధ | బ॥ పాడ్యమి | మృగ | ధనస్సు | ఉ. 08-15 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 14బుధ | బ॥ పాడ్యమి | మృగ | మకరం | ఉ. 09-45 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 18ఆది | బ॥ షష్ఠి | మఖ | తుల | రా.తె. 3-48 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 21బుధ | బ॥ అష్టమి | ఉత్తర | మకరం | ఉ. 09-17 | వివాహం. | పుష్కర |
| 21బుధ | బ॥ నవమి | హస్త | కన్య | రా. 12-44 | వివాహం. | పుష్కర |
| 21బుధ | బ॥ నవమి | హస్త | తుల | రా.తె. 3-56 | వివాహం. | శుభ |
| 22గురు | బ॥ నవమి | హస్త | మకరం | ఉ. 09-14 | వివాహం. | పుష్కర |
| 22గురు | బ॥ దశమి | చిత్త | కన్య | రా. 12-41 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 22గురు | బ॥ దశమి | చిత్త | తుల | రా. 01-55 | వివాహం, గృహప్రవేశం. | శుభ |
| 23శుక్ర | బ॥ దశమి | చిత్త | మకరం | ఉ. 08-23 | వివాహ,గృహారంభ,గృహప్రవేశ, ప్రతిష్ఠ. | వర్గో |
| 23శుక్ర | బ॥ దశమి | స్వాతి | కన్య | రా. 12-36 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |

**30-12-16 నుండి 27-1-17 వరకు పుష్య మాసం అగుట వలన శుభముహూర్తములులేవు.**

## మాఘ మాసం 28-01-2017 నుండి 26-02-2017 వరకు

| 2017 | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| జనవరి | | | | | | |
| 29ఆది | శు॥ విదియ | ధనిష్ఠ | మేషం | ఉ. 11-05 | వివాహం, ప్రతిష్ఠ. | వర్గో |
| 29ఆది | శు॥ విదియ | శత | తుల | రా. 01-03 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 29ఆది | శు॥ విదియ | శత | వృశ్చికం | రా. 01-59 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 30సోమ | శు॥ తదియ | శత | మేషం | ఉ. 11-02 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| ఫిబ్ర2017 | | | | | | |
| 1బుధ | శు॥ పంచమి | ఉ.భాద్ర | మేషం | ఉ. 10-54 | వివాహ,ఉపనయన, గృహారంభ, ప్రతిష్ఠ. | వర్గో |
| 1బుధ | శు॥ పంచమి | రేవతి | తుల | రా. 12-52 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 1బుధ | శు॥ పంచమి | రేవతి | వృశ్చికం | రా. 01-48 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 2గురు | శు॥ షష్ఠి | రేవతి | మేషం | ఉ. 11-57 | వివాహం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 2గురు | శు॥ సప్తమి | అశ్విని | తుల | రా. 12-48 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 2గురు | శు॥ సప్తమి | అశ్విని | వృశ్చికం | రా. 01-44 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 3శుక్ర | శు॥ సప్తమి | అశ్విని | మేషం | ఉ. 10-46 | వివాహ,ఉపనయన,గృహారంభ,ప్రతిష్ఠ. | వర్గో |
| 5ఆది | శు॥ దశమి | రోహిణి | తుల | రా. 12-36 | వివాహ, గృహప్రవేశం. | పుష్కర |
| 5ఆది | శు॥ దశమి | రోహిణి | వృశ్చికం | రా. 01-32 | గృహప్రవేశం. | పుష్కర |
| 6సోమ | శు॥ దశమి | రోహిణి | మేషం | ఉ. 11-40 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 8బుధ | శు॥ త్రయో | పునర్వసు | తుల | రా. 10-45 | గృహప్రవేశం. | వర్గో |
| 11శని | బ॥ పాడ్యమి | మఖ | మేషం | ఉ. 11-20 | శుభాదులు. | పుష్కర |
| 11శని | బ॥ పాడ్యమి | మఖ | తుల | రా. 12-11 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 11శని | బ॥ పాడ్యమి | మఖ | వృశ్చికం | రా. 01-07 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 13సోమ | బ॥ తదియ | ఉత్తర | మేషం | ఉ. 11-11 | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 15బుధ | బ॥ పంచమి | హస్త | మేషం | ఉ. 11-04 | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 15బుధ | బ॥ పంచమి | చిత్త | తుల | రా. 11-58 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 15బుధ | బ॥ పంచమి | చిత్త | వృశ్చికం | రా. 12-54 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 16గురు | బ॥ షష్ఠి | చిత్త | మేషం | ఉ. 09-52 | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. | వర్గో |
| 16గురు | బ॥ షష్ఠి | స్వాతి | వృశ్చికం | రా. 12-49 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 17శుక్ర | బ॥ సప్తమి | స్వాతి | మేషం | ఉ. 10-56 | వివాహ,ఉపనయనం,గృహారంభ, ప్రతిష్ఠ. | పుష్కర |

ధీ ప్రద్యుమ్నమయీ మథాపి నితరాం ప్రద్యుమ్న సంసేవితాం ।
అవ్యక్తాది మథాపి వేంకటపతే స్సౌందర్య సంభావితాం ।
దేవీముత్తర శైలజామపి సదా శ్రీదక్షిణాస్యానుగాం ।
కాలాత్మనమథాపి కాలశమనీం శ్రీ త్రైపురీం భావయే ॥
శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్ ।
అభంగుర విభూతిర్నస్తరంఙ్గయతు మంగళం ॥

## ఫాల్గుణ మాసం 27-02-2017 నుండి 29-03-2017 వరకు

| 2017 మార్చి | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు | అంశ |
|---|---|---|---|---|---|---|
| 1బుధ | శు॥ తదియ | రేవతి | మేషం | ఉ. 10-09 | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 1బుధ | శు॥ తదియ | రేవతి | వృషభం | ఉ. 11-37 | వివాహం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 1బుధ | శు॥ చవితి | రేవతి | వృశ్చికం | రా. 11-59 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 2గురు | శు॥ చవితి | అశ్విని | మీనం | ఉ. 07-38 | ఉపనయనం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 2గురు | శు॥ చవితి | అశ్విని | వృషభం | ఉ. 11-37 | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. | వర్గో |
| 2గురు | శు॥ పంచ | అశ్విని | వృశ్చికం | రా. 12-46 | వివాహం, గృహప్రవేశం. | శుభ |
| 4శని | శు॥ సప్తమి | రోహిణి | వృశ్చికం | రా. 12-37 | గృహప్రవేశం. | శుభ |
| 4శని | శు॥ సప్తమి | రోహిణి | మకరం | రా.తె. 4-28 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 5ఆది | శు॥ అష్టమి | రోహిణి | మీనం | ఉ. 08-34 | శుభాదులు. | వర్గో |
| 5ఆది | శు॥ అష్టమి | మృగశి | వృశ్చికం | రా. 12-33 | శుభాదులు. | శుభ |
| 5ఆది | శు॥ నవమి | మృగశి | మకరం | రా.తె. 4-24 | శుభాదులు. | పుష్కర |
| 6సోమ | శు॥ నవమి | మృగశి | మీనం | ఉ. 07-21 | శుభాదులు. | పుష్కర |
| 6సోమ | శు॥ నవమి | మృగశి | వృషభం | ఉ. 11-16 | శుభాదులు. | పుష్కర |
| 8బుధ | శు॥ ఏకాదశి | పునర్వ | మీనం | ఉ. 07-13 | శుభాదులు. | పుష్కర |
| 8బుధ | శు॥ ఏకాదశి | పునర్వ | వృషభం | ఉ. 11-08 | శుభాదులు. | పుష్కర |
| 13సోమ | బ॥ పాడ్యమి | ఉత్తర | మీనం | ఉ. 08-01 | శుభాదులు. | వర్గో |
| 15బుధ | బ॥ తదియ | చిత్త | వృషభం | ఉ. 10-40 | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. | పుష్కర |
| 15బుధ | బ॥ తదియ | స్వాతి | వృశ్చికం | రా. 11-00 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 16గురు | బ॥ చవితి | స్వాతి | వృషభం | ఉ. 11-34 | వివాహం, ప్రతిష్ఠ. | శుభ |
| 16గురు | బ॥ చవితి | స్వాతి | వృశ్చికం | రా. 10-56 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 18శని | బ॥ షష్ఠి | అనూ | వృశ్చికం | రా. 10-48 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |
| 18శని | బ॥ షష్ఠి | అనూ | మకరం | రా.తె. 3-29 | వివాహం, గృహప్రవేశం. | పుష్కర |

### "ప్రమాదో ధీమతామపి"

**ముహూర్తములను నిర్ణయించుకొనే ముందు పంచాంగ పీఠికయందు సరి చూసుకొనగలరు. పుష్కర, శుభ, వర్గోత్తమాంశ వివరాదులను, రహిత వివరాదులను గమనించగలరు. స్వల్ప దోషం గుణాధిక్యం అను వాక్యానుసారం ముహూర్తములను నిర్ణయించడం జరిగినది.**

సర్వం శ్రీమాతృ చరణారవిందార్పణమస్తు

విద్వత్కృపాభిలాషి **దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

9963732303, 9550017546, 9866839560



# మేష రాశి

## ARIES

| |
|---|
| ఆదాయం - ౦౨ |
| వ్యయం - ౦౮ |
| రాజ్యపూజ్యం - 01 |
| అవమానం - 07 |

**అశ్వని, భరణి, కృత్తిక 1 వ పాదాలలో జన్మించినవారు.**

**చూ,చే,చో,ల,లీ,లూ,లే,లో,అ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మేష రాశి వారి లక్షణములు :**

వీరు సామాన్య శరీర ధారుఢ్యం, పొడవైన మెడ, గుండ్రని యెఱ్ఱని కళ్ళు, హస్తములో పుట్టుమచ్చలాంటి చిహ్నములు, కోల ముఖము కలిగి ఉంటారు. వేడి పదార్థములు భుజించుటయందు ఆసక్తి కలిగి అల్పాహారులై యుందురు. తీవ్రత, శక్తి, దృఢత్వం, అచంచలమైన నిశ్చయము, సాహసము, వ్యవహార దక్షత, విశ్లేషణ, నైపుణ్యత, స్వతంత్ర జీవనము నందు అభిలాష కలిగి, విద్యావంతులు, ఆరోగ్యవంతులు శౌర్యవంతులై ఉందురు. సాహసము ఆవశ్యకత ఉన్న చోట రాణింతురు. అభ్యాసము వలన శరీరశక్తి మరింత దృఢంగా ఉంటుంది. ముక్కుకు సూటిగా ఆవేశముగా ఎన్ని అడ్డంకులు వచ్చిననూ పోరాడి విజయం సాధింతురు. పదిమందిని కూడగట్టుకొని నాయకత్వం వహించుదురు. వేద శాస్త్ర సదాచారములయందు ప్రీతి కల్గి ఉందురు. నీరు,అగ్నిభయం ఎక్కువ. ప్రేమ, జాలి, దయా గుణములతో ఆకర్షించ గల నేర్పు కలిగి ఉంటారు. అహంకార పూరితమైన స్వభావము కారణంగా అపాయాలు,ఇబ్బందులు, కష్టాలు కొని తెచ్చుకుంటారు. కన్యారాశిలో జన్మించినవారు శత్రువులై వీరిని పొగిడి, రెచ్చగొట్టి పతనము చేయుదురు. బాల్యంలో కష్టాలు, చిన్న వయస్సులో ఆర్థిక ఇబ్బందులు, స్నేహితులను విడిచిపెట్టి, ఇతర ప్రాంతాలకు వెళ్ళడం, కుటుంబ పరిస్థితి మారడం జరుగును. దుడుకు స్వభావాన్ని వదిలి పెట్టలేరు. అతిస్నేహం, అతి శత్రుత్వం కలిగిన మనస్తత్వం వీరిని క్రుంగదీయును. ఏ చిన్న ఎదురు దెబ్బ తలిగినా నిరుత్సాహ పడే తత్వం. తండ్రియందు వ్యతిరేఖత తల్లి యందు అనురాగభావం, జ్యేష్ఠ సంతతి వలన కష్టములు, తోబుట్టిన వారి వలన సౌఖ్యమును కలిగి యుందురు. అబ్బాయిలు సౌందర్యం పట్ల, అలంకరణ పట్ల ఆసక్తి చూపుతారు. ప్రేమలో నూతనత్వాన్ని కాంక్షిస్తారు. కొత్త వ్యక్తి మీద ప్రేమ కలుగగానే పాతవారిని మరచిపోతారు. పొగడ్తలకు ఉబ్బి పోయెదరు. అశ్వినీ నక్షత్రమున జన్మించిన వారు అందముగా ఉందురు. అలంకార ప్రియులు. కార్యదక్షులు. భరణీ నక్షత్రం వారు సమర్థులు, సుఖవంతులు,మొండి పట్టు కలిగిన వారు. కృత్తికా నక్షత్రం వారు భోజన ప్రియులు, ఇతరుల విషయముల యందు ఆసక్తి కలవారు. తూర్పు, ఉత్తర సింహ ద్వారములు శుభప్రదం. 2,3,8,9,11లకు ఆది, మంగళ, బుధ, శనివారములు కలసిన శ్రేయోదాయకం.

## మేష రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 5,6 స్థానములలో, శని 8,9 స్థానములో, రాహువు 5 వ స్థానములో, కేతువు 11 వ స్థానములలో ఉండుట వలన

చాలా కాలాంగా నెమ్మదిపడిన పనులన్నీ ఇతరులు సహకారముచే పూర్తి అగుట, ఆర్థికపరమైన అంశములయందు అనవసరముగా మాటలు ఇచ్చుటవలన ధననష్టం వాటిల్లుట, సోదర వర్గం వారితో విభేదములు ఏర్పడుట, కోర్టు వ్యవహారములు సఫలీకృతమగుట, ఆర్థికపరంగా ఆదాయం వచ్చిననూ ఆడంబరములకై, వైద్యసేవా నిమిత్తమై ధనవ్యయం అధికమగుట, ఋణప్రయత్నములు తప్పక చేయవలసి వచ్చుట, కొత్తవ్యాపారాదులలో లాభములు చేకూరుట, మధ్యవర్తిత్వ వ్యాపరస్తులకు, కళాకారులకు, యోగదాయకముగా ఉండుట, వ్యవసాయదారులకు రెండుపంటలు లాభించిననూ శుభమూలకముగా ధనవ్యయము అధికమగుట, విద్యార్థులకు శ్రమచేత ఉన్నత ఫలితములు, ఉన్నత ఉద్యోగ అవకాశములు చేకూరుట, ఉద్యోగస్థులకు స్థానమార్పులు ఏర్పడుట, రాజకీయవర్గం వారు సామరస్యముతో పదవిలో ముందుకువెళ్లుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గణపతి ఆరాధనలు, గణపతి హోమములు, వేద పండితులకు వెండిగణపతిని, అన్నదానమును చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదులయందు అభివృద్ధి, శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, వస్తువాహనాదుల కొనుగోలు చేయుట, దూరప్రయాణాదులు చేయవలసి వచ్చుట, పురస్కారములు లభించుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పొత్తువ్యాపారాదులు వృద్ధిచెందుట, శారీరక శ్రమ అధికమగుట, విందువినోదాలలో పాల్గొనుట, ప్రముఖ వ్యక్తులను కలుసుకొనుట, సోదర వర్గం నుండి వ్యతిరేఖతలు ఏర్పడుట, అధికారుల ఒత్తిడి అధికమగుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఋణబాధలు తగ్గుముఖం పట్టుట, ఆర్థిక పరంగా అనుకూలత ఏర్పడుట, గొంతు సంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట, సంతానాదుల వలన ఆనందమైన జీవనము కలుగుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, పోయిన వస్తువులు లభించుట, క్రయవిక్రయాలలో లాభములు జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పొత్తువ్యాపారములు లాభించుట, ఆదాయపరంగా అనుకూలత ఉన్ననూ అధిక ఖర్చులు ఏర్పడుట, ఋణప్రయత్నములు తప్పనిసరియగుట, స్థానచలనములు ఏర్పడుట, అంతఃశతృకలహములు అధికమగుట, నూతన ప్రయత్నములు లాభించుట, సంఘంలో ఈర్ష్యాసూయలు అధికమగుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమ ప్రయత్నములు సాగించుట, అధికారుల నుండి మన్ననలు పొందుట, మాటకు విలువ పెరుగుట, ఆభరణాదులను కొనుగోలు చేయుట, ప్రభుత్వ కార్యక్రమాదులలో పాల్గొనుట, వృత్తివ్యాపారాదులలో లాభములు చేకూరుట, శభమూలక ధనవ్యయము అధికమగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సహోద్యోగుల నుండి ఇబ్బందులు అధికమగుట, నరఘోష అధికమగుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, స్థిరాస్తుల విషయాదులలో ఇబ్బందులు తలెత్తుట, ప్రముఖులను కలుసుకొనుట, గౌరవ మర్యాదలకై అధిక శ్రమచేయవలసి వచ్చుట, నిద్రలేమితనము, అకాలభోజనములు జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదులలో మిత్రుల సహకారము లభించుట, ఆదాయపరంగా అనుకూలత ఉన్ననూ ఋణములు చేయవలసి వచ్చుట, ఉద్యోగాదులలో మార్పులు వచ్చుట, వైద్య సేవ చేయవలసివచ్చుట, దూర ప్రాంతములనుండి శుభవార్తలు వినుట, వివాదములు తగ్గుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమాదులలో ముఖ్యవ్యక్తులుగా ఉండుట, ప్రయాణాదుల వలన ఇబ్బందులు పడుట, అకారణ కలహములు ఏర్పడి మరలా తగ్గుముఖం పట్టుట, దేవాలయాదులకు, విహార స్థలములకు వెళ్లుట, వాహన పరంగా ఒడిదుడుకులు ఏర్పడుట, ఉద్యోగాభివృద్ధికై చేయు ప్రయత్నములు సఫలమగుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ భాగస్వామి తో విభేదములు ఏర్పడుట, సఖ్యతను పెంచుకొనుటకు ప్రయత్నములు చేయుట, ఇంటి కంటే బయట విషయములకు సమయము కేటాయించుట, శారీరక ఒత్తిడి అధికమగుట, చాలాకాలంగా ఇబ్బంది పెడుతున్న సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థిక అభివృద్ధికై నూతన ప్రయత్నములు చేయుట, ఎంత కష్టించినా ధనము నిల్వలేకపోవుట, ఖర్చులు అధికమగుట, దుబారా ఖర్చులను తగ్గించుటకై విశ్వ ప్రయత్నములు చేయుట, మానసిక ఆందోళన అధికమగుట, అధికారుల సహకారముతో మిత్రుల సహకారముతో పనులు సానుకూలమగుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బాగా నమ్మిన వారి వలన మోసపోవలసి వచ్చుట, ఇంటి వారికంటే బయటవారినే అధికంగా నమ్ముట, పొత్తుదారులతో మాటపట్టింపులు తగ్గించుకునేందుకు అనవసరంగా తప్పులను నెత్తిమీద వేసుకోవలసి వచ్చుట, సానుకూల పరిస్థితులు ఒకవైపు ప్రతికూలములు మరోవైపు జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వ్యాపారాదులు అభివృద్ధిపథములో వెళ్లుట, ప్రయాణ బడలికలు అధికమగుట, నూతన ప్రయత్నములు ఇబ్బంది పెట్టినా లాభించుట, తొందరపాటు నిర్ణయముల వలన ఇబ్బందులు రాకుండా జాగ్రత్త పడుట, ఆర్థిక అభివృద్ధి ఏర్పడుట, బంధుమిత్రులను కలుసుకొనుట జరుగును.



# వృషభ రాశి
## TAURUS

ఆదాయం - 11
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 04
అవమానం - 07

**కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2 పాదాలలో జన్మించినవారు.**
**ఇ,ఉ,ఏ,ఓ,వ,వి,వు,వే,వో అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**వృషభ రాశి వారి లక్షణములు :**

వీరిది పుష్టిగల శరీరం, గుండ్రని ముఖము, పొట్టి మెడ, తొడలు, పృష్టము విశాలముగా నుండును. ముఖము మీద గాని,వృష్టము మీదగాని,పార్శ్వ భాగమున గానీ పుట్టమచ్చ ఉండును.మూపురముండును.శరీరశిక్షణ, ఫుట్‌బాల్ వంటి ఆటలు ఆరోగ్యమును పెంచును. స్థిరత్వము, ఆనందము, వాత్సల్యము, దృఢత్వము, పెదవులపై చిరునవ్వు, నిజాయితీ, ఆప్యాయత, మంచి మనస్సు ఉండును. సంగీత సాహిత్యా భిలాషులు. వీరిలోని నిష్కల్మషమైన గుణము, మంచితనము, నమ్మకము కలిగించె స్వభావము ఎదుటివారిని ఆకర్షిస్తాయి. ఉన్నతాధికారులుగా నియమించినచో చక్కగా పనులు చేయింపగలరు. మధ్య వయస్సులోనూ, వృద్ధాప్యంలోనూ సుఖపడుదురు. ఎదుటివారిని ఆకర్షించగల శక్తిఎక్కువ. తండ్రిగానీ, తాతగానీ, అత్యంత ప్రతిభావంతులై ఉంటారు. పూర్వ బంధువులుందురు. వీరి వలన కుటుంబమునకు మంచిపేరు,ప్రతిష్ఠలు వస్తాయి. వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.స్త్రీ ప్రియులు.ప్రేమ వ్యవహారాలలో చిక్కుకున్నచో, ఎదుటి వ్యక్తి చేతిలో కీలు బొమ్మ కాగలరు. ఒక యువతి చేత ఒకసారి ప్రభావితులైతే శక్తులన్నియూ వ్యర్థమై పోవును. చిన్న వయస్సులో వివాహమాడుట గానీ, ప్రేమ కలాపము గానీ, ఏదైనను మొదటి ప్రయత్నము విఫలమగును. 30ఏళ్ళ తర్వాత వివాహమాడినచో వైవాహిక జీవితం ఆనందమయమగును.ఈ రాశి స్త్రీలు బహు రూపవతులు. కళాత్మక దృష్టితో చిత్రములు, గృహోపకరణములు కంటికింపుగా ఏర్పాటు చేయుదురు.రుచిగల మధుర పదార్థములు తయారు చేయగలరు.విలాసముల కొరకు ఖర్చు చేయుదురు.పుత్రులు, పుత్రికలు కలిగి దీర్ఘాయుర్దాయము కలవారగుదురు. అబ్బాయిలకు-ప్రేమ వ్యవహారాల్లో నిజాయితీ కాస్తంత ఉధృతంగా ఉంటుంది. గుడ్డిగా ప్రేమిస్తారు.ప్రేమ,అభిమానాల విషయంలో ఎదురుదెబ్బ తగిలితే జీవితంలో కోలుకోలేరు. మనస్ఫూర్తిగా చేసే పొగడ్తలు అంటే ఇష్టం. కృత్తిక నక్షత్రం వారు భోజన ప్రియులు. తేజస్సు, ఇతరుల యందు ఆసక్తి కలిగి ప్రఖ్యాతి చెందుతారు. రోహిణి నక్షత్రము వారు స్థిరచిత్తులు, మధుర సత్యభాషణులు, శుచి కలిగి అందముగా నుందురు. మృగశిర నక్షత్రం వారు ఉత్సాహం, ధనము, భోగము కలిగి బాగా మాట్లాడుదురు. భయపడు స్వభావ ముండును.చపల చిత్తులు కానీ సమర్థులు. వీరి అదృష్ట సంఖ్య 1,2,5,6,9, శని, బుధ, శుక్ర, సోమవారములు కలసిన యోగించును.

### వృషభ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 4,5 స్థానములలో, శని 7,8 స్థానములో, రాహువు 4 వ స్థానములో, కేతువు 10 వ స్థానములలో ఉండుట వలన

ఆర్థికపరమైన, కుటుంబపరమైన లావాదేవీలు అనుకూలమగుట, ఆదాయవనరులు అధికమగుట, వాహనాదులను కొనుగోలు చేయుట, గృహమునందు శుభకార్యక్రమాలు జరుగుట, వంశవృద్ధి కలుగుట, మధ్యవర్తిత్వ వ్యవహారములలో ఇబ్బందులు ఏర్పడుట, గౌరవమర్యాదలకు భంగము వాటిల్లుట, చెడుకార్యక్రమాలకి సహకారము అందించుట, ప్రయాణములు అధికమగుట, ఏది మాట్లాడిననూ ఇతరులకు తప్పుగా అర్థమగుట, వ్యాపారాలలో పెద్దల సహకారముతో శుభఫలితములు ఏర్పడుట, విద్యార్థులకు మంచి గుర్తింపులు వచ్చి ఉన్నత స్థితికి వెళ్లుట, వ్యవసాయ దారులకు మొదటి పంటకన్ననూ రెండవ పంట అధికంగా లాభించుట, ఉద్యోగస్థులకు, అధికారులకు మధ్యలో సఖ్యత తక్కువగా ఉండుట, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, రాజకీయ వర్గం వారికి పదవిభంగము, అధికారుల ఒత్తిడి అధికమగుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గోసేవ చేయుట, రుద్రహవనములు, సహస్రలింగార్చనలు, దుంపకూరలను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం క్రయవిక్రయాదుల వలన లాభములు ఏర్పడుట, చాలాకాలంగా ఇబ్బందిపడుతున్న సమస్యలు తగ్గుముఖం పట్టుట, ప్రయాణాదు లలో విలువైన వస్తువులను కోల్పోవుట, శుభమూలక ధనవ్యయము జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవీక ప్రాంతములను సందర్శించుట, మధ్యవర్తిత్వముల వలన మాటలు పడవలసివచ్చుట, నూతన పెట్టుబడుల వలన లాభములు ఏర్పడుట, శ్రమాధిక్యము, పనుల విషయమై అసహనము చెందుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవ మర్యాదలు పెంపొందుట, సన్నిహితుల నుండి శుభవార్తలు వినుట, అంతఃశత్రువులు అధికమగుట, దుబారా ఖర్చులు పెరుగుట, ధనార్జనకై విశేష ప్రయత్నములు చేయుట, ప్రభుత్వ అంశములలో ముఖ్యమైన పాత్ర వహించుట, ఇతరుల సహకారముతో శుభప్రయత్నములు లాభించుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పాతమిత్రులను కలుసుకొనుట, ఋణ బాధలను తగ్గించుకొనుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట, చేయు వృత్తి వ్యాపారాదులయందు మార్పులు ఏర్పడుట, ముఖ్యమైన విషయములకై కుటుంబ వ్యక్తులతో సంప్రదింపులు చేయుట, కుటుంబ సఖ్యత ఆకస్మిక ధన లాభములు జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆరోగ్యపరమైన ఇబ్బందులను తొలగించుకొనుటకు వైద్యుల సలహా తీసుకొనుట, పొత్తు వ్యాపారములు ప్రారంభము చేయుట, ఆర్థికపరంగా అనుకూలత ఉన్ననూ ఏదోరకంగా ఖర్చులు అధికమగుట, శ్రమ అధికమగుట, తోటివారి ఈర్ష్యాసుయల వలన ఇబ్బందులు పడుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక శ్రమ అధికమగుట, గృహోపకరణాదులకై ధనవ్యయము చేయవలసి వచ్చుట, నిర్మాణాది పనులలో ఆటంకములు ఏర్పడుట, గౌరవ పురస్కారములు లభించుట, సోదర విభేదములు తగ్గుముఖం పట్టుట, ప్రముఖ వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, అధికారుల మన్ననలు పొందుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదులలో సానుకూల ఫలితములు ఏర్పడుట, పొత్తుదారులతో అభిప్రాయ భేదములు తొలగుట, నూతన వస్తు వాహనాదులను కొనుగోలు చేయుట, అధికపనుల వలన కోపోద్రిక్తములు అధికముగుట, దైవసందర్శనములు చేయుట, గుర్తింపుకై చేయు ప్రయత్నములు సఫలమగుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఏదిమాట్లాడిననూ ఇతరులకు వ్యతిరేఖము గా అర్థమగుట, ముఖ్యమైన పనులు నెమ్మదిగా జరుగుట, వైవాహిక శుభ ప్రయత్నములు సఫలమగుట, దూరప్రాంత ప్రయాణములు చేయవలసి వచ్చుట, తొందరపాటు నిర్ణయముల వలన మానసిక ప్రశాంతత కోల్పోవుట, ఆరోగ్య భంగములు ఏర్పడుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మాటను అదుపులో పెట్టుకోలేకపోవుట, తద్వార పశ్చాత్తాప పడుట, ప్రముఖ వ్యక్తులతో కలసి ప్రయాణములు చేయుట, ఋణబాధలు తొలగి సానుకూలత ఏర్పడుట, అన్నీ తానై అన్నివిధంగా పనులు చేయవలసి వచ్చుట, పనివారిపై అసహనము పొందుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసివచ్చుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థిక అభివృద్ధికై పాతమిత్రుల సహకారము తీసుకొనుట, అధికారుల సహకారములు అప్రయత్నంగా లభించుట, ఎముక, చర్మ సంబంధమైన ఇబ్బందులు వచ్చుట, వైద్యసేవ తప్పనిసరిగా అగుట, మధ్యవర్తిత్వ పనుల యందు ఆశించిన ఫలితములు రాకపోవుట, అనవసరంగా మాటలు పడుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన మిత్రులతో పరిచయములు ఏర్పడుట, బంధుమిత్రులతో కలుసుకొని విందువినోదాలలో పాల్గొనుట, శుభమూలక ఆభరణాదుల నిమిత్తమై అధిక ధనవ్యయమగుట, శారీరక మానసిక శ్రమ అధికమగుట, ఉద్యోగాదులయందు అభివృద్ధి ఏర్పడుట, ప్రయాణములు వాయిదా పడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దూరప్రాంత ప్రయాణముల వలన శ్రమ అధికమగుట, కుటుంబ వ్యక్తులను సంతోష పరుచుటకై అధికంగా ధనవ్యయము చేయవలసి వచ్చుట, కుటుంబ వ్యక్తుల సహకారముల వలన అన్ని శ్రమలను మరచిపోయి ఆనందమయ జీవనము గడుపుట, నూతన వ్యాపారాదుల అభివృద్ధికై ఆలోచించుట జరుగును.



# మిథున రాశి
## GEMINI

ఆదాయం - 14
వ్యయం - 11
రాజ్యపూజ్యం - 07
అవమానం - 07

మృగశిర3,4, ఆర్ద్ర 1,2,3,4, పునర్వసు1,2,3, పాదాలలో జన్మించినవారు.
క,కి,కు,ఖం,జ్ఞ,చ,కే,కో,హ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు

**మిథున రాశి వారి లక్షణములు :**

వీరికి మేధస్సు, జ్ఞాపకశక్తి, ప్రపంచ జ్ఞానమెక్కువ. ఎదుటివారిని క్షణాల్లో ఆకర్షిస్తారు. సందర్భాన్ని బట్టి మాట్లాడటంలో నేర్పు కలిగి ఉంటారు. కాలాన్ని, డబ్బును, వ్యక్తుల సామర్థ్యాలను చక్కగా వినియోగించగలరు. వీరు హాస్య ప్రియులు. జూద ప్రియులు. జ్యోతిష్య, కావ్య, గాన, నాట్య, కళా ప్రియులు. చాలా హాస్యముగాను, చమత్కారము గానూ మాట్లాడగలరు. దర్పంగా కనపడాలనే ఉద్దేశంతో అనవసర ఖర్చులు, ఆర్థిక ఇబ్బందులు తెచ్చుకుంటారు. వివాహంతో ధనంగాని, ఆస్తిగాని, ఉద్యోగ వ్యాపారాది లాభములు గానీ కలుగును. అసహనం, చికాకులు, విసుగు, అందర్ని క్రమశిక్షణలో వుంచుదామని నసపెట్టడం,ఈసడించుకోవడం,చులకనగా చూచుట,ఒత్తిడి చేయటం తగ్గించుకుంటే వీరి కుటుంబ సభ్యులు వీరి పట్ల ప్రేమగా వ్యవహరిస్తారు.వీరికి స్త్రీ లోలత్వము,స్త్రీల వలన అపకారం జరుగుతుంది.వార్తా ప్రసారము,విద్యా బోధనము, ఉపన్యాసములు, ఇతరుల సిద్దాంతములను ప్రచారం చేయు గ్రంథముల రచనలందు అభిలాష కలిగి జీవితంలో రెండు రకాల వృత్తి ఉద్యోగాలలో ప్రావీణ్యత ఉంటుంది. వ్యాపార సంస్థలకు ప్రణాళికలను రూపొందించుట తెలియును.ఇష్టపడి చదివిననూ మధ్యలో నేర్చుకున్నదే జీవితంలో ఉపయోగపడుతుంది,ఆర్జించిన ధనం మాత్రం స్థిర చరాస్తులకు, గృహ క్షేత్రాదులకు సరిపోతుంది.ఆలోచించకుండా చేసే పనులలో విశేష ధనలాభం కలుగును.అబ్బాయిలు ఎప్పుడు ఆనందంగా వుండే వారంటే ఇష్టపడతారు.ప్రపంచంలోని అందాలన్నీ అందిస్తారు.తమ భావాలని అర్థం చేసుకునే, జాగ్రత్తగా చూసుకునే వారిని కోరుకుంటారు.అమ్మాయిలు-తెలివిగలవారు గనుక అందచందాలు చూసి కాక బహుముఖ ప్రజ్ఞాశాలై అన్ని విషయాలనూ చర్చించే వారిని ప్రేమిస్తారు. మృగశిరా నక్షత్రము వారు ఉత్సాహము, ధనము, భోగము కలిగి బాగా మాట్లాడుదురు. భయపడు స్వభావముండును. చపలచిత్తము కాని సమర్థులు.ఆర్ద్రా నక్షత్రమువారు పరకార్యములందు విముఖత్వము, గర్వము,కృతజ్ఞత,హింసించు స్వభావము కలిగి పాప కార్యములు చేయుదురు.పునర్వసు నక్షత్రం వారు ఇంద్రియ నిగ్రహం కలిగి తపస్సు చేయుటయందు ఆసక్తి కలిగి యుందురు.సుఖ పడుదురు.సుశీలత్వముండి, అమాయకుని వలె కనిపించుదురు. ఆరోగ్యము తక్కువ, దాహము జాస్తి, అల్ప సంతోషులు. వీరి అదృష్ట సంఖ్య 1,3,6,9. ఆది, సోమ, బుధ వారములు కలిసివచ్చును.

## మిథున రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 3,4 స్థానములలో, శని 6,7 స్థానములో, రాహువు 3 వ స్థానములో, కేతువు 9 వ స్థానములలో ఉండుట వలన

చేయు వృత్తివ్యాపారాదులలో అనుకూలంగా ఉండుట, ఆడంబరములవలన, చెడ్డపేరు తెచ్చుకొనుట, చాలాకాలంగా ప్రయత్నిస్తున్న శుభ ప్రయత్నాలు సఫలమగుట, వంశ మూలకముగా ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, సంతానాదుల వలన ఇబ్బందులు అధికమగుట, వివాదములు తగ్గి మరలా పెరుగుతూ ఉండుట, మాటను అదుపు చేసుకోలేకపోవుట, స్థానమార్పులేర్పడుట, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, విద్యార్థులు పరిక్షలయందు అతిశ్రమచేత బోటాబోటి మార్కులతో ఉత్తీర్ణత పొందుట, వ్యవసాయదారులకు రెండుపంటలూ లాభించుట, వ్యాపరస్థులకు సామాన్య ఫలితములు కలుగుట, ఉద్యోగస్థులకు స్థానచలనములు ఏర్పడుట, కళాకారులకు పురస్కారములు లభించుట, రాజకీయవర్గం వారికి ప్రజావ్యతిరేఖత, ఆరోగ్య భంగములు అధికమగుట, శారీరక శ్రమ అధికమగుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గా సంబంధమైన ఆరాధనలు చేయుట, కంచుపాత్రలో మినుములు దానము చేయుట, సౌరహోమములు చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక ఆందోళనలు అధికమగుట, ఆర్థిక ఇబ్బందులు ఏర్పడుట, ఆర్థిక అభివృద్ధికై చేయు లాటరీ విధానాలలో నష్టపోవుట, శత్రుత్వ బాధలు అధికమగుట, మిత్రుల ద్వార స్వల్ప లాభములను పొందుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమాదులలో పాల్గొనుట ద్వార మానసిక ప్రశాంతత పొందుట, ఋణములకై తీవ్ర ప్రయత్నములు చేయవలసి వచ్చుట, మిత్రులు కూడా శత్రువులుగా మారుట, ఎవరిని నమ్మలేని పరిస్థితి ఏర్పడుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సానుకూల ఫలితములకై పొత్తుదారుల దగ్గర తలవంచుకోవలసిన పరిస్థితి వచ్చుట, అనవసరపు మాటల వలన ఇబ్బందులు పడుట, ప్రముఖుల సహకారములతో సమస్యలు మెల్లమెల్లగా తగ్గుట, సన్నిహితుల వలన చేయు పనులయందు లాభములు చేకూరుట, మానసిక ప్రశాంతత ఏర్పడుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పని ఒత్తిడి అధికమగుట, ముఖ్యమైన కార్యక్రమాదులలో పాల్గొనుట, సమయానికి ధనము చేతికందుట, వృత్తివ్యాపార అభివృద్ధికై చేయు ప్రయత్నములు సఫలమగుట, వైవాహిక శుభ ప్రయత్నములు ఒక కొలిక్కివచ్చుట, ఆడంబరముగా కనిపించుటకు ప్రయత్నములు చేయుట నూతన మార్పులు జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సంఘంలో గౌరవమర్యాదలు పెరుగుటకు తీవ్ర ప్రయత్నములు చేయుట, ప్రతివారిని కలుపుకొని వెళ్ళడానికి అహాన్ని విడిచిపెట్ట వలసివచ్చుట, నిర్మాణాదిపనులకై ఆలోచన చేయుట, జల విహార ప్రాంతములకు వెళ్లుట, ముఖ్యమైన నిర్ణయములు వాయిదాపడుట, మానసిక ఒత్తిడి అధికమగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల ఒత్తిడిని తగ్గించుకొనుటకు పనులను ముందుగానే పూర్తి చేయుట, వారి మన్ననలను పొందుట, సొంత విషయములకై సమయము కేటాయించక పోవుట, తద్వార కుటుంబ వ్యక్తులతో స్వల్ప మనస్పర్దలు వచ్చుట, మరల తగ్గుముఖం పట్టు, ప్రముఖుల దగ్గర తగిన గుర్తింపు వచ్చుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిర్మాణాది పనులు ప్రారంభము చేయుట, తెలియకుండానే చెడు కార్యక్రమములకు సహకారమందించుట, మరల పశ్చాత్తాప పడుట, సమయస్ఫూర్తితో నిర్ణయములు తీసుకొనుట, ఆరోగ్యపరమైన ఇబ్బందులు ఏర్పడుట, నూతన విషయములను తెలుసుకొనుటకై ప్రయాణములు చేయవలసి వచ్చుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనివారి వలన ఇబ్బందులు ఏర్పడుట, కొత్తవారితో పరిచయములు ఏర్పడుట, ఋణ సంబంధమైన విషయములు సానుకూల పడుట, బంధుమిత్రులను కలుసుకొనుట, విందువినోదాలలో పాల్గొనుట, నూతన వస్తు వాహనాదులను కొనుగోలు చేయుట, స్థిరాస్తి చర్చలు వాయిదాపడుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తుల వలన ధనవ్యయము అధికమగుట, స్థానచలనములు ఏర్పడుట, దూరప్రాంత ప్రయాణములు కలసివచ్చుట, క్రయవిక్రయాదులలో లాభములేర్పడుట, శుభప్రయత్నములు అనుకూలించుట, సొంతవారికై సమయము వెచ్చించుట, సంతానాదుల అభివృద్ధికై ఆలోచించుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదుల యందు సానుకూల వాతవరణములు ఏర్పడుట, ఆదాయ వనరులను అభివృద్ధి చేసుకొనుటకు, ప్రయత్నములను సాగించుట, కొనుగోలు వ్యవహారములలో ఇబ్బందులు వాటిల్లుట, భూవివాదములు తగ్గుముఖం పట్టుట, మనస్పర్దలు తొలగిపోవుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయని తప్పిదములకు మాటలు పడవలసివచ్చుట, శుభ కార్యక్రమ ప్రయత్నములు వాయిదా పడుట, పితృవర్గం నుండి చెడువార్తలు వినవలసివచ్చుట, వాహనపరమైన ఒడిదుడుకులు ఏర్పడుట, న్యాయ వ్యవస్థకు అపరాధ రుసుము చెల్లించవలసివచ్చుట, శారీరక శ్రమ అధికమగుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వృత్తి వ్యాపరాదులలో అనవసరపు వ్యక్తుల జోక్యము వలన ఇబ్బందులు వాటిల్లుట, అతివిశ్వాసము వలన మాటలు పడవలసి వచ్చుట, దగ్గరివారి వలన మోసపోవలసి వచ్చుట, అకాల భోజనములు, నిద్రలేమి తనము వలన వైద్యసేవ తప్పనిసరి అగుట, దీర్ఘకాలిక సమస్యల నివారణకై ప్రయత్నించుట జరుగును.



# కర్కాటక రాశి
## CANCER

ఆదాయం - 08
వ్యయం - 11
రాజ్యపూజ్యం - 03
అవమానం - 03

**పునర్వసు 4, పుష్యమి 1,2,3,4, ఆశ్రేష 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.**
**హి,హు,హే,హో,డ,డి,డు,డె,డో అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కర్కాటకరాశి వారి లక్షణములు :**

ఎత్తైన జఘన ప్రదేశము. పొట్టితనము, కంఠము లావుగాను, గుండ్రని నవ్వు ముఖము, తెల్లటి శరీర కాంతి మధ్యమ శరీర ధారుఢ్యం కలిగియుందురు. వీరి జీవితం సుఖ సంతోషాల అదృష్టాల మిశ్రమం. విషయ విశ్లేషణ, అవగాహనలలో వీరికి శక్తి, ఏకాగ్రత ఎక్కువ. ఆలోచించి, చక్కటి నిర్ణయాలు తీసుకుంటారు. మిత్రుల విషయంలో, స్వజన బంధువుల విషయంలో, ఆత్మీయతతో, నమ్మకంగా మసలుకొంటారు. మర్యాదగా సంభాషించెదరు. కొంతమందితో స్నేహంగా ఉంటారు. సముద్రానికి గాని, నదికిగాని చేరువలో ఉండే ప్రదేశాలు కలసివస్తాయి. జలగండం ఉండును. ఒక్కొక్కసారి అకారణభీతి, ఒంటరితనము పట్ల అభిలాష, వివాదం, నిరాశ,దిగులు, బంధుమిత్ర బృందముతో కలిసి ఉండలేరు. వీరు వక్రముగానూ, శీఘ్రముగాను నడుస్తారు. వ్యవహారాలను అతి జాగ్రత్తగా సమర్థించుకోలేరు. యుక్తాయుక్త విచక్షణ ఎక్కువ. చదవటమన్నా, అధ్యయనం చేయుట అన్నా మక్కువ. జ్యోతిష్య, వైద్య, గణిత శాస్త్రముల యందు అభిరుచి ఎక్కువ. సరుకుల ఎగుమతి దిగుమతులు, ధాన్యం,వస్త్రములు, తినుబండారములు,పానీయముల వ్యాపారాలు కలిసివచ్చును. భాగస్వామ్య వ్యాపారాలలో మెలకువ అవసరము. ఉద్యోగం కన్నా వ్యాపారం లాభదాయకం. స్వతంత్ర నిర్ణయాలతో ప్రగతిని సాధిస్తారు. భూమి పేర్లతో చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృద్ధి క్షయములు గల ధనము కలిగియుందురు. 20 సం॥రాలలోపు ఆర్థిక ఇబ్బందులు ఎక్కువ. సరదాగా మాట్లాడిన మాటల వలన ఎక్కువగా నష్టపోతారు. నీటియందు పూలతోటయందు ఆసక్తి ఎక్కువ. చిన్న వయస్సులోనే వివాహం జరుగును. పిల్లలను విడిచి ఎక్కువకాలం ఉండలేరు. పిల్లల్ని అల్లరి పెడతారు. చిన్న మాటకే ఎక్కువగా నొచ్చుకుంటారు. త్వరగా మరచిపోకుండా పదేపదే తలుచుకుంటారు. పరస్త్రీలయందు మక్కువ ఎక్కువ. మంచిపేరు, ప్రతిష్టలతో ఉన్నత పదవిలో దూర దేశమున స్థిరపడును. పునర్వసు నక్షత్రమున జన్మించినవారు ఇంద్రియ నిగ్రహం, తపఃశక్తి, సౌఖ్యము, సుశీలత్వము అమాయకత్వం, అనారోగ్యము ఉండును. దాహము జాస్తి, అల్ప సంతోషము ఉండును. పుష్యమి వారు ఇంద్రియ నిగ్రహము, అందరియందు అనుకూలత, శాస్త్రార్థ జ్ఞానమును కలిగియుందురు. ధనవంతులు ధర్మాసక్తిపరులు అగుదురు. ఆశ్లేషవారు ఇతరుల పనులయందు విముఖత్వము కల్గియుందురు. సర్వభక్షకులై పాపకర్మలు చేయుదురు. చేసిన ఉపకారము మరచుదురు. ఇతరులను వంచన చేయుదురు. వీరి అదృష్ట సంఖ్య 2,3,6,9, సోమ, మంగళ, శుక్ర, ఆది వారములు కలిసిన మరింతమేలు.

## కర్కాటక రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 2,3 స్థానములలో, శని 5,6 స్థానములో, రాహువు 2 వ స్థానములో, కేతువు 8 వ స్థానములలో ఉండుట వలన

అనవసరపు మాటల వలన శతృత్వ భావనలు అధికమగుట, ప్రయాణములలో అధిక ధనవ్యయమగుట, గృహమునందు మార్పులు, గృహోపకరణములు కొనుగోలు చేయుట, కుటుంబంలో ఆరోగ్యపరమైన ఇబ్బందులు వాటిల్లుట, వైద్యసేవ తప్పనిసరి యగుట, కుటుంబ సహకారముతో పనులు పూర్తియగుట, నూతన వ్యాపారాదులలో తొందరపాటు నిర్ణయములతో ధననష్టములు వాటిల్లుట, వాహన పరమైన ఇబ్బందులు ఏర్పడుట, ధనవ్యయం అధికమగుట వలన మరలా ఋణ ప్రయత్నములు చేయుట, రక్షకభటులకు అపరాధరుసుమును చెల్లించవలసివచ్చుట, విద్యార్థులు తోటి విద్యార్థులపై పోటీతత్వంతో చదివి ఉత్తీర్ణతను పొందుట, వ్యవసాయదారులకు పంటలు లాభించిననూ ధనమునిల్వ లేకపోవుట, ఉద్యోగస్థులకు, అధికారులకు సఖ్యత లేకపోవుట, రాజకీయవర్గం వారికి స్వపక్షవిరోధములు అధికమగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సుబ్రహ్మణ్య ఆరాధనలు, నవనాగ హవనములు, పిల్లలకు తీపి పదార్థములు, గింజలు లేని ఫలములు దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యాపారాదులకై ధనవ్యయము చేయుట, చిన్ననాటి మిత్రులను కలుసుకొనుట, తలకుమించిన పనులను చేస్తానని అనవసరపు వాగ్దానములు చేయుట, అనవసరంగా మాటలు పడవలసి వచ్చుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శత్రుత్వములు అధికమగుట, ఎవరిని నమ్మలేని మనస్తత్వము ఏర్పడుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, నిద్రలేమి తనములు ఏర్పడుట, గొంతుకు సంబంధించిన ఇబ్బందులు వాటిల్లుట, ఔషధసేవ జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికపరంగా అనుకూలతకై చేయుపనులు సఫలమగుట, మధ్యవర్తుల వలన మనస్పర్ధలు తొలగి అభివృద్ధి చేకూరుట, గౌరవ పురస్కారములు లభించుట, అన్నిపనులు మీరే చేసుకోవలసి వచ్చుట, ప్రయాణాదులు ఇబ్బంది పెట్టుట, ముఖ్య విషయములు ధనపరంగా వాయిదా పడుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కోర్టు వ్యవహారములు, మధ్యవర్తిత్వ వ్యవహారములు సమసిపోవుట, ఆరోగ్యపరంగా ఇబ్బంది ఉన్ననూ పనులను పూర్తి చేయుట, ఆర్థికపరంగా అభివృద్ధికై నూతన ఆలోచనలు చేయుట, కొనుగోలు వ్యవహారములకై చర్చలు చేయుట, పెద్దల, బంధువుల వలన స్థిరాస్తులు కలసివచ్చుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వైవాహిక ప్రయత్నములు సానుకూల పడుట, స్థిరాస్తుల విషయమై శుభములు చేకూరుట, బంధువర్గం వారి నుండి మాట సహాయము లభించుట, ఆహారపరమైన ఇబ్బందులు వాటిల్లుట, విందువినోదాలలో పాల్గొనుట, ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, కళాకారులను కలుసుకొనుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సేవాకార్యక్రమాదులకు సమయము కేటాయించుట, ఋణప్రయత్నములు సఫలమగుట, పితృవంశ మూలకముగా లాభములు చేకూరుట, విద్యా, ఉద్యోగ విషయాదులలో అభివృద్ధి ఏర్పడుట, పొత్తుదారులతో చర్చలు వాయిదా పడుట, మధ్యవర్తిత్వంగా వ్యవహరించడము వలన నష్టపడుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిర్మాణాది పనులకై ఋణప్రయత్నములు చేయవలసి వచ్చుట, అతినమ్మకము వలన దగ్గరివారితో మోసపోవలసి వచ్చుట, సొంతవారి నిర్ణయములను పట్టించుకోకపోవుట, ముఖ్యమైన పనులు వాయిదాపడుట, అధికారికి బరువు బాధ్యతలు అధికమగుట, మొండిబకాయిలు వసూలగుట, ఖర్చులధికంగా జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శత్రుత్వ నివారణకై ఆలోచనలు చేయుట, ప్రతిఒక్కరితో కలుపుగోలుతనముతో ముందుకు వెళ్లుట, అతిథి మర్యాదలకై ధనవ్యయము అధికమగుట, ఇతరుల మన్ననలకై ప్రాకులాడుట, స్థిరాస్తుల కొనుగోలుకై మోసపోవుట, రాజీప్రయత్నములు సఫలమగుట, పండితులను కలుసుకొనుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రముఖుల ప్రోత్సాహముతో చేయు ప్రయత్నములు సఫలమగుట, అనవసరపు హామీల వలన ఇక్కట్లు పడుట, తప్పించుకొనుటకై ప్రముఖులను ఆశ్రయించుట, సంతానాదుల విద్యాభివృద్ధికై సమయము వెచ్చించుట, శారీరక శ్రమ అధికమగుట, ధార్మిక, యోగా కార్యక్రమాదులలో పాల్గొనుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదుల యందు శ్రమకు తగిన ఫలితము వచ్చుట, కుటుంబవ్యక్తులకు ఆరోగ్యపరమైన ఇబ్బందులు వచ్చుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, శుభకార్యక్రమములకు ముహూర్తములను నిర్ణయము చేసుకొనుట, శుభమూలక ధనవ్యయము ఏర్పడుట, అధికారుల సఖ్యత ఏర్పడుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గొప్పవారిని కలుసుకొనుట, సేవా కార్యక్రమాదులలో పాల్గొనుట, చాలాకాలంగా పూర్తికాని పనులు మిత్రుల ధన సహాయము వలన పూర్తియగుట, మానసిక ప్రశాంతత ఏర్పడుట, వివాదములను తొలగించుకొనుటకు, ప్రయత్నములు చేయుట, వాహనపరమైన అభివృద్ధి, బంధు సఖ్యత ఏర్పడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం స్థిరమైన అభిప్రాయముతో అధికారులు అప్పజెప్పిన పనులన్నింటినీ పూర్తి చేయుట, చరాస్తులను కొనుగోలు చేయుట, బంధుమిత్రుల తో కలసి దూరప్రాంత ప్రయాణములు చేయుట, శుభమూలక ధనవ్యయములు ఏర్పడుట, స్థానచలనములు ఏర్పడుట, గృహోపకరణములు కొనుగోలు చేయుట జరుగును.



# సింహ రాశి

LEO

ఆదాయం - 11
వ్యయం - 05
రాజ్యపూజ్యం - 06
అవమానం - 03

**మఖ 1,2,3,4, పుబ్బ 1,2,3,4, ఉత్తర 1వ పాదాలలో జన్మించినవారు.**
**మా,మి,ము,మే,మో,టా,టీ,టు,టే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**సింహరాశి వారి లక్షణములు :**

చెక్కిళ్ళు వెడల్పుగాను, కపిల వర్ణమైన నేత్రములు, కోల ముఖము, ఎముక బలము కలిగి ఉందురు. వీరికి ధైర్యం, సాహసం, పరాక్రమం స్థిరమైన బుద్ధి, దూసుకుపోయే చొరవ కలిగి, ఎంతటి సమస్యనైనా విశ్లేషించి అవగాహన చేసుకొని నిర్ణయాలు తీసుకోగల శక్తి సామర్థ్యాలు, మేధస్సు, జ్ఞాపకశక్తి, ఆకర్షణ శక్తి కలిగి ఉంటారు. టెక్నికల్ విద్యయందు అభిరుచి ఉండును. జీవితంలో ఎలాంటి క్లిష్ట పరిస్థితిలోనైనా ఎదుర్కోగలరు. రాశి చిహ్నమైన సింహానికి తగినట్లే వీరి ప్రవర్తన ఉంటుంది. నిష్కారణంగా కోపం తెచ్చుకుంటారు. క్రమశిక్షణ, ఆరోగ్యానికి, వ్యక్తిగత ప్రతిష్టకు ప్రాధాన్యత ఇస్తారు. గర్వం, ఆకలి దప్పులు ఎక్కువ. వీరు మౌన ప్రియులు. మానసిక, ఉదర దంతముల బాధలు కలుగుచుందును. ఎదుటి వారిని మెప్పించగల వాక్చాతుర్యంతో పదిమందిని ఆకర్షించి, వారిని శాసించి, చెప్పుచేతలలో నుంచుకొని తూచా తప్పకుండా వీరి అభిప్రాయాలను ఆచరించేలా చేయగల నాయకత్వ లక్షణాలు కలిగి ఉంటారు. స్వతహాగా ఎప్పుడూ కులాసాగా, ఉల్లాసంగా, హాస్యంగా ఉండే వీరు కొన్ని సందర్భాలలో ఒక్కసారి మాటలతో ఎదుటివారిని ఆదేశించగల కాఠిన్యం ఓడించగల నేర్పు ఉంటుంది. ఇతరుల బాధ్యతలు నెత్తిన వేసుకొని బాధపడుచుందురు. జీవనోపాధి మార్గములో దెబ్బలు తినుట, ఇతరులను భయపెట్టుట, పీడించుట వీరికి అలవాటు. అధికారులతో పొత్తు కుదురదు. ఇట్టివారు సామాన్యంగా చిన్నతనం నుండి తండ్రితోగానీ, జ్యేష్ఠ పుత్రునితోగాని విరోదం పెట్టుకొని విడిపోదురు. భారీ ఎత్తున వ్యాపార సంస్థలు నిర్వహింపగలరు. స్నేహమంటే ప్రాణమిచ్చే సన్నిహితులు, స్నేహితులు ఎక్కువ. కష్టాలలో ఉన్నవారికి చేయూతనిస్తారు. త్యాగ గుణములను, కళలలోనూ, నటనలో బాగా రాణిస్తారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. ఆహార విషయంలో నియంత్రణ చూపవలెను. బంధువుల వలన పరస్త్రీల వలన నష్టం కలుగుతుంది. స్త్రీల యందు మంచి ఇష్టత ఉంటుంది. స్త్రీలు తమ తల్లిదండ్రులకు భర్తకు తెలియని విషయములు చెప్పుదురు. అబ్బాయిలు ప్రేమ విషయంలో తొందరపాటు నిర్ణయాలు చేస్తారు. ప్రేమించటంలో వీరికెవ్వరూ సాటిరాలేరు. మఖా నక్షత్రంలో జన్మించిన వారికి భృత్యులు ధనము పరివారము ఉండును. భోగవంతులు, దేవపితృభక్తి గలవారు, ఉత్సాహవంతులు, పూర్వ ఫల్గుణి వారు ప్రియముగా మాట్లాడుదురు. దాతృత్వ గుణము, అందము, తిరుగుటయందాసక్తి ఉండును. రాజసేవ చేయుదురు. ఉత్తర ఫల్గుని (ఉత్తర) వారు సర్వజన ప్రియులు. విద్యా ప్రావీణ్యముతో ధనార్జన చేయుదురు. భోగవంతులు, సుఖవంతులు. వీరు అదృష్ట సంఖ్య 1,3,6,8,9, ఆది,మంగళ,శుక్ర, సోమ,శని వారములు కలిసి వచ్చును.

## సింహ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 1,2 స్థానములలో, శని 4,5 స్థానములో, రాహువు 1 వ స్థానములో, కేతువు 7 వ స్థానములలో ఉండుట వలన

శారీరక శ్రమ అధికమగుట, వైద్యసేవలు తప్పనిసరి అగుట, వైద్యపరంగా ధనవ్యయం అధికమగుట, మానసిక ప్రశాంతత లేకపోవుట, కుటుంబవ్యక్తుల వలన గౌరవ మర్యాదలు పెరుగుట, బంధువర్గంతో విభేదములు మెల్లగా తగ్గుముఖం పట్టుట, కోర్టు వ్యవహారములు సఫలీకృతమగుట, దూరప్రాంతప్రయాణములు లాభించుట, అధికారుల ఆగ్రహమును తగ్గించుటకు ధనవ్యయము చేయవలసి వచ్చుట, నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, అతినమ్మకంతో చేయుపనులలో కోలుకోని దెబ్బతినుట, గృహములో మార్పులు చేపట్టుట, విద్యార్థులకు శుభ ఫలితములు వచ్చుట, ఉద్యోగ ప్రయత్నములలో ధనవ్యయమగుట, స్థానమార్పులు ఏర్పడుట, వ్యవసాయ దారులకు రెండుపంటలూ లాభించుట, ప్రభుత్వ ధనము లభించుట, రాజకీయవర్గము వారికి మంచి గుర్తింపులు వచ్చుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు విష్ణు సహస్ర నామ పారాయణములు, విష్ణువుకు ప్రీతికరమైన పూజలు, తేనె, కర్పూరం, సాలగ్రామ, దేవతాప్రతిమల దానములు చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపరాదులలో మార్పులు ఏర్పడుట, కుటుంబవ్యక్తులతో, బంధుగణముతో ఉన్న విభేదములు తగ్గుముఖం పట్టుట, ఆర్థిక లావాదేవీల చర్చలు సఫలమగుట, స్థిరమైన నిర్ణయములు తీసుకొనుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బంధుమిత్రులను కలుసుకొనుట, శుభకార్యక్రమాలలో పాల్గొనుట, ముఖ్యమైన పనులు, కీలకమైన ఒప్పంద వ్యవహారములు ఫలించుట, ఉద్యోగాభివృద్ధితో పాటు పనిభారము కూడా అధిక మగుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక ప్రశాంతతకై విహారయాత్రలకు వెళ్లుట, స్థిరమైన నిర్ణయములు లాభించుట, ఉద్యోగాదులయందు అనుకూలత ఏర్పడుట, అధికారుల మన్ననలు పొందుట, నూతన వ్యక్తులతో మనసిక ప్రశాంతత దెబ్బతినుట, శుభకార్యక్రమ ప్రయత్నములు చేయుట, మిత్రుల సహకారము తీసుకొనుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పాత బకాయిలు వసూలగుట, ఆర్థికాభివృద్ధి ఏర్పడుట, గృహములో మార్పులు, పరనిందా దోషము వలన ఇబ్బంది పడవలసి వచ్చుట, మధ్యవర్తుల వలన సోదర వర్గ పోరు తగ్గుముఖం పట్టుట, చేయువృత్తివ్యాపారాదులలో నూతన పొత్తుదారులను చేర్చుకొనుట, శ్రమాధిక్యము వలన ఆరోగ్యభంగములు జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవిక కార్యక్రమాదులలో పాల్గొనుట, పనివారి మీద అసహనమేర్పడుట, స్వల్ప విషయములకే కోపోద్రిక్తముల వలన ఇబ్బందులు పడుట, పాత సమస్యలే మరలా తలెత్తుట, శాశ్వత పరిష్కారమునకై తీవ్ర ప్రయత్నములు చేసి సఫలమగుట, కీళ్ళ రుగ్మత ఏర్పడుట, వైద్య, ఔషధ సేవ తప్పనిసరియగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కీలక నిర్ణయములతో పరిస్థితులు మార్పు జరుగుట, శక్తికి మించిన పనులకై ధనవ్యయము అధికమగుట, పని ఒత్తిడి అధికమగుట, అతినమ్మకము ఇబ్బందులకు గురిచేయుట, అభివృద్ధి నిమిత్తమై ఋణ ప్రయత్నములు తప్పనిసరియగుట, సామూహిక కార్యక్రమాలలో పాల్గొనుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సమయానికి ధనము చేతికందుట, మానసిక ఒత్తిడిని, కోపాన్ని తగ్గించుకొనుటకు ప్రయత్నములు సాగించుట, కీలక విషయములలో లాభములు చేకూరుట, వృత్తివ్యాపారాదులలో ప్రారంభంలో అనుకూలత లేకపోయిననూ మాసంతములో లాభములు ఏర్పడుట, నూతన పరిచయములు జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శ్రమకు తగిన గుర్తింపు వచ్చుట, అసలైన మిత్రులను తెలుసుకుని పశ్చాత్తాప పడుట, ఆహార పరమైన ఇబ్బందులు వచ్చుట, పెద్దలతో కల వివాదములు, మనస్పర్థలు తగ్గుముఖం పట్టుట, శుభకార్యక్రమములలో ప్రముఖ పాత్ర వహించుట, పొత్తువ్యాపారాదులు మందకొడిగా ఉండుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తివ్యాపారాదులలో మార్పులు మెల్లమెల్లగా వచ్చుట, ఆర్థిక ఒడిదుడుకులు తగ్గుముఖం పట్టుట, అనవసరపు వాగ్దానాల వలన ధననష్టము వాటిల్లుట, శారీరక శ్రమ అధికమగుట, ఆదాయ వనరులు పెరిగినప్పటికీ గృహోపకరణముల కొనుగోలు, శుభమూలక ధనవ్యయములు అధికమగుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిద్రలేమితనములు ఏర్పడుట, విజ్ఞాన చర్చలలో పాల్గొనుట, నూతన ప్రయత్నములు, ఒప్పందాలు లాభించుట, దూర ప్రాంత ప్రయాణములు చేయుట, చిరకాల బంధుమిత్రులను కలుసుకొనుట, పండగ వాతావరణములో గడుపుట, విందువినోదాలకై ధనవ్యయం అధికమగుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శతృత్వ బాధలు తొలగించుకొనుటకై చేయు ప్రయత్నములు సఫలమగుట, మిత్రత్వములు పెరుగుట, ఆకస్మిక ధనలాభములు, అయాచిత సహకారములు లభించుట, శుభకార్యక్రమములు సఫలమగుట, కుటుంబ వ్యక్తుల వలన గౌరవ మర్యాదలు పెరుగుట, కొన్నినిర్ణయములు ఇబ్బంది పెట్టుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, దంతములకు సంబంధించిన ఇబ్బందులు వాటిల్లుట, కలివిడి తనముతో అందరినీ కలుపుకొని మంచి గౌరవమును సంపాదించుకొనుట, వృత్తివ్యాపారాదులలోని ఆటంకములు తగ్గుముఖం పట్టుట, ఆయాచిత బాధ్యతలు వచ్చుట, స్థానచలనములేర్పడుట జరుగును.



# కన్య రాశి
## VIRGO

| ఆదాయం - 14 |
|---|
| వ్యయం - 11 |
| రాజ్యపూజ్యం - 02 |
| అవమానం - 06 |

**ఉత్తర 2,3,4, హస్త 1,2,3,4, చిత్తా 1,2, పాదాలలో జన్మించినవారు.**

**టో,పా,పి,పూ,షం,ణ,ఠ,పె,పో, అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కన్యారాశి వారి లక్షణములు :**

తెల్లని శరీరకాంతి, శరీర ధారుఢ్యత, గుండ్రని ముఖము, పొడవు, పొట్టికాక మధ్యరకమైన మృదువైన స్త్రీ శరీరాకృతి కలిగి ప్రియముగా, అతి నెమ్మదిగా మాట్లాడుదురు. లజ్జగానూ, నెమ్మదిగాను, చూచుచు, నడచుదురు. దైవభక్తి కలిగియుందురు. శరీరాకృతి ఉండును. వీరికి దయాగుణం, దానగుణం ఎక్కువ. మేధా సంపన్నులు, నిజాయితీ, నమ్మకం కలుపుగోలుతనం, సానుకూల బాధ్యతాయుత ప్రవర్తన వాత్సల్యము, అభిమానము, వినయ విధేయతలు, బంధుప్రేమ వీరికి గౌరవం పొందే స్థితిలో వుంచుతాయి. నవ్వుతూ ఇతరులను నవ్వించగలరు. మాట సహాయము పొందుదురు. భార్యా బిడ్డలు, దాస దాసీ జనము, వీరిని అభిమానింతురు. జ్యోతిష్య గణిత విజ్ఞాన శాస్త్రము, నాట్యము, గానము, వాయిధ్యము, పుస్తక రచన, చిత్రలేఖనమందు నేర్పరులు. విజ్ఞానానికి సంబంధించిన రంగాలలోనూ మానసిక శ్రమతో కూడిన పరిశీలన, పరిశోధన, విశ్లేషణ వంటి వృత్తులలో స్వయం ప్రతిభ కలిగి బాగా రాణిస్తారు. ఆధ్యాత్మిక గురువులతో సన్నిహిత సంబంధాలు లభిస్తాయి. తల్లియందు ఎక్కువ అనురాగం కలిగియుందురు. మనస్సులోని గుట్టును రహస్యంగా ఉంచుకుంటారు. 24 సం॥రాల లోపుగాని 34 సం॥రాల తర్వాతగానీ వివాహం జరుగును. ఎక్కువకాలం ఇల్లు వదిలి, ఊరు వదిలి ఉండలేరు. గాఢమైన పరస్పరాపేక్ష యుండును. ఉత్తరోత్తర దాంపత్య జీవితం చక్కని అనురాగంతో కూడియుండును. సామాన్యంగా భార్య తరపు వారు మీయందు ధూర్తులై ఉందురు. వీరు పట్టినది బంగారమగును. జన సమ్మర్ధమున్నచో బిడియము, పెద్ద వారిని స్వయముగా కలుసు కొనుటకు సిగ్గు, సంకోచము కలుగును. సహాయము అపరిచిత వ్యక్తుల నుండి లభించుచుండును. అవకాశములు ఇసుక నుండి నూనె తీసినట్లు వచ్చుచుండును. భాగస్వామ్య వ్యాపారం లాభసాటిగా ఉంటుంది. వీరికి పేకాట, లాటరీలు లాభించును. పెద్దలు ఇచ్చిన ఆస్తులు అన్యాక్రాంతమయ్యే అవకాశం ఎక్కువ. స్త్రీలకు అనకువ మంచితనం గృహ కార్యకలాపములలో కూడా చక్కగా పాల్గొని ఇల్లు తీర్చకొనగల దక్షత ఉండును. ప్రణయ వివాహము జరుగు అవకాశమున్నది. ఉత్తర ఫల్గుణి నక్షత్రములో జన్మించిన వారు సర్వజన ప్రియులు, విద్య వలన ధనార్జన చేయువారు భోగవంతులు, సుఖవంతులు, హస్తవారు ఉత్సాహవంతులు, ప్రతిభ కలవారు, మధుపానాసక్తి కలవారు దయతక్కువ, చిత్త వారు చిత్ర వస్త్రములను చిత్రమాలికలను ధరింతురు. మంచి నేత్రములు అవయవ సౌష్టవము కలిగియుందురు. వీరి అదృష్ట సంఖ్య 1,3,5,6,7,9, ఆది, మంగళ, గురు, శుక్ర వారములు కలిసిన మరింత మేలు.

### కన్య రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 12,1 స్థానములలో, శని 3,4 స్థానములో, రాహువు 12 వ స్థానములో, కేతువు 6 వ స్థానములలో ఉండుట వలన

ఆదాయమును మించి ఖర్చులు అధికమగుట, బుద్ధిబలాన్ని పదునుపెట్టుట, మాటపట్టింపులు అధికమగుట, సోదరవర్గంతో ఇబ్బందులేర్పడుట, మానసిక ప్రశాంతత లేకపోవుట, ప్రతిపనియందు తానే అన్నట్లుగా వ్యవహరించుట, పెద్దల సహకారముతో స్థిరాస్తి వివాదములు తొలగుట, ప్రయాణములలో విలువైన వస్తువులను పోగొట్టుకొనుట, పండితులకు కళాకారులకు సత్కారములు లభించుట, స్త్రీమూలక లాభములు చేకూరుట, నిర్మాణ పనులకై తీవ్ర ప్రయత్నములు చేయుట, వ్యాపారంలో నూతన పెట్టుబడులు లాభములను ఇచ్చుట, విద్యార్థులకు విశేషమైన అభివృద్ధి ఏర్పడుట, దూరప్రాంత ప్రయాణములు సఫలమగుట, ఉద్యోగస్థులకు స్థానచలనములు వాయిదా పడుట, వ్యవసాయదారులకు పంటల యందు సమఫలితము కల్గుట, రాజకీయ వర్గం వారికి దూరప్రాంత ప్రయాణములు యోగించుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సుందరాకాండ, మన్యుకల్ప పారాయణములు, అరటి పండ్లు, గంధం, తమలపాకులు, అన్నదానములు, కోతులకు ఆహారమందించుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన అవకాశములు ఏర్పడుట, ఔషధసేవ తప్పనిసరియగుట, విరోధములను తగ్గించుకొనుటకు ప్రయత్నములు చేయుట, అనవసరపుమాటలు పడుట, ఉన్నత స్థాయి వ్యక్తులతో పరిచయములేర్పడుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రతి పనికీ మీరే అన్న విధంగా పనిచేయవలసి వచ్చుట, తోటి వారి సహకారము సమయానికి అందకపోవుట, మొండి బకాయిలు వసూలగుట, ఆర్థికపరంగా ఊరట చెందుట, నమ్మకద్రోహులు అధికమగుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దూరప్రాంత ప్రయాణముల వలన లాభములు ఏర్పడుట, ఋణబాధలు తగ్గుముఖం పట్టుట, స్థిరాస్తుల విషయాదులలో మాటపట్టింపులు వచ్చుట, స్త్రీమూలక వివాదములు అధికమగుట, గౌరవ మర్యాదలకు భంగము వాటిల్లుట, అధికారుల, పనుల ఒత్తిడి అధికమగుట, దైవదర్శనములు జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల మన్ననలు పొందుటకు ధనవ్యయము చేయవలసి వచ్చుట, అనవసర ఖర్చులు తగ్గించుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట, కుటుంబవ్యక్తులతో సమయము గడుపుట, ఇతరుల మన్ననలు పొందుటకు లాభాపేక్ష లేకుండా పనులు చేయుట, అయిననూ ఏదోరకంగా మాటపడుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, చేయు వృత్తివ్యాపారాదులలో మార్పులు ఏర్పడుట, పేరు ప్రతిష్ఠలు వృద్ధిచెందుట, కుటుంబ వ్యక్తులతో కలసి ఆనందమైన జీవనము గడుపుట, సమస్యలను తగ్గించుకొనుటకు ప్రయత్నములు సాగించుట, శుభవార్తలు వినుట, ధనవ్యయము అధికమగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆదాయముతో పాటు ఖర్చులు కూడా అధికమగుట, ఉన్నత అధికారుల మెప్పుకై ప్రయత్నించుట, శ్రమతో పనులు పూర్తియగుట, ఆశించిన పేరుతో పాటు తోటివారి ఈర్ష్యాసుయలు అధికమగుట, ఆధ్యాత్మిక కార్యక్రమాదులలో పాల్గొనుట, మధ్యవర్తిత్వములు ఇబ్బంది పెట్టుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గృహములో మార్పులు చేయుట, అయిష్ట స్థానమార్పులు ఏర్పడుట, ఉద్యోగాభివృద్ధికలిగిననూ మానసిక ఒత్తిడి తగ్గకపోవుట, పాతమిత్రులను కలుసుకొనుట, ఆడంబరములకై అధిక ధనవ్యయము చేయవలసి వచ్చుట, పరనిందల వలన ఇబ్బందులు పడవలసి వచ్చుట, దగ్గరి వారితో మోసములు  జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, మిత్రుల సహకారముతో పనులను పూర్తి చేయుట, నూతన అంశములు వాయిదా పడుట, మొండిబకాయిలు వసూలగుట, ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, సేవాకార్యక్రమాదులలో పాల్గొనుట, ప్రముఖులతో ప్రయణాదులు చేయుట, తగిన గుర్తింపులు వచ్చుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సంఘంలో గౌరవ మర్యాదలు వృద్ధిచెందుట, పొత్తువ్యాపారాదులలో లాభములు చేకూరుట, నరఘోష అధికమగుట, సంతానాదుల వలన ఆనందం పొందుట, ఆహార సంబంధ ఇబ్బందులు వాటిల్లుట, శుభకార్యక్రమాదులకు మధ్యవర్తిత్వం వహించుట, తద్వారా శ్రమాధిక్యము జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం స్థిరనిర్ణయములతో ఇతరులకు చెడ్డవారిగా తోచుట, విందువినోదాలకై ధనవ్యయము అధికమగుట, ఆదాయ వనరులు అభివృద్ధిచెందుటకు నూతన ప్రయత్నములు, చెడుకార్యక్రమములకు సహకారములు అందించుట, మానసిక ఒత్తిడిలను అధిగమించుట, స్వల్పవివాదములు ఏర్పడుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తుల వలన లాభములు ఏర్పడుట, గౌరవ మర్యాదలు వృద్ధిచెందుట, ప్రముఖుల మన్ననలు పొందుట, ఆర్థికాభివృద్ధి ఉన్ననూ అనవసర ఖర్చులు ఏర్పడుట, ఖర్చులను తగ్గించుటకు చేయుప్రయత్నములు సఫలమగుట, అకాల భోజనములు, నిద్రలేమితనముల వలన ఇబ్బందులు జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నరఘోష అధికమగుట, అనవసర పనులకై సమయము కేటాయించి చెడ్డపేరు తెచ్చుకొనుట, సమయానికి మిత్రుల సహకారముతో సానుకూలత ఏర్పడుట, తొందరపాటు తనముతో వస్తువులను పోగొట్టుకొనుట, కష్టము మీద లభించుట, వ్యాపారాభివృద్ధి, కుటుంబసఖ్యత, మిత్రుత్వ వృద్ధి ఏర్పడుట జరుగును.



# తులా రాశి

LIBRA

ఆదాయం - 11
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 05
అవమానం - 06

**చిత్తా 3,4, స్వాతి 1,2,3,4, విశాఖ 1,2,3 పాదాలలో జన్మించినవారు.**

**రా,రి,రూ,రే,రో,త,తీ,తూ,తే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**తులారాశి వారి లక్షణములు :**

వీరు మేధావంతులు, శుచిమంతులు, ధనవంతులు, క్రయ విక్రయమునందు నేర్పరులు, తిరుగుటయందు ఆసక్తిపరులు. వీరికి రెండుపేర్లుండును. స్నేహపాత్రులు, జాలి, దయ, మానవత్వం, ప్రేమ, మంచితనం లాంటి భావాలు ఎక్కువ. దేవతలను, బ్రాహ్మణులను, సాధువులను పూజింతురు. సినీ రంగమునందు, అధ్యాపకులుగానూ, వైద్య వృత్తియందున ప్రఖ్యాతిగాంతురు. ఉపకారము చేసిననూ బంధువులు వీరిని పరాభవిం తురు. మానసికంగాను, శారీరకంగానూ చురుకుగా ఉంటారు. నలుగురితో కలిసిపోయే తత్వము వలన ఎదుటివారు వీరిని అపార్థం చేసుకుంటారు. ఒకరి ముందు తలవంచి బ్రతకటం అంటే ఇష్టపడరు. ఎదుటి వారి స్వార్థపూరిత ఆలోచనలను హర్షించలేరు. తల్లిదండ్రులు, మిత్రులు వీరిని అర్థం చేసుకోలేరు. భాగస్వామ్య వ్యాపారం అన్ని వేళలా కలిసిరాదు. సమాజంలో ఉన్నత స్థానానికి ఎదగగలరు. వీరిని మెప్పించటం, వీరిచేత శభాష్ అనిపించుకోవడం తేలికకాదు. ఆకర్షణ,అందం, హుందాతనం వీరి సొంతం. ఆర్థిక క్రమశిక్షణ బాగా పాటిస్తారు. యవ్వనంలో అదృష్టం కలిసివస్తుంది. స్థిరాస్థి వృద్ధి విలువ పెరుగుతుంది. తరతరాలకు ఆదర్శంగా నిలుస్తారు. చంద్రగ్రహణ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. కుటుంబంలో అనైక్యత చికాకు కలిగిస్తుంది. భార్య మనసుకు అసంతృప్తి కలగకుండా ప్రవర్తింతురు. స్త్రీలకు గృహనిర్వాహణా దక్షత, అనేక లలితకళా నైపుణ్యం, చక్కని వస్తువులను సేకరించి భద్రపరచి వినియోగించుట, శుచి శుభ్రత హెచ్చు. పువ్వుల వంటి దుస్తులు, చక్కగా అమర్చిన తల్పము, తీర్చిన ఇల్లు, రుచ్యములైన వివిధ భక్ష్య భోజ్యములు ఇష్టము. లలిత కళలలో చక్కని అభిరుచి, నైపుణ్యముండును. భర్తకును బిడ్డలకు సుఖము చేకూర్చుట, మంచి పోషణ రక్షణ దక్షతయుండును. పాక విద్యలో ప్రత్యేక ప్రావీణ్యముండును. వీరి పెంపకమున పిల్లలు విద్యా, వివేక, వినయవంతులగుదురు. వివాహ సంబంధములు కుదుర్చుట, పెండ్లి పనులు సానుకూలముగా చేయుట యందు మీకు నైపుణ్యము, అభిలాష హెచ్చు. గుండ్రటి ముఖము తీరైన ముక్కు పొడవైన, ధృడమైన, అందమైన శరీరాకృతి కలిగియుందురు. చిత్తా నక్షత్రమున జన్మించిన వారు చిత్ర వస్త్రములు చిత్రమైన మాలలను ధరింతురు. మంచి నేత్రములు అవయవ సౌష్టవము కలిగియుందురు.స్వాతి వారు వినయము కలవారు. జితేంద్రియములు, వ్యాపార కుశలురు, దయగలవారు, ప్రియముగమాట్లాడుదురు. ధర్మమునందాసక్తికలిగి ఉందురు. విశాఖవారు ఈర్ష్య గలవారు, లోభత్వముండును. ప్రకాశవంతులు మాట్లడుటలోను ధనార్జనలోను సమర్థులు. విరోద స్వభావము కలిగియుందురు. పడమట, దక్షిణ దిక్కులు కలసివస్తాయి. వీరి అదృష్ట సంఖ్య 1,3,4,6,9, మంగళ, బుధ, శుక్రవారములు కలిసి వచ్చును.

## తుల రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 11,12 స్థానములలో, శని 2,3 స్థానములో, రాహువు 11 వ స్థానములో, కేతువు 5 వ స్థానములలో ఉండుట వలన

స్థిరచరాస్తుల విషయమందు వివాదములు అధికమగుట, అనుకోకుండా కోర్టు వ్యవహారాలలో చిక్కుకొనుట, ఋణబాధలు అధికమగుట, ఏపని చేసినా నష్టములే కల్గుట, వాగ్ధానాల వలన ఇతరుల ఇబ్బందులను నెత్తిమీద వేసుకొని తద్వారా కష్టములు పడవలసి వచ్చుట, ప్రయాణాదులలో ఇబ్బందు లేర్పడుట, వాహన భంగములేర్పడుట, ఆధ్యాత్మిక పరమైన గురువులను కలుసుకొనుట, ఇతరుల సహకారముతో స్థిరచరాస్తులు చేతికందుట, పాతమిత్రులను కలుసుకొనుట, స్త్రీమూలక ధనవ్యయములు అధికమగుట, నూతనవ్యాపారాదులు శ్రమచేత సఫలమగుట, నిలకడ లేకపోవుట, స్థానచలనములు అధికమగుట, వ్యర్థప్రయాణములు చేయవలసి వచ్చుట, విద్యార్థులు ఉత్తీర్ణతను కోల్పోవుట, అధికారుల బెడద అధికమగుట, పొత్తుదారులతో నష్టము వాటిల్లుట, రాజకీయ వర్గం వారికి ప్రజా వ్యతిరేఖత, అధికారమునకై అధికధనవ్యయము చేయుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గాసప్తశతీ పారాయణములు, సుదర్శన హవనములు, వెన్నదానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రయాణములు వాయిదా పడుట, పరుల కార్యక్రమాదులకై సమయము కేటాయించుట, మధ్యవర్తిత్వముల వలన నష్టపోవలసి వచ్చుట, వాత సంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట, శుభవార్తలు వినుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మాతృవంశమునుండి ఆకస్మిక లాభములు ఏర్పడుట, పొత్తుదారులతో చర్చలు సఫలమగుట, ఆర్థికంగా అనుకూలత ఉన్ననూ ఖర్చులు అధికమగుట, విమర్శలు ఎన్ని వచ్చిననూ సంకల్ప కార్యసిద్ధికై యత్నించుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబంలో చిన్నచిన్నవివాదములే చిలికిచిలికి గాలివానలా పెరుగుట, సొంతవ్యక్తులే బయటివారికి తొత్తులుగా మారుట, కీర్తిభంగములేర్పడుట, శుభమూలకంగా ప్రయత్నములు సానుకూల పడుట, ఎంత దూరంగాఉన్నా వివాదములలో చిక్కుకొనుట, సామరస్యధోరణి అవలంబించుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన లావాదేవీలు సఫలమగుట, ఋణబాధలు కొద్దిగా తగ్గుముఖం పట్టుట, ఆకస్మిక స్థానమార్పులు ఏర్పడుట, క్రయవిక్రయాదులలో స్వల్పలాభములు ఏర్పడుట, మానసిక శ్రమ, శారీరక శ్రమ అధికమగుట, ఆశించిన ఫలితములకై తీవ్ర ప్రయత్నములు సాగించుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తుల మధ్య వచ్చిన మనస్పర్థలు తగ్గుముఖం పట్టుట, అధికారుల సహకారములు లభించుట, ఆశించిన ఫలితములు కొంతమేర సఫలమగుట, వ్యాపారాదులలో కల స్తబ్దత తగ్గుముఖం పట్టుట, దీర్ఘకాలిక ఋణాదుల బెడద తొలగుట, నూతన ప్రయత్నములు సఫలమగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనులను ముందుగా పూర్తి చేయాలనే పట్టుదలతో తీవ్రముగా శ్రమించుట, అధికారుల మన్ననలు పొందుట, ఆగిపోయిన నిర్మాణ పనులు తిరిగి ప్రారంభమగుట, ఇతరులను నమ్మక అన్ని పనులకు ముందుండి చూసు కొనుట, ఇతరులఏడుపు అధికంగాఉండుట, కీలక నిర్ణయములు తీసుకొనుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం విందువినోదాలలో పాల్గొనుట, దైవసందర్శనములు చేయుట, అపూర్వ స్థలములకు వెళ్లుట, వంశమూలక ఆస్తి పై చర్చలు వాయిదా పడుట, వాతావరణ మార్పుల వలన అనారోగ్యములు వాటిల్లుట, ఔషధసేవ తప్పనిసరియగుట, తోటివారితో పోటీతత్వం పెరుగుట, మిత్రుల కలయిక జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సన్నిహితుల సహకారములు అధికంగా లభించుట, శక్తికి మించిన పనులకై నిర్ణయములు తీసుకొనుట, వ్యక్తిగత విమర్శల వలన ఇబ్బందులు వాటిల్లుట, వ్యాపారనిమిత్తమై ఋణప్రయత్నములు తప్పనిసరియగుట, నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, అధికారిక హోదా పెరుగుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వాహన ప్రయాణాదులలో తగుజాగ్రత్త అవసరముగుట, శారీరక రుగ్మతను తగ్గించుకొనుటకై చేయుప్రయత్నములు అప్రయత్నముగా సఫలమగుట, శుభకార్యక్రమాదులకై చర్చలు సాగించుట, చిరకాల బంధుమిత్రులను కలుసుకొనుట, స్త్రీ మూలకంగా వస్తు, ధనలాభములు ఏర్పడుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కీలక అంశములు వాయిదాపడుట, తోటివర్గం వారితో ఉన్న విభేదములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, వైవాహిక ప్రయత్నములు ఆశించినంత అనుకూలత లేకపోవుట, స్థిర చరాస్తుల విషయాలలో సోదర పరంగా ఇబ్బందులేర్పడుట, ఆర్థిక అభివృద్ధి ఉన్ననూ ఖర్చులు అధికమగుట, జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం తెలియకుండానే చెడుకార్యక్రమాదులకు సహకారమందించుట, సొంతవారిని దూరము చేసుకుని పరులను దగ్గరకు చేసుకొనుట, రహస్య విషయములు బయటవారికి తెలిసిపోవుట, సోదరవర్గ సహకారమును గుర్తించుట, బుద్ధికిపదునుపెట్టుట, తప్పిదములను సరిదిద్దుకొనుటకు ప్రయత్నములుచేయుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనవసర ప్రయాణములను తగ్గించుకొనుటకు ప్రయత్నములు చేయుట, దుబార ఖర్చులకు ఆనకట్ట వేయుట, శుభకార్యక్రమములకు రంగం సిద్ధమగుట, వివాదములు తగ్గుముఖం పట్టుట, మానసిక ప్రశాంతతకై ప్రశాంత స్థలములకు కుటుంబ వ్యక్తులతో కలసి వెళ్లుట, ఆడంబరములకై ధనవ్యయం జరుగును.



# వృశ్చిక రాశి

## SCORPIO

ఆదాయం - 02
వ్యయం - 08
రాజ్యపూజ్యం - 01
అవమానం - 02

**విశాఖ 4, అనురాధ 1,2,3,4, జ్యేష్ఠ 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.**

**తో, నా, నీ, ను, నే, నో, యా, యి, యు, అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**వృశ్చికరాశి వారి లక్షణములు :**

వీరికి మంచి కలుపుగోలుతనం, దయ, ప్రేమాభిమానాలు, నిజాయితీ, ధైర్యము, నేర్పరితనం, ఓర్పు ఎక్కువ. మానసిక శక్తిని మానవాతీత శక్తులపై కేంద్రీకరించి మంచి ప్రగతిని సాధిస్తారు. బలమైన శరీర ధారుఢ్యము, విశాల నేత్రములు, వక్ష స్థలము, వర్తులమైన పిక్కలు, తొడలు, మోకాళ్ళు కలిగియుందురు. రాజవంశములచే పూజింపబడుదురు. పింగళ వర్ణముతో విషయ స్వభావముతో నుందురు. మత్స్యరేఖ, ఆయుష్య రేఖ, పక్షి రేఖలు కలిగియుందురు. తల్లిదండ్రుల, గురువుల యెడల గౌరవం కలిగి ఉంటారు. తల్లిదండ్రులు వీరిలోని భయము, రహస్య గోపనములను గుర్తించి, మంచి వారితోగాని, హోదాగల వారితో గాని నిమగ్నులను చేసిన చక్కని ధైర్యం, స్వతంత్ర ప్రవృత్తి, విద్యాబుద్ధులు అలవడి చాలా గొప్పవారగుదురు. నిత్య నూతన ఆలోచనలతో ఏ రంగంలోనైనా రాణిస్తారు. ఆటలయందు నాటకములందు, శస్త్ర విద్యయందు అభిరుచి ఎక్కువ. రహస్య విషయములు బయట పెట్టరు. భూమి, వాహన, యంత్ర సంబంధిత వ్యవహారాలు కలిసివస్తాయి. గర్వమెక్కువ, నిశ్చితాభిప్రాయములను నిర్మొహమాటముగా వెల్లడిస్తారు. డాక్టర్స్‌గా, సర్జన్స్‌గా ఉన్నవారు మంచి హస్త వాసి కలిగి రాణిస్తారు. మంచి వాక్ చాతుర్యంతో ఎదుటివారిని ఆకర్షిస్తారు. కోపం ఎక్కువ గట్టిగా మాట్లాడుదురు. కక్ష సాధించే పట్టుదల ఉండును. మితిమీరిన అలవాట్లు ఉంటాయి. కష్టం, కన్నీళ్ళు ఆవేదన వ్యక్తం చేసి కొంతమంది వీరిని మోసగిస్తారు. ఇతరులను హేళన చేయు స్వభావముండును. సలహాలు ఇవ్వటంలో నేర్పరులు. సమస్యా పరిష్కారమునకు ఏ పనినైనను, సమర్థవంతముగా చేస్తారు. ఇద్దరు విభిన్న వ్యక్తుల వంటి ప్రవర్తనమును వీరు వేర్వేరు రంగాలలో జీవితాంతము నిర్వహింపగలరు. భూ వసతి కల్గియుందురు. స్త్రీలతో బంధువులతో వైరం, పరోక్ష శత్రుత్వం కలిసిరావు,స్త్రీలు – శిశు పోషణ, గృహ నిర్వహణ నైపుణ్యం, సామర్థ్యము కలిగి ఉందురు. భర్తలకన్నా భార్యలు చాలా మంచివారు, భర్తయందు, పిల్లలయందు ప్రేమాభిమానాలు, పోషణ నిర్వహణ సామర్థ్యము కల్గియుందురు. ప్రేమలో మోసం చేయగల సాహసులు, బహు తత్వముండును. విశాఖ నక్షత్రంలో జన్మించినవారు. ఈర్ష్యా, లోభత్వము కలవారు, ప్రకాశవంతులు, ధనార్జన యందు నిపుణులు, కలహప్రియులు, అనురాధవారు, సమర్థులు విదేశ నివాసమందు ప్రీతి గలవారు.ఆకలిని ఓర్చుకొనలేరు. తిరుగుటయందాసక్తి కలిగియుందురు. జ్యేష్ఠవారు స్వల్ప మిత్రులు కలిగి సంతోష స్వభావం, ధర్మ కార్యాచరణయందాసక్తి అతి కోపము కలిగియుందురు. వీరి అదృష్ట సంఖ్య 1,2,4,6,8,9, బుధ, గురు, శుక్ర, శని వారములు కలసిన మరింత మేలు.

## వృశ్చిక రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 10,11 స్థానములలో, శని 1,2 స్థానములో, రాహువు 10 వ స్థానములో, కేతువు 4 వ స్థానములలో ఉండుట వలన

స్త్రీమూలకముగా ఆకస్మిక ధనలాభములేర్పడుట, నిర్మాణాది పనులకై వచ్చిన ధనము చాలక అధికంగా ఋణప్రయత్నములు చేయుట, ప్రతిపనియందు ఆలస్యములు జరుగుట, తోటివారి సహాయం తప్పనిసరియగుట, ముఖ్యమైన అంశములయందు నిర్ణయలోపము జరుగుట, స్వపక్షవిరోధములు, చెడుపనులకు సహకరించుట, వైవాహిక ప్రయత్నములు ఇబ్బంది పెట్టుట, వ్యర్థప్రయాణములు, వ్యర్థ విషయములకై సమయమును కేటాయించుట, శారీరక శ్రమ అధికమగుట, ఆడంబరాలకై ఋణముచేసి మరీ కొనుగోలుచేయుట, విద్యార్థులకు అధిక శ్రమచేత ఉత్తీర్ణులగుట, వ్యవసాయదారులకు పంటమార్పిడిలతో లాభములు చేకూరుట, ఉద్యోగస్థులు సమయానికి పనులు పూర్తి చేయలేక అధికార వర్గంతో మాటలు పడుట, రాజకీయవర్గం వారికి స్త్రీమూలక ఇబ్బందులేర్పడుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దైవకళ్యాణములను, పాశుపత అభిషేకములను, ముత్తైదువ సామాగ్రి, గుమ్మడిపండ్లను, పసుపురంగు వస్త్రములను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులకు దూరంగా ఉండవలసి వచ్చుట, ఒంటరి ప్రయాణములు చేయవలసి వచ్చుట, శుభకార్యక్రమములు వాయిదా పడుట, నూతన ఒప్పందములు లాభించుట, వ్యాపారాలలో మార్పులు జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సరియైన సమయములో నిర్ణయములు తీసుకోకపోవడము వలన పనులు చేజారిపోవుట, చేయు వృత్తివ్యాపారాదుల యందు ఆసక్తి లేకపోవుట, నిర్లక్ష్యధోరణి అధికమగుట, ఋణభారములు అధికమగుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికపరంగా ఇబ్బందులు అధికంగా ఉండుట, ఋణభారములు అధికమగుట, మిత్రులతో సమన్వయము కుదరకపోవుట, తద్వారా లావాదేవిలు మందకొడిగా సాగుట, రహస్యమైన విషయములు బయటివారికి తెలిసిపోవుట, మానసిక ఒత్తిడి అధికమగుట, అనుకూల ప్రతికూలములు జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఋణబాధావిముక్తికై తీవ్ర ప్రయత్నములు చేయిట, ఇతరుల వివాదములలో తలదూర్చి అనవసరముగా మానసిక స్పర్ధలు కొని తెచ్చుకొనుట, పొత్తుదారులతో చర్చలు కొలిక్కివచ్చుట, వ్యాపారాభివృద్ధికై ప్రయత్నములు సుగమము చేసుకొనుట, దుబారా ఖర్చులను తగ్గించుటకై ప్రయత్నించుట జరుగును.

**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన ప్రయత్నములు సఫలమగుట, కుటుంబ వ్యక్తులకై ధనవ్యయము అధికమగుట, శత్రువర్గపోరులను తగ్గించుటకై ప్రయత్నము లు సాగించుట, శుభకార్యక్రము ప్రయత్నములు మందకొడిగా సాగుట, ఇతరుల మన్ననలు పొందుటకు తీవ్ర ప్రయత్నములు చేయుట, మానసిక స్వస్థత చేకూరుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనులను సక్రమంగా పూర్తిచేసిననూ అధికారుల బెడదలు తగ్గకపోవుట, ఆత్మన్యూనతాభావము ఏర్పడుట, మీ మీద మీకే అసహనము ఏర్పడుట, కుటుంబ వ్యక్తులకు ప్రాధాన్యత ఇచ్చుట, తేలిక పనులకు కూడా అతిగా శ్రమించవలసి వచ్చుట, అనవసరపు నిందలు అధికమగుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల మన్ననలకై వేరువేరు ప్రయత్నములు చేయుట, గృహముయందు మార్పులు ఏర్పడుట, అనవసర విషయములకై సమయము వెచ్చించుట, ప్రతిపనికి పదింతలు కష్టపడవలసి వచ్చుట, ఇతరుల సహకారముతో మెల్లమెల్లగా సానుకూలత ఏర్పడుట, ఋణబాధలు కొద్దిగా తగ్గుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిర్మాణాది శుభకార్యక్రమములో బాధ్యతను తీసుకొనుట, ఇతరుల విషయాలలో జోక్యం వలన స్పర్ధలు అధికమగుట, తోటివారి చెడగొట్టుపనులు అధికమగుట, శుభకార్యక్రమ ప్రయత్నములు ఎదోరకంగా ఆటంకములతో ఆగిపోవలసి వచ్చుట, మానసిక ఒత్తిడి అధికమగుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రతిపనియందు స్థిరమైన నిర్ణయము తీసుకోలేకపోవుట, ప్రతిచిన్న విషయానికి ఇతరులపై ఆధారపడవలసివచ్చుట, వైద్యసేవ తప్పనిసరి అగుట, పాతమిత్రులను కలుసుకొనుట, మిత్రుల సహకారముతో మొండి పనులు మెల్లమెల్లగా పూర్తియగుట, అహంభావము వలన చెడ్డ పేరు వచ్చుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సోదరవర్గం వారితో ఉన్నటువంటి ఇబ్బందులు తగ్గుముఖం పట్టుట, ఋణబాధ విముక్తికై చేయు ప్రయత్నములు సఫలమగుట, తెలియకుండానే చెడు కార్యక్రమాదులలో పాల్గొనుట, బంధుమిత్రులతో కలసి దూర ప్రయాణములు చేయుట, అనవసరమైన విషయాలకు ఖర్చులు అధికమగుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వైవాహికాది శుభ ప్రయత్నములు మధ్యవర్తుల వలన సఫలమగుట, అనవసరపు వాగానాల వలన ఆపదలు కొనితెచ్చుకొనుట, స్థానమార్పులు అధికమగుట, శుభమూలక ధనవ్యయములు అధికమగుట, నూతన బాధ్యతలు నెత్తిమీద పడుట, శారీరర శ్రమ అధికమగుట, ఆరోగ్య భంగములు జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బంధుమిత్రులతో కలసి సామరస్య ధోరణితో ముందుకు వెళ్లుట, శత్రుబాధలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, దైవానుగ్రహమువలన చేయువృత్తి వ్యాపారాదులయందు సానుకూల వాతావరణములు ఏర్పడుట, శారీరక శ్రమ, అకాల భోజనములు, నిద్రలేమితనముల వలన ఔషధసేవ తప్పనిసరి అగుట జరుగును.



# ధనస్సు రాశి

## SAGITTARIUS

ఆదాయం - 05
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 04
అవమానం - 02

మూల 1,2,3,4, పూ॥షా॥ 1,2,3,4, ఉ॥షా॥ 1వ పాదాలలో జన్మించినవారు.
యె,యో,బా,బి,బు,ధా,భా,ఢా,బే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు

**ధనుస్సురాశి వారి లక్షణములు :**

వీరు ఏకాగ్రత, పట్టుదల, అభిమానము, కార్యసాధన, దీక్ష, త్యాగ, ధర్మ గుణములను కలిగి ఉంటారు. ప్రతిభావంతులై ప్రతి విషయాన్ని అర్థం చేసుకొని బాగా మాట్లాడగలరు. విద్యాభిమానులు, తీర్థయాత్రలు, సంగీత, సాహిత్యములందు మతపరమైన విషయములందు ఆసక్తి చూపిస్తారు. లౌక్యులు, లెక్కలు వేయువారు, ప్రజలతో సంబంధ బాంధవ్యములు కలిగి లిపి, పుస్తక లేఖన, విజ్ఞానములు, వ్యాయామములు, తాలింఖానా, సర్కసు మున్నగు వినోద విద్యలు కలిగి బోధన, న్యాయవృత్తులు, రేడియో మున్నగు వానిలో ప్రకటనోపన్యాస వృత్తులు, బ్యాంకు ఇన్సూరెన్స్, ట్రెజరీ వృత్తులు అనుకూలం. నీతి నిజాయితీ కలిగి, నిక్కచ్చిగా మాట్లాడే స్వభావం వలన శత్రువర్గం పెరుగుతుంది. వీరు నిర్లక్ష్యం చేసినవారు సమస్యలు సృష్టించి కుట్రలు చేయుట వలన ఆదాయమునకు విఘాతములు కలుగును. ఆహార సౌఖ్యమునకు మిత్రులకు, గొప్పకు ధనవ్యయముండును. నూతన పనులు ప్రారంభించి మధ్యలో నిలిపివేస్తారు. భాగసామ్యం బాగా కలిసివస్తుంది. వాహనయోగం ముండును. జీవితంలో అత్యున్నత పదవులను అందుకుంటారు. వీరి తండ్రి ధనవంతుడు, 21,26,30 సం॥ముల వయస్సులో తొందరపాటుతనముతో మాటజారి దానికి కట్టుబడ వలసి వచ్చుట, లౌక్యమెరిగిన వ్యక్తితో వీరికి దాంపత్యముండును. సంగీత, చిత్ర లేఖనము, కుట్లు, అల్లికలలో ప్రావీణ్యము, గృహాలంకరణ పై ఇష్టత ఉండును. దాంపత్యమున చిన్న చిన్న విఘాతములు ఉండును. నడి వయస్సులో ఖర్చులు పెరుగుట వలన ఆర్థిక ఇబ్బందులు పెరుగును. గుఱ్రపు పందాలు, షేర్లు, గుర్తులు గల వ్యక్తులు సంస్థలు అనుకూలించును. పిల్లలు చురుకుదనం కలిగి సాంఘికం, విద్యా సంబంధముల యందు ఉన్నత స్థితి పొందుదురు. యంత్ర వాహన శాఖలలో పనిచేయుదురు. నడి వయస్సులో బరువు బాధ్యతలు పెరుగును. సూర్యగ్రహణ సమయాలలో మరిచిపోలేని సంఘటనలు జరుగును. 39,48,57 సం॥రములలో స్థానచలనము జరుగును. 45,54,63 సం॥రములలో మారక సంబంధములు కలవు. ఒక వ్యక్తితో ఎక్కువ కాలము స్నేహపూర్వకంగా స్థిరమైన ఆలోచనలతో ఉండుట కష్టము. ఎంత మందిని ప్రేమిస్తే అంత గొప్ప అనుకునే తత్వం గలవారు. స్వేచ్ఛా తత్వాన్ని ఇష్టపడేవారు. మూలా నక్షత్రమున జన్మించినవారు మానవంతులు, సుఖవంతులు, సౌమ్యులు, స్థిర చిత్తులు, గర్వం కలవారు, స్థిరమైన మిత్రులు లేనివారై ఉందురు. పూర్వాషాఢ నక్షత్రం వారు వారి ఇష్టమునకు తగ్గట్టుగా నడుచుకునేవారిని ప్రేమించెదరు. భోగవంతులు, మిత్రుల వలన మోసపోవుదురు. ఉత్తరాషాఢ నక్షత్రం వారు వినయమును కలిగి సర్వజనులకు ప్రియమైనవారు అనేకమంది మిత్రులు కలిగినవారు అవుదురు. వీరి అదృష్ట సంఖ్య 1,3,5,6,9 ఆది, గురు, బుధ, శనివారములు అత్యంత శుభదాయకము.

## ధనస్సు రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 9,10 స్థానములలో, శని 12,1 స్థానములో, రాహువు 9 వ స్థానములో, కేతువు 3 వ స్థానములలో ఉండుట వలన

సంతానాదుల అభివృద్ధికై విద్యావిషయాదులకై ధనవ్యయం అధికమగుట, బంధువర్గంతో పొత్తులు ఏర్పాటుచేసుకుని నూతన వ్యాపారములు ప్రారంభించుట తద్వారా శుభములను, అభివృద్ధిని పొందుట, చాలాకాలంగా ఇబ్బంది పెడుతున్న సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, వివాద విషయములను, వివాద వ్యక్తులను దూరము చేసుకుని మానసిక ప్రశాంతతను పొందుట, స్వపక్షంలోనే విమర్శలు వ్యతిరేఖమాటలు వచ్చిననూ వాటన్నింటినీ ధైర్యముతో ఎదుర్కొనుట, అకాల ప్రయాణములు, నిద్రలేమి తనము వలన ఆరోగ్యభంగములేర్పడుట, శారీరక శ్రమను తగ్గించుకొనుటకు ఇతరుల సహకారము తీసుకొనుట, శ్వాస, ఎముకలకు సంబంధమైన ఇబ్బందులు వచ్చుట, వైద్యుల సహకారముతో సానుకూలత ఏర్పడుట, విద్యార్థులకు సమస్థాయి ఫలితములు వచ్చుట, ఉద్యోగస్థులకు అభివృద్ధి విషయములో ఆలస్యము జరుగుట, వ్యాపారస్థులకు లాభములున్ననూ ఖర్చులు అధికమగుట, రాజకీయ వర్గం వారికి ధనలాభములేర్పడుట, ప్రజావ్యతిరేఖత అధికమగుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సూర్యనమస్కారములు, అరుణహోమములు, ఎరుపు వస్త్రములను దానము చేయుట, మందారపుష్పములను పెంచుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శారీరక శ్రమ అధికమగుట, చేయు వృత్తివ్యాపారాదులయందు, పనివారియందు అసహనము ఏర్పడుట, అధికారుల ఒత్తిడిలు అధికమగుట, ఏ పని చేయాలన్న పదింతలు కష్టపడవలసి వచ్చుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఉహించనిరీతిలో ఖర్చులు అధికమగుట, గౌరవ మర్యాదలకు భంగము వాటిల్లుట, శత్రువుల విమర్శలు అధికమగుట, ఒప్పంద వ్యవహారములలో విభేదములు అధికమగుట, మానసిక వేదన అధికమగుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వాహన ప్రయాణాదులలో ఇబ్బందులు వాటిల్లుట, చేయువృత్తి వ్యాపారాదులలో స్వల్ప అభివృద్ధి ఏర్పడుట, ఆకస్మిక ధనలాభము ఏర్పడుట, అంతకుమించిన ఖర్చులు ఉండుట, స్వల్ప విషయములకే కోపతాపములు అధికమగుట, శుభ ప్రయత్నములు ఇతరుల సహకారముతో ప్రారంభించుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సంకల్ప కార్యసిద్ధికై తీవ్రముగా శ్రమించుట, ఋణబాధలు అధికమగుట, ముఖ్యమైన విషయాదులలో కుటుంబవ్యక్తుల సలహాలు తీసుకొనుట, అనుకోని విషయాలలో మాటపట్టింపులు వచ్చుట, దగ్గరివారిని దూరము చేసుకొనుట, మరల పశ్చాత్తాప పడుట, మానసిక ఒత్తిడి ఏర్పడుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు స్థానచలనములు ఏర్పడుట, పొత్తుదారులతో చర్చలు వాయిదాపడుట, దూరప్రాంత వ్యక్తులను కలుసుకొనుట, విందువినోదాలలో బంధుమిత్రులతో కలసి పాల్గొనుట, కీలక అంశములు వాయిదాపడుతూ ఎట్టకేలకు పూర్తియగుట, అనుకోని మార్పులు జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఋణబాధలు అధికమగుట, ఆస్తినష్టములు వాటిల్లుట, వాహన కొనుగోళ్ళకై ఆలోచించుట, ఒంటరి జీవనము అధికమగుట, గృహమునకు దూరంగా ఉండవలసి వచ్చుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సానుకూలం గా ఉండుట, సన్నిహితుల పరపతితో అభివృద్ధిని పొందుటకై యత్నించుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం స్త్రీమూలక ధనవ్యయములు అధికమగుట, ఎంత ఆలోచించిన ఖర్చులు తగ్గకపోవుట, తోటివారితో పోటీతత్వము అధికమగుట, పోటీతత్వమును తట్టుకొనుటకు విశేషప్రయత్నములు చేయవలసి వచ్చుట, ఇతరులు మీకిచ్చిన హామీలను నెరవేర్చుట, వైరాగ్యభావనలు అప్పుడప్పుడు తలెత్తుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చిన్నవిషయాలకే కుటుంబములో కలతలు ఏర్పడుట, సంబంధంలేని విషయాదులలో తలదూర్చి వివాదాలపాలగుట, సంతానాదుల ఉన్నత అభివృద్ధికై అధికముగా ధనవ్యయము చేయవలసి వచ్చుట, శారీరక శ్రమ అధికమగుట, బంధువుల సహకారము సమయానికి అందుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రయాణాదులలో ఇబ్బందులు ఏర్పడుట, తొందరపాటు తనమువలన వస్తువులను చేజార్చుకొనుట, శత్రువుల నిందలు అధికమగుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, సంతానాదుల వలన గౌరవమర్యాదలు పెరుగుట, శుభ ప్రయత్నములు ప్రారంభించుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కీలకమైన విషయాదులు వాయిదాపడుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, స్త్రీమూలక సహకారముల వలన ఋణ ప్రయత్నములు సఫలమగుట, సమయానికి ధనము చేతికందుట, మానసిక ఒత్తిడి మెల్లమెల్లగా తగ్గుట, సర్దుకుపోయే తత్వం ఆలవర్చుకోవలసి వచ్చుట, క్రయవిక్రయాలు చేయుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చెడుకార్యకలాపాలకై సమయము వెచ్చించి ధననష్టం పొందుట, కుటుంబవ్యక్తుల సహకారముతో సానుకూలించుట, పోటీతత్వములు అధికమగుట, తట్టుకొనుటకు నూతన ప్రణాళికలు సిద్ధం చేసుకొనుట, నూతన ప్రయత్నము లు సఫలమగుట, చేయు వృత్తివ్యాపారాదులయందు స్థానమార్పులు ఏర్పడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అహంభావాన్ని వీడి ఇతరులను గొప్పగా చేసి మాట్లాడి ధనమును అందుకొనుట, శత్రుత్వబాధలు తగ్గుముఖం పట్టుట, అనవసర ప్రయాణములతో కాలయాపన చేయుట, మిత్రుల నుండి శుభవార్తలు వినుట, నూతన వ్యాపారాదులయందు, పెట్టుబడులయందు లాభములు చేకూరుట జరుగును.



# మకర రాశి
## CAPRICORN

ఆదాయం - 08
వ్యయం - 08
రాజ్యపూజ్యం - 07
అవమానం - 02

**ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం 1,2,3,4, ధనిష్ఠ 1,2 పాదాలలో జన్మించినవారు.**
**బో,జా,జి,జూ,జె,జో,ఖ,గా,గీ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మకరరాశి వారి లక్షణములు :**

వీరి ముఖ కవళికలు, ఆకర్షణీయముగా ఉన్నప్పటికీ ఎప్పుడూ కోపంగా కన్పిస్తారు. ఆనందంగా ఉండాలన్నా ఉండలేరు, చిరునవ్వు కూడా కనబడదు. ఎవరైన వీరిలోని జింకపిల్లవంటి ఆకర్షనల వలన ముచ్చటపడి ఏ పనినైనా చేసిపెడతారు. వీరికి జాగ్రత్త, గట్టిపట్టు, సూక్ష్మ పరిశీలన, బుద్ధి కుశలత, ఓర్పు, యుక్తి కలిగి ఇష్టమైన విషయాలలో మనస్సుకు నచ్చినట్లుగా ప్రవర్తిస్తారు. తమ తప్పును దాచి, ఎదుటివారిని నిందించుట, ఏ విషయంలోనైనా మొసలి పట్టు పట్టుట మంచి పద్ధతి కాదు. దైవ భక్తి, పూనకాలు వచ్చుట, దయ్యము, గాలి పట్టుట జరుగును. బాల్యమున బాలారిష్ట దోషములు, అనారోగ్య చికాకులు ఉండును. స్థిర ఆస్థి, ఇల్లు, భూ వసతి, గనులు, లాటరీలు, వ్యవసాయం, పల్లె జీవితంలో ఎక్కువ సుఖముండును. చిన్నతనమున తల్లిదండ్రులలో ఒకరికి తీవ్రమైన అనారోగ్యం స్థితి గతులు చెడుట, వారితో విరోదములు, స్థల మార్పులు, ఇబ్బందులు కలుగును. చేరువైన వారి పట్ల ఆప్యాయంగా ఉంటారు. కుటుంబాన్ని నిర్లక్ష్యం చేయరు. డబ్బును సక్రమంగా సద్వినియోగం చేస్తారు. మార్పులేని వృత్తులలో ఉద్యోగాలలో కలిసి వస్తుంది. వ్యాపారంలో బాగా రాణిస్తారు. రైల్వే ఉద్యోగాలలో కాంట్రాక్టర్లుగాను, మిలటరీలోను స్థిరపడతారు. అధికారులకు నమ్మకస్తులై ఉంటారు. ప్రోత్సాహం లేకపోతే నేర్పరితనాన్ని ప్రదర్శిస్తారు. వివాహం యాదృచ్ఛికంగా జరుగును. ఇతర సదుపాయములు, లాభాదులు, వినియోగ దృష్టిని అనుసరించి వివాహం చేసుకొందురు. స్త్రీలకు పురుషులపై వారి ప్రవర్తనపై సందేహములుండును. ఈ మానసిక లక్షణం వలన జీవితంలో వీరు సుఖపడలేరు. స్త్రీలుగాని, పురుషులు గాని వివాహం ఆలస్యంగా చేసుకొందురు. చురుకైన, ఉత్సాహవంతమైన వ్యక్తితో దాంపత్యముండును. పిల్లలు తెలివి కలిగి రాణింతురు. స్త్రీలకు దాంపత్య జీవనమున ఆధిక్యము కలుగుతున్న కొలది పట్టుదలలు విద్వేశములు పెరుగును. నడి వయస్సు తరువాత ఆర్థిక సుఖం పెరుగును. స్త్రీ సంతానం పట్ల ప్రత్యేక అభిమానము ఉండును. చాలా మందికి తండ్రి వలన ఆశించిన మేలు జరుగదు. చంద్ర గ్రహణ సమయాలలో జాగ్రత్తలు అవసరం. ఉత్తరాషాఢ నక్షత్రంయందు జన్మించినవారు వినయం కలిగి సర్వ జనులకు ప్రియమైన వారై అనేక మంది మిత్రులను కలిగి ఉపకార ప్రత్యుప కారాలు చేయుదురు. శ్రవణా నక్షత్రం వారు అన్ని విషయములు తెలిసినవారై ఉదారమైన భార్య కలవారు, ధనవంతులు, శ్రీమంతులు, ప్రఖ్యాతి చెందినవారగుదురు. ధనిష్టా నక్షత్రం వారు, దానశీలురు, సమర్థులు, శూరులు, గానప్రియులు. వీరిఅదృష్ట సంఖ్యలు 1,3,6,7,9, సోమ, బుధ, గురు, శుక్ర వారములు కలసిన మరింత మేలు.

## మకర రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 8,9 స్థానములలో, శని 11,12 స్థానములో, రాహువు 8 వ స్థానములో, కేతువు 2 వ స్థానములలో ఉండుట వలన

గృహమునందు శుభకార్యక్రమాదుల వలన ధనవ్యయమధికమగుట, గౌరవ మర్యాదలు పెరుగుట, సోదర వర్గం వారినుండి చెడువార్తలు వినవలసి వచ్చుట, పుణ్య కార్యక్రమాదుల యందు పాల్గొనుట, శారీరక శ్రమ అధికమగుట వలన ఆరోగ్యభంగములేర్పడుట, వైద్యనిమిత్తమై ధనవ్యయమేర్పడుట, స్థిరచరాస్తులు అభివృద్ధిచెందుట, మధ్యవర్తిత్వ పనుల వలన గౌరవ భంగములేర్పడుట, స్థానచలనములేర్పడుట, ఇతరుల మెప్పులకై ఆడంబరాలను ఏర్పాటు చేయవలసి వచ్చుట, పాతమిత్రులను కలుసుకొనుట, నూతన వ్యాపార ప్రయత్నములు మధ్యలో ఆగిపోవుట, చేయు వృత్తివ్యాపారాదులయందు ఆకస్మిక స్థానచలనముల వలన వస్తు నష్టములేర్పడుట, విద్యార్థులకు ఎంతశ్రమించిననూ సత్ఫలితములు రాకపోవుట, వ్యవసాయదారులకు సమస్థాయి ఫలితములు ఏర్పడుట, ఉద్యోగస్తులకు అధికారుల మన్ననలు ఉన్ననూ ఆర్థికాభివృద్ధి లేకపోవుట, వ్యాపారస్తులకు పొత్తువ్యాపారాదులలో ఇబ్బందులేర్పడుట, రాజకీయ వర్గం వారికి శతృత్వ బాధలు అధికమగుట, నిందలను తొలగించుకొనుటకు ధనవ్యయం చేయవలసి వచ్చుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గాఆరాధనలు, శ్రీచక్ర నవావరణార్చనలు, పప్పుదినుసులు, భోజన సామాగ్రి దానం చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చాలాకాలంగా ఇబ్బందులు పడుతున్న సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, కుటుంబ వ్యక్తుల సహకారము లభించుట, పొత్తుదారులతో సఖ్యత లేకపోవుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఉద్యోగాభివృద్ధి ఏర్పడుట, చెడుకార్యక్రమముల కు సహకారమందించుట, తప్పిదాన్ని తెలుసుకొనుట, శుభకార్యక్రమాదుల నిమిత్తమై ధనవ్యయములు అధికమగుట, ప్రముఖుల దగ్గర మీ ప్రస్తావనలు వచ్చుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికపరంగా ఒడిదుడుకులు ఉన్ననూ మానసిక ప్రశాంతత ఏర్పడుట, నిర్మాణాదిపనులకై ప్రయత్నములు సాగించుట, శ్రమ అధికమైననూ శుభప్రయత్నములు సాగించుట, అయాచిత ఋణములు ప్రాప్తించుట, పనులు వాయిదా లేకుండా పూర్తియగుట, క్రిందివారికి యమునివలే కన్పించుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవ ప్రదమైన బాధ్యతలను స్వీకరించుట, సంఘంలో గౌరవమర్యాదలు పెరుగుట, ప్రతిచిన్న విషయానికి కుటుంబవ్యక్తులకు ముఖ్యమైన ప్రాధాన్యత ఇచ్చుట, అధికారుల మన్ననలు ఉన్ననూ ఆర్థిక అభివృద్ధి లేకపోవుట, శుభమూలక ఖర్చులు అధికమగుట, గృహోపకరణముల కొనుగోలు జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబవ్యక్తులను సంతోషపరచుటకై ఆభరణ వస్తువులను కొనుగోలు చేయుట, చేయువృత్తి వ్యాపారాదులయందు మధ్యవర్తిత్వ లోపములు ఏర్పడుట, అతినమ్మకము వలన ఇబ్బందులు పడవలసివచ్చుట, విందువినోదాల లో పాల్గొనుట, ఆరోగ్య భంగములు వాటిల్లుట, గృహములో మార్పులేర్పడుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన ప్రయత్నములు లాభించుట, కొనుగోలు వ్యవహారములయందు విజయములు చేకూరుట, ఒప్పంద వ్యవహారములు సానుకూలత చెందుట, భూతగాదాలు సమసిపోవుట, వాహనప్రయాణాదులలో ఇబ్బందులు వాటిల్లుట, వైద్యుల సలహా తీసుకొనుట, సమయానికి ధనము చేతికందుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సంఘములో గౌరవమర్యాదలు పెరుగుట, మాటకు విలువ లభించుట, అయాచితంగానే ఇతరుల సహకారము వెనువెంటనే లభించుట, పనులన్నియు ఆగకుండా పూర్తియగుట, సొంత నిర్ణయములు ఫలించకపోవుట, ప్రతి అంశమునకు ఇతరులపై ఆధారపడవలసి వచ్చుట, కుటుంబవ్యక్తులతో చర్చలు జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరుల నిర్ణయములే శిరోధార్యములు అగుట, తోటి వ్యాపారస్తులతో, ఉద్యోగస్తులతో చర్చలు సఫలమగుట, క్రయవిక్రయాదులలో లాభములు చేకూరుట, నిర్మాణాదిపనుల వలన ఖర్చులు అధికమగుట, చేయు వృత్తి వ్యాపారాదుల యందు తీరిక లేకుండా శ్రమించుట, నూతన బాధ్యతలు వచ్చుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రభుత్వపరమైన పనులు సానుకూల పడుట, ఆకస్మిక ప్రయాణాదుల వలన స్థానచలనముల వలన వస్తునష్టములు ఏర్పడుట, కుటుంబ వ్యక్తులకు సమయము కేటాయించక పోవుట, తద్వార కుటుంబ వ్యక్తులతో మనస్పర్థలు వచ్చుట, పితృవంశమూలకముగా ఆస్తితగాదాలు తలెత్తుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదుల యందు నూతన ప్రయత్నములు లాభించుట, ఒప్పందములు సానుకూలపడుట, వైవాహిక ప్రయత్నములు ఒక కొలిక్కి వచ్చుట, పొత్తుదారులతో చర్చలు వాయిదాపడుట, శ్రమకు తగిన గుర్తింపు వచ్చుట, కుటుంబవ్యక్తులతో పండగ వాతావరణములో గడుపుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మిత్రుల సహకారము తీసుకొనుట, శత్రుత్వబాధలు తగ్గించుకొనుటకు మౌనాన్నే ప్రధాన ఆయుధంగా వాడుట, వ్యక్తిగత విమర్శలకు స్పందించకపోవుట, ఇతరుల కోసమై, శుభ ప్రయత్నములకై దూరప్రాంత ప్రయాణములు చేయవలసివచ్చుట, సోదర వర్గపోరులు తగ్గుముఖం పట్టుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, సంతానాదులకై ఆభరణాది సౌభాగ్య వస్తువులను కొనుగోలు చేయుట, వ్యాపార లావాదేవీలు వాయిదా పడుట, గౌరవమర్యాదలకై తీవ్రముగా శ్రమించుట, బంధుమిత్రులతో కలసి విందువినోదాలలో పాల్గొనుట, వ్యాపార పొత్తు వ్యవహారములు చెడిపోవుట జరుగును.



# కుంభ రాశి
## AQUARIUS

| |
|---|
| ఆదాయం - 08 |
| వ్యయం - 08 |
| రాజ్యపూజ్యం - 03 |
| అవమానం - 05 |

**ధనిష్ఠ 3,4, శతభిషం 1,2,3,4, పూ।భా। 1,2,3 వ పాదాలలో జన్మించినవారు.**
**గూ,గే,గో,సా,సి,సు,సే,సో,ద అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కుంభరాశి వారి లక్షణములు :**

వీరు మంచి తెలివితేటలు, జ్ఞాపకశక్తి, అవగాహన, లోతైన స్వభావం, మంత్ర తంత్రాలు, మానవాతీత శక్తులపై నమ్మకం, గొప్పవారితోను, ధనవంతులతోనూ స్నేహ సంబంధాలు కలిగియుందురు. వ్యాపారముల కొరకు ఇతరముల ద్రవ్యమును అపారముగా కుమ్మరించెదరు. తల్లియందు మంచి ఇష్టము, రెచ్చగొడితె రెచ్చిపోయె బలహీనత, ఆవేశము, ఇబ్బందులకు దారి తీస్తుంది. ఏకపక్ష నిర్ణయాలు, ఇబ్బందులు కల్గిస్తాయి. ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం వలన విరోదాలు వస్తాయి. భూసంబంధిత వ్యాపారాలు కలసి వస్తాయి. ఎప్పటికప్పుడు మారే స్వభావం కలిగి ఉంటారు. ప్రేమించగల మనస్సు ఉన్నా ప్రేమాభిమా నాలతో మాట్లాడలేరు. జాతకమునందు క్రూర గ్రహముల వక్రదృష్టి ఉన్నా విప్లవాత్మకంగా మార్పు చెందుట, ప్రభుత్వమునకు చట్టమునకు భద్రతకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించుట, ఎవరితో ఉద్దేశాలను అభిప్రాయాలను బయట పెట్టకుండా ఉండుట, చిన్నమాటకు నొచ్చుకొని తట్టుకోలేని కోపం తెచ్చుకొని దుర్భాషలాడుట, ఆహార పానీయాల విషయంలో అనారోగ్యం వాటిల్లుట, ఏ రంగంలోనైనా రాణింపు ఉండుట, ఆస్తి విలువ పెరుగుట వలన ధనవంతులగుతారు. వయస్సు దాటిన తరువాత వివాహం జరుగును. ఒక సన్నివేశంలో తొందరపడి అహంకారిని వివాహమాడి, తరువాత బాధపడ వచ్చును. వరుణ గ్రహమునకు లేక సప్తమ స్థానమునకు కుజ, శనులలో ఒకరి కేంద్ర దృష్టి ఉన్నచో చట్టమునకు, ఆచారమునకు నీతికి విరుద్దంగా వివాహము చేసుకొందురు. వివాహం తరువాత స్థలము, పరిసరములు, జీవనోపాది మారవచ్చును. స్త్రీ సంతానం పట్ల ఎక్కువ మమకారం ఉండును. సంతానం వల్ల కుటుంబ ప్రతిష్ట ఎలా ఉన్నా స్థితిగతులు బాగుంటాయి. వ్యాపార కూడలి ప్రదేశాలు అద్దెకు ఇవ్వడం వలన అదృష్టాన్ని జారవిడుచుకుంటారు. సరియైన సమయంలో నిర్ణయం తీసుకోని కారణంగా చాలా మంచి అవకాశాలు చేతులదాకా వచ్చి జారిపోతాయి. ధనిష్టా నక్షత్రమున జన్మించినవారు గానప్రియులు, గానాసక్తి, దానశీలత,కలిగి ఉందురు. శతభిషా నక్షత్రము వారు సాహసములు కలవారు, సత్యము పలుకువారై శత్రువులను జయించుదురు. పూర్వాభాద్రా నక్షత్రమువారు మనస్సులో బాధగలవారై ధనవంతులు, సమర్థులు, స్త్రీలచే జయింపబడువారు అగుదురు. ధాతృత్వ గుణము ఉండదు. మాఘమాసంలో జన్మించినవారు సత్యం పలికెదరు. స్నాన దానములయందు ప్రీతి, లోపల ఆలోచన చేయుచు, పడమర ఉత్తర దిక్కులు కలసి వచ్చును. వీరి అదృష్ట సంఖ్యలు 3, 4, 5, 8,9, ఆది, సోమ, గురు, శుక్రవారములు కలసి వచ్చును.

### కుంభ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 7,8 స్థానములలో, శని 10,11 స్థానములో, రాహువు 7 వ స్థానములో, కేతువు 1 వ స్థానములలో ఉండుట వలన

స్థానచలనములు ఏర్పడుట, కుటుంబ వ్యక్తులకు ఆరోగ్యభంగములేర్పడుట, అనారోగ్య భయముల వలన మనస్తాపము పెంచుకొనుట, గృహమునందు శుభకార్యక్రమాలు సఫలమగుట, బంధు మిత్రుల కలయికలేర్పడుట, గొంతుకు సంబంధించిన ఇబ్బందులు వాటిల్లుట, సోదర వర్గం వారితో సానుకూలత లేకపోవుట, స్వల్పవిషయాలకే కోపం వచ్చుట, అకాలభోజనముల వలన ఇబ్బందులు ఏర్పడుట, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, ప్రముఖులతో పరిచయములు ఏర్పడుట, ఆర్థికపరంగా అనుకూలత ఉన్ననూ అంతే స్థితిలో ఖర్చులు ఉండుట వలన ధనము నిల్వ లేకపోవుట, నూతన ఆదాయమార్గమునకై చేయు ప్రయత్నములు సఫలమగుట, నరఘోష, అంతఃశత్రువులు అధికమగుట, విద్యార్థులకు సొంత ప్రయత్నముల వలన అనుకూలత చేకూరుట, ఇతరులపై ఆధారపడుట వలన నష్టం వాటిల్లుట, వ్యవసాయదారులకు పంటల మార్పిడి వలన లాభములేర్పడుట, ఉద్యోగస్తులకు అధికారుల బెడద అధికమగుట, వ్యాపారస్తులకు ఆశించినంత లాభములు రాకపోవుట, కళాకారులకు, పండితులకు విశేషపురస్కారాలు లభించుట, రాజకీయ వర్గం వారికి స్వపక్ష ఈర్ష్యా అసూయలు అధికంగా ఉన్ననూ తమవరకూ ఎటువంటి ఇబ్బందులు లేకుండా ఉండుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గణపతి హోమములు, దుర్గాద్వాత్రిశన్నామావళి, లక్ష్మీ హృదయ పారాయణములు, ఆకుపచ్చ వస్త్రములను దానముచేయుట, మారేడు వృక్షములకు నీళ్లుపోయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెల ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు పోటీతత్వములు అధికమగుట, ఆశించిన లాభములు నెమ్మదిగా వచ్చుట, ఆకస్మిక స్థానచలనములు జరుగుట, శుభకార్యక్రమ ప్రయత్నములు ప్రారంభించుట, వస్తులాభములు జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులకు ఆరోగ్యపరమైన ఇబ్బందులు ఏర్పడుట, వైద్య నిమిత్తమై ధనవ్యయము అధికమగుట, శారీరక శ్రమ అధికమగుట, అత్యవసర వ్యవహారములకై ఋణప్రయత్నములు చేయవలసి వచ్చుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనవసరపు మాటల వలన ఇతరులతో ఇబ్బందులు ఏర్పడుట, ఋణప్రయత్నములు మరలా మరల జరుగుట, అంతఃశత్రువులు అధికమగుట, నూతన ప్రయత్నములు సఫలమగుట, కీలక నిర్ణయములు వాయిదాపడుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసివచ్చుట, దైవకార్యక్రమాలలో పాల్గొనుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికముగా అభివృద్ధి ఉన్ననూ ఖర్చులు అధికంగా ఉండటము వలన అంతకుఅంతే సరిపోవుట, సోదరవర్గం వారితో మనస్పర్థలు ఏర్పడుట, అనవసర విమర్శలు అధికమగుట, పొత్తువ్యాపారులతో చర్చలు వాయిదాపడుట, ఆరోగ్యపరమైన జాగ్రత్తలు తీసుకోకపోవడము వలన ఇబ్బందులు పడుటట జరుగును.

**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమములు సఫలమగుట, సోదరవర్గం వారితో ఇబ్బందులు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, బంధుమిత్రులను కలుసుకొనుట, ప్రభుత్వాధికారులతో సఖ్యత కుదురుట, ఆడంబరములకై ధనవ్యయము అధికమగుట, ఇతరుల ఏడ్పు తెలియకుండానే ఇబ్బందిపెట్టుట, వస్తులాభములు జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, వైద్యసేవ తప్పనిసరి అగుట, పాతమిత్రులతో కలసి చేయుప్రయత్నములు సఫలము అగుట, సొంతవర్గం వారి ఈర్ష్యాసుయలు అధికమగుట, ప్రముఖులను కలుసుకొనుట, అనవసరపు ప్రయాణములు అధికమగుట, పనివారిపై అసహనము ఏర్పడుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థిక అభివృద్ధికై చేయు ప్రయత్నములు లాభించుట, కుటుంబ వ్యవహారములకై స్త్రీమూలక ధనవ్యయము అధికమగుట, తెలియకుండానే చెడుకార్యక్రమములకు సహకారము అందించుట, వాహన నిమిత్తమై ధనవ్యయములు ఏర్పడుట, ఆకస్మిక పురస్కారములు లభించుట, కీర్తి వృద్ధి జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చాలాకాలంగా ఇబ్బందిపెడుతున్న సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, నిర్మాణాదిపనులను ప్రారంభించుట, ఆర్థిక ఒడిదుడుకులు అలాగే ఉండుట, స్థిరాస్తుల విషయములలో ఇబ్బందులు వాటిల్లుట, ఇతరుల కార్యక్రమములకు పెద్దరికం చెలాయించుట, సహకారములు అందించుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, చేయువృత్తివ్యాపారాదులయందు లాభములు ఏర్పడుట, వాహనపరమైన ఇబ్బందులు తలెత్తుట, కుటుంబవ్యక్తులతో స్వల్ప విషయములకే విభేదములు వచ్చుట, కోపతాపములు అధికమగుట, నూతన కార్యక్రమాలను ప్రారంభించుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సోదరవర్గం వారి ఈర్ష్యాసుయలు అధికమగుట, దూరప్రయాణములు చేయవలసి వచ్చుట, అకాల భోజనములు, నిద్రలేమితనము వలన ఆరోగ్య భంగములు ఏర్పడుట, ముఖ్యమైన నిర్ణయములు వాయిదా పడుట, ఎన్ని వ్యతిరేఖతలు ఉన్ననూ, అన్నిటిని పూర్తిగా తొలగించుకొనుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఔషదసేవ చేయవలసివచ్చుట, వివాదములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, ఋణబాధలు తొలగించుకొనుటకై చేయు ప్రయత్నములు సఫలమగుట, శుభకార్యక్రమముల వలన ఆకస్మిక ఖర్చులు ఏర్పడుట, శత్రు బాధలు తొలగి, మిత్రవృద్ధి అధికమగుట, అయాచిత సహకారములు లభించుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆడంబరముల వలన ఖర్చులు అధికమగుట, మానసిక ప్రశాంతతకై విహారయాత్రలకు వెళ్లుట, సోదరవర్గం వారితో విభేదములు ఏర్పడుట, జనుల ఈర్ష్యాసుయలు అధికమగుట, ఇతరులను నమ్మి మోసపోవలసి వచ్చుట, ధనము నిల్వ చేయుటకు నూతన ప్రణాళికలను సిద్దం చేసుకొనుట, స్థానమార్పులు జరుగును.



# మీన రాశి

## PISCES

ఆదాయం - 05
వ్యయం - 14

రాజ్యపూజ్యం - 06
అవమానం - 05

**పూ।భా। 4, ఉ।భా। 1,2,3,4, రేవతి 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.**

**ది,దు,శం,ఝు,థ,దే,దో,చా,చీ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మీనరాశి వారి లక్షణములు :**

వీరు సౌమ్యులు, ఏకాగ్రత, ప్రశాంతత కలిగిన మనస్కులై, దైవభక్తి, తెలివితేటలు, సంభాషణా చాతుర్యం కలిగి అసమాన ప్రతిభను ప్రదర్శించగలరు. వీరిది మృదు స్వభావం, వస్త్రములందు మక్కువ, ప్రేమాభిమానాలు, మనోభావాలు వ్యక్తం చేయడం కాకుండా దాచుకోవడం, ఇతరులను దగ్గరకు రానివ్వకపోవడం వలన కలసి రాదు. చూపులతో మనష్యులను ఆకట్టుకుంటారు. చిన్న మాటకే బాధపడతారు. కోపం, ఆగ్రహం నిరాశను కల్గిస్తాయి. అనుమానాలు, భయాల కారణంగా స్వంత వ్యాపారాది వృత్తులలో అనేక అడ్డంకులు తెచ్చుకొని బాధపడతారు.ప్రజోపయోగకరములైన నిర్మాణములు, కట్టడములు, ఉద్యోగములో భాగస్వామ్య వ్యాపారాలలో బాగా రాణిస్తారు. ప్రేమాభిమానాలు కొంత మనోధైర్యాన్నిస్తాయి. కుటుంబ వాతావరణానికి ఎటువంటి మనస్థాపం కలగకుండా ఆనందమయంగా ఉంచుకోవడానికి ప్రయత్నిస్తారు. జలసంబంధిత వ్యవహారాలు కలసి వస్తాయి. ఉదక మందు ఉత్పన్నమైన వాటి వలన వచ్చు ధనము అనుభవింతురు. భూములు ఎట్టి పరిస్థితిలోనూ తనఖగాని, అమ్ముటగాని చేయకూడదు. భద్రత, ఆరోగ్య విషయాలలో జాగ్రత్త అవసరము. బాల్యమందు కష్టాలు, గండములు కలవు. బంధుమిత్రాదులలో ఎవరికో ఒకరికి సేవ చేయుటగాని, రోగులపై దక్షత వహించుటగాని జరుగవచ్చును. చెడ్డమార్గం నుండి లేక మంచికో, మంచి నుండి చెడ్డకో ఆశ్చర్యకరంగా ఒక్కరోజులో మారిపోగలరు. భార్య వలన గాని మిత్రుల వలన గాని అకారణముగా తల్లిదండ్రులకు, తోబుట్టువులకు దూరంగా ఉండవలసి వచ్చును. సోదరులతో స్వల్ప సంబంధములు మాత్రము ఉండును. బంధువులతో కన్నా స్నేహితులతో సన్నిహితంగా ఉంటారు. విలాసవంతమైన జీవితం గడుపుతారు. కుటుంబ సభ్యులకు అన్ని విధాలుగా ఆనందమును, సౌఖ్యమును చేకూర్చగలరు. నడి వయస్సు తరువాత మీ జీవితంలో ప్రవేశించిన స్త్రీ వలన ఇబ్బందులు కలుగును. ఈ రాశిలో జన్మించిన స్త్రీలు ఇల్లు దిద్దుకొనుటలో, ఉదాత్తమైన జీవితమును గడుపుటలో చక్కని మాతృమూర్తులై సంతానమును పెంచి పెద్దచేయగలిగి ఉందురు. పనులు చేయుటలో తొందర, కంగారు వలన అలసి నీరసించిపోయెదరు. ప్రేమ విషయంలో తొందరపాటు మంచిదికాదు. రుచికరమైన పదార్థాలను వండి తినిపించేవారిని, ఇంటిని చక్కగా అలంకరించేవారిని ఇష్టపడతారు. వీరిని బుజ్జగిస్తుండాలి. పూర్వాభాద్రా నక్షత్రమున జన్మించినవారు మనస్సులో బాధను ఇతరులకు చెప్పరు. ఉత్తరాభాద్రా నక్షత్రము వారు మాట్లాడుటలో నిపుణత కలిగి సుఖవంతులై సంతానాభివృద్ధి చెంది ఉందురు. రేవతి నక్షత్రము వారు అవయవ సౌష్టవం కలిగి అందరికి ఇష్టులై, శూరులు, ధనవంతులు, ఇతరుల ధనద్రవ్యములు కోరనివారగుదురు.

### మీన రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 6,7 స్థానములలో, శని 9,10 స్థానములో, రాహువు 6 వ స్థానములో, కేతువు 12 వ స్థానములలో ఉండుట వలన

కుటుంబ వ్యవహారములు మెల్లమెల్లగా సర్దుమణుగుట, కుటుంబ విరోధములు తగ్గుముఖము పట్టుట, శత్రుత్వ బాధలు తొలగిపోవుట, శుభమూలక నిర్మాణ పరమైన విషయములకై ధనవ్యయము అధికమగుట, గొప్పవాళ్లను కలుసుకొనుట, గృహోపకరణములను కొనుగోలు చేయుట, ఆస్తి లావాదేవీ విషయములు మధ్యవర్తిత్వ విషయములు ఆలస్యముగా పూర్తియగుట, దూరప్రాంత ప్రయాణములు చేయవలసి వచ్చుట, బంధు జనులతో వచ్చిన విమర్శలు తగ్గి మరింత స్నేహం పెరుగుట, ప్రత్యేకమైన గుర్తింపులకై చేయు ప్రయత్నములు సఫలమగుట, నిద్రలేమితనములు ఏర్పడుట, శుభకార్యక్రమములకు ముఖ్యవ్యక్తులుగా ఉండుట, విద్యార్థులకు విద్యాయోగము అనుకూలముగా లేకపోవుట, వ్యవసాయదారులకు పంటలు లాభించిననూ ఋణ నివృత్తికై సరిపోవుట, ఉద్యోగస్తులకు అయిష్ట బదిలీలు ఏర్పడుట, వ్యాపారస్తులకు లాభసాటిగా ఉండుట, కళాకారులు, పండితులు గుర్తింపులకై చేయు ప్రయత్నములు సఫలమగుట, రాజకీయవర్గం వారికి స్వపక్ష, ప్రతిపక్ష విభాగములతో ఇబ్బందులు వాటిల్లుట, పదవీ గండములేర్పడుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు వరాహమూర్తిని ఆరాధించుట, అమ్మవారి ఆలయాలలో ముదురు ఎరుపు రంగు వస్త్రములను సమర్పించుట, ఉసిరిక వృక్షములను సేవించుట, వేదపండితులకు ఉసిరిక ఫలములను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక ఒత్తిడి తగ్గించు కొనుటకు చేయు ప్రయత్నముల సఫలమగుట, కుటుంబ వ్యక్తులతో మాటపట్టింపులు తగ్గుముఖం పట్టుట, నిర్మాణాది పనులకై ఆలోచించుట, మిత్రుల సహకారము తీసుకొనుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బంధువర్గం నుండి శుభవార్తలు వినుట, ఆడంబరములకై ధనవ్యయము అధికమగుట, వృత్తివ్యాపారాదులలో ఆటంకములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, శుభకార్యక్రమములలో స్వల్ప వివాదములు జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చాలాకాలంగా ఆగిపోయిన పనులను నూతన ఉత్తేజముతో ప్రారంభించుట, సంఘములో గౌరవ మర్యాదలకై తీవ్రంగా శ్రమించుట, శ్రమకుతగిన గుర్తింపులు రాకపోవుట, అకాల భోజనములు నిద్రలేమితనము ల వలన ఇబ్బందులు పడుట, ఆకస్మిక ప్రయాణములు చేయుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆదాయమును మించి ఖర్చులు అధికమగుట, నిర్మాణాది పనులు సజావుగా సాగుట, సమయానికి ధనము ఏదోరకముగా చేతికందుట, బంధువర్గం వారితో స్వల్ప వివాదములు వచ్చి మరల తగ్గిపోవుట, పాతమిత్రులను కలుసుకొనుట, పొత్తువ్యాపారములు లాభించుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరులను మెప్పించుటకై తలవొగ్గి పనులను చేయవలసి వచ్చుట, అధికారుల మన్ననలకై తీవ్ర ప్రయత్నములు చేయుట, సన్నిహితుల సహకారముతో కుటుంబ వ్యక్తుల సహకారముతో నూతన ప్రయత్నములు లాభించుట, ఎక్కడ తప్పుదొరుకుతుందా అని ఎదుటివారు గమనించుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సకాలములో ఋణములు లభించుట, శుభకార్యక్రమములను నిర్వహించుటకు ఒప్పందములు తీసుకొనుట, ఇతరుల బాధ్యతలను స్వీకరించుట, తొందరపాటు నిర్ణయాలవలన ప్రారంభములో ఇబ్బందులు వచ్చిననూ అనుకూల వాతావరణములు ఏర్పడుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబవ్యక్తులకు గౌరవ పురస్కారములు లభించుట, స్త్రీమూలక ధనవ్యయములు అధికమగుట, ఒంటరి జీవనము గడపవలసి వచ్చుట, వైద్యసేవ తప్పనిసరి అగుట, మిత్రుల సహకారముతో పనులు పూర్తియగుట, నూతన ప్రయత్నములు, పెట్టుబడులు లాభించుట, వస్తులాభములు ఏర్పడుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆరోగ్య భంగములు ఏర్పడుట, అయిష్ట బదలీలు జరుగుట, అనవసరపు ఖర్చులు అధికమగుట, కీలక నిర్ణయములు సరియైన సమయములో తీసుకొని శుభములు పొందుట, కడుపు, కీళ్ళకు సంబంధించిన ఇబ్బందులు వాటిల్లుట, వాహనపరమైన ఒడిదుడుకులు ఏర్పడుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన గృహోపకరణములు కొనుగోలు చేయుట, గృహముయందు మార్పులు చేయుట, వివాదాలను తగ్గించుకొనుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట, ప్రముఖుల మన్ననలు పొందుట, పాతమిత్రులతో కలసి చేయు ప్రయాణాదులలో లాభములు ఏర్పడుట, ఆకస్మిక ధనలాభములేర్పడుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనిభారము అధికమగుట, సంకల్పించిన పనులు పూర్తిచేసి అధికారుల మన్ననలుపొందుటకు తీవ్ర ప్రయత్నములు చేయుట, ఆధ్యాత్మిక వాతావరణములో గడుపుట, ప్రముఖులను కలుసుకొనుట, అంతఃశత్రువులను తెలుసుకొని తగుజాగ్రత్తలు పడుట, ఋణప్రయత్నములు సఫలమగుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిర్మాణాది శుభకార్యక్రమ పనులు ఒకకొలిక్కి వచ్చుట, చాలాకాలంగా ఇబ్బందిపెడుతున్న మనస్పర్ధలు మాటపట్టింపులు తగ్గుముఖం పట్టుట, అందరిని స్నేహభావముతో కలుపుకొనిపోవుట, కుటుంబవ్యక్తులతో కలసి దూరప్రాంత ప్రయాణములు చేయుట, వ్యాపార చర్చలు వాయిదాపడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమ, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, ఇతరుల కార్యక్రమములలో ముఖ్యపాత్ర వహించుట, తెలియకుండానే నీచులతో సఖ్యత ఏర్పడుట, తద్వారా సన్నిహితులు దూరమగుట, స్వల్ప విషయములకే కోపతాపములు అధికమగుట, శారీరక శ్రమ, పనిఒత్తిడి అధికమగుట, వైద్యసేవ జరుగును.

# వధూవర గుణమేళన చక్రము 18 గుణములకు తగ్గిన పనికిరాదు

| వరుడు | | మేషం | | | వృషభం | | | మిథునం | | | కర్కాటకం | | | సింహ | | | కన్యా | | | తుల | | | వృశ్చికం | | | ధనస్సు | | | మకరం | | | కుంభం | | | మీనం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వధువు | అశ్వి | భర | కృత్తి1 | కృత్తి3 | రోహి | మృగ2 | మృగ2 | ఆర్ద్రా | పున3 | పున1 | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త1 | ఉత్త3 | హస్త | చిత్త2 | చిత్త2 | స్వాతి | విశా3 | విశా1 | అనూ | జ్యేష్ఠ | మూల | పూర్వా | ఉత్త1 | ఉత్త3 | శ్రవ | ధని2 | ధని2 | శత | పూర్వా3 | పూర్వా1 | ఉత్త | రేవ |
| మేషం | అశ్వి | 28 | 33 | 28 | 18 | 23 | 23 | 26 | 18 | 19 | 23 | 32 | 27 | 26 | 30 | 20 | 09 | 10 | 13 | 22 | 28 | 24 | 27 | 35 | 22 | 13 | 26 | 23 | 18 | 21 | 13 | 13 | 09 | 10 | 22 | 31 | 33 |
| | భర | 33 | 28 | 28 | 19 | 25 | 16 | 27 | 27 | 26 | 31 | 25 | 26 | 25 | 23 | 30 | 19 | 21 | 04 | 13 | 31 | 23 | 26 | 26 | 28 | 20 | 19 | 24 | 19 | 22 | 03 | 03 | 14 | 17 | 30 | 25 | 35 |
| | కృత్తి1 | 26 | 29 | 28 | 18 | 10 | 16 | 18 | 19 | 18 | 23 | 27 | 23 | 21 | 23 | 23 | 13 | 15 | 18 | 27 | 15 | 15 | 22 | 27 | 33 | 23 | 16 | 10 | 05 | 06 | 18 | 16 | 19 | 10 | 23 | 27 | 20 |
| వృషభం | కృత్తి3 | 25 | 26 | 23 | 28 | 19 | 25 | 16 | 16 | 16 | 20 | 23 | 19 | 17 | 19 | 19 | 25 | 26 | 29 | 21 | 10 | 13 | 20 | 25 | 31 | 26 | 19 | 12 | 09 | 17 | 22 | 21 | 23 | 15 | 12 | 15 | 07 |
| | రోహి | 33 | 33 | 17 | 19 | 28 | 35 | 25 | 25 | 22 | 26 | 29 | 14 | 12 | 26 | 25 | 30 | 32 | 25 | 17 | 16 | 11 | 15 | 32 | 26 | 22 | 28 | 17 | 15 | 18 | 19 | 17 | 20 | 23 | 20 | 21 | 15 |
| | మృగ2 | 32 | 24 | 24 | 26 | 34 | 28 | 16 | 22 | 21 | 25 | 19 | 21 | 20 | 16 | 23 | 28 | 30 | 16 | 09 | 22 | 17 | 24 | 23 | 26 | 20 | 18 | 22 | 19 | 25 | 10 | 09 | 19 | 21 | 18 | 10 | 21 |
| మిథునం | మృగ2 | 21 | 22 | 13 | 25 | 32 | 24 | 28 | 32 | 31 | 18 | 11 | 13 | 24 | 21 | 26 | 30 | 31 | 17 | 18 | 32 | 26 | 13 | 11 | 14 | 23 | 19 | 24 | 26 | 31 | 16 | 10 | 21 | 22 | 18 | 10 | 21 |
| | ఆర్ద్రా | 13 | 21 | 13 | 23 | 33 | 32 | 33 | 28 | 24 | 11 | 20 | 15 | 24 | 30 | 22 | 23 | 26 | 25 | 25 | 34 | 26 | 12 | 19 | 05 | 18 | 30 | 27 | 29 | 31 | 23 | 18 | 12 | 16 | 10 | 21 | 21 |
| | పున3 | 12 | 19 | 13 | 25 | 29 | 30 | 31 | 25 | 28 | 12 | 20 | 17 | 24 | 28 | 20 | 22 | 25 | 25 | 25 | 33 | 25 | 12 | 20 | 07 | 15 | 28 | 26 | 27 | 31 | 22 | 17 | 12 | 13 | 08 | 18 | 19 |
| కర్కాటకం | పున1 | 16 | 23 | 17 | 14 | 17 | 17 | 23 | 17 | 18 | 28 | 33 | 30 | 18 | 22 | 14 | 15 | 18 | 20 | 19 | 25 | 18 | 28 | 33 | 20 | 09 | 22 | 19 | 25 | 28 | 20 | 18 | 12 | 14 | 13 | 24 | 25 |
| | పుష్య | 24 | 16 | 20 | 16 | 20 | 11 | 18 | 25 | 26 | 33 | 28 | 29 | 20 | 16 | 25 | 26 | 28 | 12 | 11 | 28 | 19 | 26 | 25 | 28 | 17 | 12 | 22 | 25 | 27 | 13 | 11 | 22 | 23 | 28 | 18 | 27 |
| | ఆశ్లే | 18 | 18 | 15 | 11 | 06 | 14 | 20 | 21 | 23 | 30 | 29 | 28 | 16 | 18 | 19 | 20 | 22 | 26 | 26 | 24 | 16 | 23 | 29 | 34 | 23 | 18 | 08 | 13 | 16 | 26 | 24 | 27 | 18 | 18 | 20 | 12 |
| సింహం | మఖ | 19 | 19 | 15 | 09 | 04 | 11 | 15 | 15 | 14 | 25 | 28 | 24 | 28 | 30 | 27 | 16 | 17 | 22 | 25 | 18 | 17 | 24 | 27 | 35 | 31 | 26 | 16 | 06 | 08 | 21 | 26 | 27 | 20 | 27 | 28 | 20 |
| | పుబ్బ | 25 | 17 | 17 | 11 | 18 | 19 | 13 | 22 | 10 | 31 | 25 | 26 | 30 | 28 | 33 | 22 | 22 | 08 | 11 | 25 | 19 | 27 | 23 | 26 | 25 | 23 | 30 | 24 | 21 | 07 | 12 | 21 | 26 | 33 | 26 | 34 |
| | ఉత్త1 | 15 | 22 | 17 | 11 | 17 | 15 | 19 | 14 | 22 | 23 | 34 | 27 | 27 | 33 | 28 | 14 | 15 | 12 | 15 | 26 | 15 | 23 | 34 | 20 | 15 | 31 | 29 | 09 | 21 | 12 | 17 | 11 | 15 | 22 | 35 | 33 |
| కన్యా | ఉత్త3 | 18 | 27 | 20 | 18 | 23 | 22 | 22 | 17 | 15 | 10 | 21 | 14 | 24 | 30 | 22 | 28 | 26 | 23 | 15 | 26 | 15 | 17 | 27 | 13 | 14 | 28 | 27 | 27 | 30 | 21 | 15 | 09 | 13 | 16 | 28 | 26 |
| | హస్త | 18 | 27 | 23 | 20 | 24 | 23 | 24 | 17 | 17 | 12 | 22 | 16 | 26 | 30 | 22 | 25 | 28 | 27 | 19 | 28 | 18 | 20 | 28 | 15 | 17 | 29 | 27 | 29 | 31 | 24 | 19 | 10 | 14 | 16 | 29 | 29 |
| | చిత్త2 | 20 | 12 | 24 | 22 | 18 | 10 | 10 | 18 | 16 | 11 | 05 | 19 | 30 | 16 | 20 | 23 | 26 | 28 | 17 | 18 | 25 | 27 | 11 | 25 | 27 | 13 | 21 | 22 | 23 | 19 | 13 | 23 | 15 | 18 | 10 | 19 |

| | వరుడు | మేషం | | | వృషభం | | | మిథునం | | | కర్కాటకం | | | సింహ | | | కన్యా | | | తుల | | | వృశ్చికం | | | ధనస్సు | | | మకరం | | | కుంభం | | | మీనం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వధువు | అశ్వి | భర | కృత్తి1 | కృత్తి3 | రోహి | మృగ2 | మృగ2 | ఆర్ద్ర | పున3 | పున1 | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త1 | ఉత్త3 | హస్త | చిత్త2 | చిత్త2 | స్వాతి | విశా3 | విశా1 | అను | జ్యేష్ఠ | మూల | పూషా | ఉషా1 | ఉషా3 | శ్రవ | ధని2 | ధని2 | శత | పూభా3 | పూభా1 | ఉభా | రేవ |
| తుల | చిత్త2 | 22 | 14 | 27 | 29 | 25 | 17 | 10 | 19 | 17 | 11 | 04 | 18 | 19 | 05 | 10 | 24 | 26 | 25 | 28 | 26 | 33 | 22 | 07 | 21 | 27 | 13 | 21 | 23 | 24 | 21 | 22 | 32 | 24 | 11 | 03 | 12 |
| | స్వాతి | 29 | 31 | 16 | 28 | 22 | 30 | 25 | 26 | 25 | 19 | 22 | 07 | 06 | 19 | 19 | 33 | 36 | 26 | 26 | 28 | 19 | 07 | 28 | 17 | 24 | 29 | 19 | 22 | 24 | 24 | 26 | 26 | 31 | 17 | 21 | 14 |
| | విశా3 | 22 | 22 | 19 | 21 | 17 | 24 | 18 | 19 | 18 | 12 | 12 | 10 | 11 | 13 | 09 | 23 | 26 | 32 | 33 | 18 | 28 | 14 | 16 | 22 | 25 | 19 | 13 | 17 | 18 | 30 | 29 | 30 | 22 | 13 | 13 | 14 |
| వృశ్చికం | విశా1 | 18 | 18 | 14 | 18 | 18 | 24 | 24 | 21 | 20 | 16 | 18 | 16 | 14 | 16 | 12 | 09 | 11 | 19 | 28 | 13 | 20 | 28 | 26 | 32 | 22 | 16 | 07 | 12 | 12 | 25 | 23 | 24 | 17 | 24 | 25 | 18 |
| | అనూ | 27 | 17 | 20 | 25 | 30 | 22 | 17 | 24 | 31 | 26 | 18 | 22 | 18 | 14 | 22 | 18 | 20 | 04 | 14 | 29 | 22 | 27 | 28 | 31 | 17 | 15 | 22 | 26 | 28 | 13 | 11 | 23 | 23 | 31 | 26 | 34 |
| | జ్యేష్ఠ | 13 | 19 | 23 | 30 | 25 | 24 | 16 | 11 | 12 | 12 | 20 | 27 | 23 | 17 | 10 | 05 | 06 | 17 | 17 | 23 | 27 | 32 | 28 | 28 | 14 | 18 | 17 | 21 | 22 | 26 | 24 | 20 | 10 | 18 | 29 | 28 |
| ధనస్సు | మూల | 19 | 27 | 30 | 18 | 14 | 13 | 21 | 17 | 13 | 15 | 24 | 31 | 23 | 17 | 09 | 06 | 08 | 19 | 19 | 16 | 19 | 29 | 22 | 22 | 28 | 18 | 26 | 14 | 16 | 20 | 29 | 23 | 15 | 16 | 26 | 26 |
| | పూషా | 34 | 26 | 23 | 11 | 20 | 11 | 19 | 29 | 28 | 31 | 21 | 26 | 18 | 16 | 23 | 20 | 22 | 05 | 05 | 21 | 13 | 24 | 24 | 26 | 28 | 28 | 34 | 25 | 24 | 07 | 16 | 26 | 30 | 31 | 24 | 33 |
| | ఉషా1 | 31 | 31 | 17 | 04 | 09 | 15 | 24 | 26 | 26 | 28 | 31 | 16 | 08 | 22 | 21 | 19 | 20 | 13 | 13 | 12 | 05 | 15 | 31 | 25 | 27 | 34 | 28 | 13 | 14 | 19 | 22 | 24 | 28 | 29 | 24 | 28 |
| మకర | ఉషా3 | 27 | 27 | 13 | 17 | 22 | 28 | 18 | 21 | 20 | 27 | 29 | 14 | 13 | 27 | 26 | 21 | 23 | 15 | 15 | 15 | 07 | 06 | 21 | 15 | 22 | 30 | 21 | 28 | 26 | 25 | 15 | 17 | 21 | 28 | 31 | 32 |
| | శ్రవ | 30 | 29 | 12 | 17 | 24 | 32 | 22 | 22 | 23 | 29 | 28 | 18 | 16 | 28 | 27 | 22 | 24 | 17 | 17 | 16 | 09 | 07 | 23 | 18 | 25 | 31 | 21 | 25 | 28 | 28 | 18 | 20 | 22 | 30 | 31 | 25 |
| | ధని2 | 20 | 11 | 25 | 29 | 26 | 16 | 16 | 15 | 13 | 20 | 13 | 27 | 28 | 14 | 19 | 14 | 16 | 12 | 12 | 16 | 20 | 19 | 06 | 20 | 28 | 15 | 21 | 25 | 27 | 28 | 15 | 22 | 17 | 25 | 16 | 23 |
| కుంభం | ధని2 | 20 | 11 | 24 | 29 | 25 | 16 | 16 | 25 | 23 | 11 | 04 | 18 | 26 | 12 | 17 | 23 | 25 | 21 | 15 | 19 | 23 | 17 | 04 | 18 | 23 | 10 | 16 | 23 | 25 | 23 | 28 | 32 | 27 | 16 | 07 | 13 |
| | శత | 16 | 22 | 27 | 31 | 27 | 26 | 27 | 19 | 18 | 05 | 15 | 21 | 27 | 21 | 11 | 17 | 17 | 31 | 24 | 19 | 25 | 18 | 16 | 14 | 17 | 20 | 18 | 25 | 27 | 30 | 32 | 28 | 18 | 07 | 16 | 17 |
| | పూభా | 17 | 25 | 18 | 23 | 32 | 31 | 31 | 24 | 21 | 09 | 18 | 12 | 18 | 26 | 15 | 21 | 23 | 23 | 17 | 25 | 17 | 11 | 18 | 14 | 09 | 24 | 22 | 29 | 31 | 25 | 27 | 18 | 28 | 14 | 21 | 20 |
| మీనం | పూభా1 | 15 | 22 | 15 | 18 | 26 | 25 | 23 | 16 | 15 | 21 | 31 | 25 | 18 | 24 | 13 | 15 | 15 | 17 | 17 | 24 | 17 | 17 | 26 | 11 | 08 | 22 | 21 | 21 | 23 | 17 | 22 | 13 | 20 | 28 | 32 | 31 |
| | ఉభా | 24 | 17 | 19 | 21 | 27 | 17 | 16 | 27 | 25 | 32 | 26 | 27 | 19 | 17 | 26 | 27 | 27 | 09 | 10 | 28 | 17 | 18 | 20 | 22 | 18 | 16 | 23 | 23 | 24 | 08 | 13 | 22 | 27 | 32 | 28 | 34 |
| | రేవ | 25 | 26 | 12 | 15 | 20 | 27 | 26 | 26 | 25 | 32 | 34 | 20 | 12 | 24 | 23 | 24 | 28 | 19 | 19 | 20 | 11 | 11 | 27 | 22 | 19 | 24 | 14 | 14 | 16 | 16 | 21 | 24 | 25 | 30 | 33 | 28 |

వధూవరులది ఒకే నక్షత్రమైనపుడు, వధూనామము ముందుండుట అశుభం, వరనామము ముందున్నను ఒకే నామమైన శుభం.

## శుభకార్యక్రమములకు యోగ్యమైన తిథివార లగ్న నక్షత్రాదులను తెలియజేయు చక్రము

| శుభకార్యములు | తిథులు | నక్షత్రములు | వారములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపన గృహారంభం | 2–3–5–7 10–13 | అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉప.హ, చిత్త, అనూ, ఉషా, శ్ర, ధని, శ, ఉ.భా., రే | బు–గు–శు | వృష, మిథు, కన్య, ధను, కుం, మీనం | చతుర్థ, అష్టమ శుద్ధి |
| గృహ ప్రవేశం | 2–3–5–7 10–13 | రో, మృ, ఉప, అనూ, ఉషా, ధని, శత, ఉ.భా., రే | బు–గు–శు | వృష, మిథు, కన్య, ధను, కుం, మీనం | చతుర్థ, అష్టమశుద్ధి, వృషభ కలశ శుద్ధి |
| నిషేకము | 2–3–5–7 10–13 | అశ్వి, రో, ఉప, హ, ధని, మఖ, మూ, ఉ.భా., శ్ర, శత | బు–గు–శు సో | వృష, మిథు, కన్య, తుల, ధను, కుం, మీనం, | లగ్న శుద్ధి, మాఘాది పంచకం శుభం |
| గర్భాదానం | 2–3–5–7 10–13 | రో, మృ, పున, పుష్య.ఉప, హ, చి, స్వా., అనూ, మూ, ఉషా,శ్రవ,ధని, శత, ఉ.భా., రే | బు–గు–శు సో | మే, వృష, కట, కన్య, తుల, ధను, మీన | 1–8 శుద్ధి, పంచవ్రత దినములు కానివి. |
| పుంసవనం సీమంతం | 2–3–5–7 10–13 | అశ్వి, రో, మృగ, పున, ఉప, హ, చి, స్వా, అనూ, మూ, ఉషా, శ్రవ, శత, ఉభా., రే | బు–గు–శు సో | వృశ్చి, సిం, మీన, ఇతర పుం లగ్నములు | 8–9 శుద్ధి 4–6–8 మాసములు |
| జాతకర్మ నామకరణం | 2–3–5–7 10–11–13 | అశ్వి, రో అనూ, పు, ఉప, హ, చి, స్వా ఉ.భా., శ్ర, ధని, శత | బు–గు–శు సో | వృష, మిథు, కట, కన్య తుల, ధను, మీనం | అష్టమ శుద్ధి పక్షచ్ఛిద్ర రహితం 1–3–5 మాసములు |
| డోలారోహణం | 2–3–5–7 10–13 | అశ్వి, రో, మృ, పుష్య, ఉప, హ, చి, స్వా అనూ, ఉషా, ఉభా, రేవ | బు–గు–శు సో | వృష, మిథు, కన్య, కట, ధను, మీనం | 1–3–5 మాసములు అష్టమ శుద్ధి |
| అన్న ప్రాశనం | 2–3–5–7 10–13 | అశ్వి, రో, మృ, పున, పు, ఉప, హ, చి, స్వా,అనూ,ఉషా,శ్రవ,ధని, శత, ఉభా, రే | బు–గు–శు సో | వృష, మిథు, ధను, మీన, కన్య | 10 శుద్ధి పురుషులకు సరి మాసం, స్త్రీలకు బేసి మాసం |
| కర్ణవేధ | 2–3–5–7 10–13 | అశ్వి, మృగ, పున, పు, ఉప, హ, చి, ఉషా, శ్రవధని, ఉభా, అనూ, రే | బు–గు–శు సో | వృష, మిథు, కట, కన్య, ధను, మీనం | అష్టమశుద్ధి 6–7–8 మాసములు శుభం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| **కేశఖండన** | 2-3-5-7<br>10-13 | అశ్వి, మృగ, పున, పు, హ, స్వా, శ్ర,<br>ధని, శత, రే | బు-గు-శు<br>సో | వృష, మిథు, కన్య, కట,<br>తుల, ధను, మీనం | ఉత్తరాయణ ప్రథమ<br>యానము |
| **అక్షరాభ్యాసం** | 2-3-5-7<br>10-13 | అశ్వి, పున, పు, హ, చి, స్వా, అనూ<br>ఆర్ద్రా, శ్ర, రే | బు-గు-శు<br>ఆ-సో | మెష, కట, తుల, మక | అష్టమ శుద్ధి అనధ్యాయ<br>రహితం |
| **ఉపనయనము** | 2-3-5-7-10<br>కృష్ణ లో 2-7-3 | అశ్వి, మృ, పున, ఉప, హ, చి, స్వాతి<br>అనూ, ఉషా, శ్ర, ధని, శత, ఉభా, రే | బు-గు<br>ఆ-సో | వృష, మిథు, కట, తుల,<br>ధనుస్సు, మీనం | అష్టమశుద్ధి కేంద్రపాపగ్రహ<br>రహితం |
| **వివాహం** | 2-3-5-7<br>10-13 | రో, మృ,మఖ, ఉప, హ, స్వా, అనూ,<br>మూ, ఉషా, ఉ.భా., రే | సో-శు-బు-గు<br>ఆ-శ | వృష, మిథు, కట<br>తుల, కన్య, ధను, మీన | 7 శుద్ధి కేంద్రపాపగ్రహ<br>రహితం మాఘాది పంచకం |
| **నూతన వస్త్రధారణ** | 2-3-5-7<br>10-13 | అశ్వి,రో,మృ,పుష్య,ఉప,హ,చి, స్వా, వి,<br>అనూ, మూ, ఉషా, శ్ర, ధ, శత, ఉభా, రే | సో-బు-గు<br>శు | వృష, మిథు, కట, కన్య<br>తుల, ధను, మీన | 3-8 శుద్ధి |
| **కూపారంభం బోర్ వేయుటకు** | 2-3-5-7-10<br>13 | రో, పు, మృ, ఉప, అనూ, జ్యే, ఉషా, మూ,<br>శ్ర, ధని, శత, ఉభా, కృత్తి, పుబ్బ, పూషా, విశా | సో-బు-గు-శు | కట, మకర, మీన, శుభం<br>కుం, వృ, | 3 శుద్ధి లగ్నమందు చంద్ర<br>గురు శుక్రులు |
| **ప్రయాణం** | 2-3-5-7<br>10-13 | రో, మృ, ఉప, హ, అనూ,<br>మూ, శ్రవ, ధని, రే | సో-గు-శు | మేష, వృష, మీనం, కటక,<br>తుల, ధను | వార శూలలు పనికిరావు |
| **దేవతా ప్రతిష్ఠ** | 2-3-5-7<br>8-10-12-13 | అశ్వి, రో, పున, పు,ఉత్తరాత్రయం,చి, స్వా,<br>అనూ, శ్ర,ధని, శత, రే, (దేవ నక్షత్రం) | ఆ-సో-బు<br>గు-శు | వృష, సిం, మిథు, కన్యా, ధను,<br>కుంభ, మీనం | సౌమ్య దేవతలకు ఉత్తరాయణం<br>ఉగ్ర దేవతలకు దక్షిణాయణం |
| **వాణిజ్యం** | 2-3-5-10 | అశ్వి, రో, మృ, పుష్య, హ, చి, స్వా,<br>అనూ, ఉషా, శత, రే | ఆ-బు-గు<br>శు | కట, వృష, మిధు,<br>కన్య, తు, ధను, మీనం | ఏకాదశ శుద్ధి<br>శుభులకు కేంద్రస్థితి |

## శిశు జనన నక్షత్రముల దోషాది వివరములు సూచించు చక్రము

| నక్షత్రం | 1వ పాదం | 2 వ పాదం | 3 వ పాదం | 4 వ పాదం | విశేషములు |
|---|---|---|---|---|---|
| అశ్విని | శిశువుకి,తండ్రికి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ముఖావలోకనం,ఏకాదశ రుద్రాభిషేకం,సువర్ణదానం. |
| భరణి | దోషం లేదు | దోషం లేదు | శిశువు,తలిదండ్రులకు | దోషం లేదు | ముఖావలోకనం, జప హోమతర్పణాదులు, సువర్ణదానం. |
| కృత్తిక | దోషం లేదు | దోషం లేదు | శిశువు,తలిదండ్రులకు | దోషం లేదు | ముఖావలోకనం, రజితదానం. |
| రోహిణి | తల్లికి,మేనమామకు | తల్లిదండ్రి,మేనమామకు | తల్లి మేనమామకు | మేనమామకు | ముఖావలోకనం,హోమశాన్త్యాదులు,రజితదానం. |
| మృగశిర | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| ఆర్ద్రా | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| పునర్వసు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| పుష్యమి | మేనమామకు | తల్లి తండ్రులకు | తల్లి తండ్రులకు | సామాన్య దోషం | ముఖావలోకనం, రుద్రాభిషేకం, హోమాదులు, గంధ దానం. |
| అశ్రేష | దోషం లేదు | తండ్రికి ధనానికి | తల్లికి | తండ్రికి,శిశువుకి | ముఖావలోకనం, యథావిధిహోమశాన్త్యాదులు, సువర్ణదానం. |
| మఖ | శిశువుకి,తండ్రికి | తల్లి తండ్రులకు | తల్లి తండ్రులకు | దోషం లేదు | ముఖావలోకనం, యథావిధిహోమశాన్త్యాదులు, సువర్ణదానం. |
| పుబ్బ | సామాన్య దోషం | సామాన్య దోషం | సామాన్య దోషం | సామాన్య దోషం | ముఖావలోకనం, శ్వేత వస్త్రదానం. |
| ఉత్తర | మాతా పితరులకు | సామాన్య దోషం | సామాన్య దోషం | సోదరులకు | ముఖావలోకనం, హోమశాన్త్యాదులు, తిలపాత్ర సహిత వస్త్రదానం. |
| హస్త | దోషం లేదు | దోషం లేదు | తల్లి తండ్రులకు | దోషం లేదు | ముఖావలోకనం, హరిద్రా వస్త్రదానం. |
| చిత్తా | మాతాపితరులకు | తల్లితండ్రులకు | సోదరులకు | సామాన్య దోషం | ముఖావలోకనం, హోమశాన్త్యాదులు, సువర్ణ మేషదానం. |

| నక్షత్రం | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం | విశేషములు |
|---|---|---|---|---|---|
| స్వాతి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| విశాఖ | బావ,బావమరిది,మరదలికి | బావ,బావమరిది,మరదలికి | విశేష శాన్తి | విశేష శాన్తి | ముఖావలోకనం,జప హోమ తర్పణాదులు,సువర్ణదానం. |
| అనూరాధ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| జ్యేష్ఠ | అధికముగా దోషం | అధికముగా దోషం | అధికముగా దోషం | అధికముగాదోషం | ముఖావలోకనం,హోమశాన్త్యాదులు,వస్త్ర సహితరజితదానం. |
| మూల | తల్లిదండ్రులకు | తల్లిదండ్రులకు | తల్లిదండ్రులకు,ధనానికి | మాతృవర్గపితృవర్గం | ముఖావలోకనం,హోమశాన్త్యాదులు,సువర్ణమహిషదానం. |
| పూ.షా. | సామాన్య దోషం | సామాన్య దోషం | తల్లిదండ్రులకు | సామాన్య దోషం | ముఖావలోకనం,హోమశాన్త్యాదులు,చిత్రవస్త్రదానం. |
| ఉ.షా. | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| శ్రవణం | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| ధనిష్ఠ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| శతతార | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| పూ.భా. | సామాన్య దోషం | సామాన్య దోషం | సామాన్య దోషం | సామాన్య దోషం | ముఖావలోకనం,హరిద్రావర్ణవశితకస్త్రదానం. |
| ఉ.భా. | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | ------------------ |
| రేవతి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | తల్లిదండ్రులకు,శిశువుకు | ముఖావలోకనం,హోమశాన్త్యాదులు, వస్త్రసహిత రజితదానం. |

**పుత్రుడు జన్మించినపుడు చేయవలసిన విధి :**

పుత్రుడు జన్మించిన తోడనే శిశువు యొక్క ముఖమును తండ్రి చూడవలెయును. అట్లు చేయుటచే తండ్రికి తన పితృ ఋణం తీరును. పిదప పెద్దల యాజ్ఞననుసరించి తటాకమునందుగాని,బావియందుగాను,ఉత్తరాభిముఖుడై సచేల స్నానము చేసి భగవానుని ధ్యానించి తరువాత జాతకర్మ,నామకరణాదులు నిర్వహించి,గో,భూ,సువర్ణదానములు సమర్పించి,శిశువు యొక్క జననకాల లగ్నమును,తత్ ఫలితమును జ్యోతిష శాస్త్ర పండితుల దగ్గరకు వెళ్ళి తెలుసుకోవలయును.

శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం ! క్షత్రియాణాం గణస్తథా !
కన్యాదూరంతు వైశ్యానాం ! శూద్రానాం యోనిరేవచ !!

అను ప్రమాణము చే బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణపొంతన,వైశ్యులకు స్త్రీ దీర్ఘ పొంతన,శూద్రులకు యోని పొంతన పరిశీలించ వలయును.

## గ్రహమైత్రి పొంతన నిర్ణయం

| గ్రహములు | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| **మిత్రులు** | చం,కు,గు. | ర,బు. | ర,చం,గు. | ర,శు. | ర,చం,కు. | బు,శ. | బు,శు. |
| **సములు** | బు. | కు,గు,శు,శ. | శు,శ. | కు,గు,శ. | శ. | కు,గు. | గు. |
| **శతృవులు** | శు,శ. | లేరు. | బు. | చం. | బు,శు. | ర,చం. | ర,చం,కు. |

పై చక్రము నైసర్గికమగు శతృత్వమును,మిత్రత్వమును,సమత్వమును తెలియజేయునది.

**విశేష యోగమున శతృత్వ మిత్రత్వ నిర్ణయం :-**

1. రాశిచక్రమునందు గ్రహమునకు 2-3-4-10-11-12 స్థానములయందుగల గ్రహములు తాత్కాలిక మిత్రులగుదురు.
2. రాశిచక్రమునందు గ్రహమునకు 1-5-6-7-8-9 స్థానములయందుగల గ్రహములు తాత్కాలిక శతృవులగుదురు.
3. నైసర్గిక మిత్రులు తాత్కాలిక మిత్రులైన అధిమిత్రులగుదురు.
4. నైసర్గిక శత్రువులు తాత్కాలిక శత్రువులైన అధిశత్రువులగుదురు.
5. నైసర్గిక మిత్రులు తాత్కాలిక శత్రువులైన లేదా నైసర్గిక శత్రువులు తాత్కాలిక మిత్రులైన సములగుదురు.
6. నైసర్గిక సములు తాత్కాలిక శత్రువులైన శత్రువులే అగుదురు.
7. నైసర్గిక సములు తాత్కాలిక మిత్రులైన మిత్రులే అగుదురు.

వధూవరుల జన్మ రాశ్యధిపతులు/అంశ రాశ్యధిపతులు మిత్రులైన లేదా ఏక రాశ్యధిపతు లైననూ శుభప్రదము. రాశ్యధిపతులు శత్రువులైన పరస్పరం కలహం కలవారగుదురు.

**గణ పొంతన నిర్ణయం :-**

**శ్లో ॥ స్వగణంచోత్తమం ప్రీతి మధ్యమం దైవమానుషం ! అధమం దేవదైత్యానాం!**
**మృత్యోర్మానుష రాక్షసమ్ !! స్త్రీ రాక్షసం నకర్తవ్యం ! కర్తవ్యం పురుష రాక్షసమ్ !!**

వధూవరుల నక్షత్ర గణములు ఏక గణములైన ఉత్తమం,దేవ మనుష్య గణములైన మధ్యమం,దేవ రాక్షస గణములైన అధమం,మానుష రాక్షస గణములైన మరణప్రదం.

**పనికి వచ్చు రాక్షస గణములు :-** ఆశ్రేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతతార ఈ నక్షత్రములలో స్త్రీ రాక్షసమైనను దోషంలేదు. ఏకాధిపత్యమైనను,రాశి,నాడి,యోని, గ్రహమైత్రి మొదలయినవి శుభప్రదములైనపుడు స్త్రీ రాక్షసమైనను దోషము లేదు.

**స్త్రీ దీర్ఘ పొంతన నిర్ణయం :-**

**శ్లో॥ వధూనక్షత్రమారభ్య వరభంచోర్థ్వ సంస్థితం !**
**వరభం శుభదంప్రోక్తమితి దైవవిదాంవరైః !!**

వధూ నక్షత్రము నుండి వర నక్షత్రం వరకూ లెక్కించగా 1నుండి9 లోపల వచ్చిన కలహప్రదం,

10నుండి18 లోపల వచ్చిన మధ్యమ ఫలం, 19నుండి27 లోపల వచ్చిన పరిపూర్ణ శుభదాయకం. మరియూ వర నక్షత్రమునుండి వధూ నక్షత్రము వరకూ లెక్కించగా 13 నక్షత్రములపైన వచ్చిన పూర్తి సుఖదాయకం. వధూ నక్షత్రము నుండి వర నక్షత్రం వరకూ లెక్కించి 9చే భాగించగా 1 మృత్యువు. 2 ప్రేమ. 3 ఆపద, 4 సుఖం, 5 పీడ, 6 పశులాభం, 7 రోగప్రాప్తి, 8 ప్రజావృద్ధి, 9 శతృవృద్ధి.

**యోని పొంతన నిర్ణయం :-** కుక్క-లేడి, పాము-ముంగీస, సింహం- ఏనుగు, కోతి-మేక, గుఱ్ఱము-బఱ్ఱే, ఆవు-పులి, పిల్లి-ఎలుక ఇవి పరస్పర వైరములుగా గుర్తించ వలెను. పైన ఉదహరించిన విధంగా పరస్పర వైర నక్షత్ర సంబంధం కల్గిన వధూవరులు నిత్యం తగువులతో జీవింతురు.

**నాడీ పొంతన నిర్ణయం :-"భిన్ననాడి శుభావహమ్"** భిన్న నాడి అయినచో శుభప్రదం.

**ఆదినాడి దోష పరిహార నక్షత్రములు :-** ఉ॥ఫ॥, శతతార, పూ॥భా॥, పునర్వసు, ఆర్ద్ర, మూల, అశ్విని ఈ నక్షత్రములలో వధూవరుల నక్షత్రములుండిన నాడీ దోషం లేదు.

**మధ్యైకనాడి దోష పరిహార నక్షత్రములు :-** పూ॥షా॥, అనూరాధ, ధనిష్ఠ, పుష్యమి, చిత్త, పూ॥ఫ॥, మృగశిర ఈ నక్షత్రములలో వధూవరులుండిన నాడీ దోషము లేదు.

**పార్శ్వనాడి దోష పరిహార నక్షత్రములు :-** కృత్తిక, ఆశ్రేష, రోహిణి, మఘ, విశాఖ, శ్రవ ణం ఈ నక్షత్రములలో వధూవరులుండిన నాడీ దోషము లేదు.

**ఏక నక్షత్రమైన దోషము లేని నక్షత్రములు :-** విశా, ఆర్ద్రా, శ్రవణ, రోహి, పుష్య రేవతి, ఉ.భా. మఘ. ఈ నక్షత్రములలో వధూవరులకు ఏకనక్షత్ర దోషము లేదు.

**ఏకపాదమైన దోషము లేని నక్షత్రములు :-** కృత్తిక, పున, ఆశ్లే, పూఫ, చిత్త, స్వాతి, విశా, అనూ, ఉషా, శ్రవ, రేవ ఈ నక్షత్రములలో వధూవరులకు ఏకపాద దోషం లేదు.

**రాశి పొంతన నిర్ణయం :-** స్త్రీ రాశి నుండి పురుష రాశి వరకు లెక్కించవలయును.

2-12 మృత్యువు, 12-2 ఆయువు, 3-11 సౌఖ్యము, 11-3 దుఃఖము, 4-10 ప్రీతి, 10-4 హాని, 5-9 శుభం, 9-5 దరిద్రం, 6-8 లాభం (పాఠాంతరే కలహం), 8-6 పుత్ర లాభం, 7-7 శుభం, ఈ విధముగా రాశి కూటములు తెలియవలెను.

**పనికి వచ్చు ద్విర్వాదశములు (2-12):-** మీన-మేష. వృష-మిథు. కట-సిం. కన్యా-తుల. వృశ్చి-దను. మక-కుంభం. వీటిలో మొదటిది వధువు రాశి అయుననూ శుభప్రదము.

**పనికి వచ్చు ఏకాదశ త్రికములు (11-3) :-** వృష-కర్క. ధను-కుంభ. మక-మీనం. వీటిలో మొదటిది వధువు రాశి అయుననూ శుభప్రదము.

**పనికి వచ్చు దశ చతుర్థకాలు (10-4) :-** కటకం-మేష. వృష-కుంభ. కన్యా-మిథునం. మకరం-తుల. వృశ్చికం-సింహం. మీనం-ధనస్సు. వీటిలో మొదటిది వధువు రాశి అయుననూ శుభప్రదము.

**పనికి వచ్చు నవ పంచకములు (9-5) :-** కన్యా-వృష. కుంభ-తుల. వృశ్చి-కట. సింహ-మేష. కర్కా-మీనం. వీటిలో మొదటిది వధువు రాశి అయుననూ శుభప్రదము.

**పనికి వచ్చు షష్టాకములు (6-8) :-** వృష-తుల. వృశ్చి-మేష. కట-ధను. కన్యా-కుంభ. మీన-సింహ. మక-మిథు. వీటిలో మొదటిది వధువు రాశి అయుననూ శుభప్రదము.

**శ్లో ॥ ద్విర్ద్వాదశేవా నవ పంచమేవా ! షష్టాష్టకే రాక్షస కన్యకాయా ః !**
**ఏకాధిపత్యం ఉభయోస్సఖిత్వం ! పాణిగ్రహే మంగళ మాతనోతు !!**

ద్విర్ద్వాదశములైనను, నవపంచకములైనను, షష్టాష్టకములైనను, స్త్రీ రాక్షసమైనను, ఏకాధిపత్యమైనచో పై కూటములు దోషములు కావు. **( వసిష్ఠ సంహిత, విద్యామాధవీయం )**

## కుజదోషం వివరణ

**శ్లో॥ ధన వ్యయేచ పాతాళె జామిత్రె చాష్టమె కుజె !**
**స్త్రీణాం భర్తృ వినాశ స్స్యాత్పుంసాం భార్యా వినశ్యతి !!**

వధూవరుల జన్మజాతకములయందు లగ్నాదిగా 2,4,7,8,12, స్థానములలో కుజుడు ఉన్నయెడల కుజదోషము అనబడును. ఈ దోషము వరుని జాతకమునందు వుంటె భార్యా వియోగం, వధువు జాతకమునందు వుంటె భర్తృ వియోగం, వధూవరుల ఇద్దరి జాతకములయందు కుజదోషం వున్నట్లయితే పూర్తి శుభప్రదం.

**శ్లో॥ కన్యా మిధున యోర్వాపి తులా వృషభయోరపి ।**
**సంపూర్ణ దోష కారీ స్యాత్త్రిపాద్దోషం శనేర్గృహే ॥**
**దోషమర్ధం గురుక్షేత్రే స్వక్షేత్రే పాద దోషకృత్ ।**
**కుజః కటక లగ్నస్య సింహస్య చ న దోషకృత్ ॥**
**శ్లో॥ ద్వితీయే భౌమ దోషస్తు యుగ్మ కన్యకయోర్వినా ।**
**ద్వాదశే భౌమ దోషస్తు వృష తౌళిక యోర్వినా ॥**
**శ్లో॥ చతుర్ధే భౌమ దోషస్తు మేషవృశ్చిక యోర్వినా ।**
**సప్తమే భౌమ దోషస్తు నక్ర కర్కట యోర్వినా ॥**
**శ్లో॥ అష్టమే భౌమ దోషస్తు ధనుర్మీన ద్వయోర్వినా ॥**
**కుంభే సింహే న దోషస్స్యాత్ ప్రత్యక్షం దేవ కేరళే ॥**
**శ్లో॥ గురుమంగళ సంయోగే భౌమదోషో నవిద్యతే ।**
**చంద్రమంగళ సంయోగే భౌమదోషో నవిద్యతే ॥**

కన్యా, మిధున తులా, వృషభ లగ్న జాతకులకు కుజదోషము కలిగెనేని పరిపూర్ణముగా బాధించును. మకర కుంభ లగ్న జాతకులకు కుజదోషము కలిగెనేని ముప్పాత్రిక పాళ్ళు బాధ కలిగించును. ధనుర్మీన లగ్నజాతకులకు కుజదోషము కలిగెనేని అర్ధభాగము బాధ కలిగించును. మేష వృశ్చిక లగ్న జాతకులకు కుజదోషము కలిగెనేని పావు భాగము బాధ కలిగించును.

మిధున కన్యా లగ్న జాతకులకు ద్వితీయ భౌమదోషము వుండదు. వృషభ తులా లగ్న జాతకులకు ద్వాదశ భౌమదోషము వుండదు. మేష వృశ్చిక లగ్నజాతకులకు చతుర్ధ భౌమదోషము వుండదు. మకర కర్కాటక లగ్న జాతకులకు సప్తమ భౌమదోషము వుండదు. ధనుర్మీన లగ్నజాతకులకు అష్టమ భౌమదోషము వుండదు. కుంభలగ్నజాతకులకు సింహ లగ్నజాతకులకు ఏ స్థానమందు కుజుడు వున్ననూ కుజ దోషము వుండదు.

కుజుడు గురునితో చేరినప్పుడు లేదా, చంద్రునితో చేరినప్పుడు కుజ దోషము వర్తించదు. కావున పండితులు జాతకములను పరిశీలించునప్పుడు పై ఆధారములను కూడా గమనించి ఫలిత నిర్ధారణ చేయగలరు. **( వసిష్ఠ సంహిత, నారదసంహిత, దేవకేరళం.)**

**కర్తరి విశాఖలలో చేయకూడనివి :-** చెట్టు నరుకుట, నూతన వస్త్రధారణం, గర్భదానం, కత్తితో చేయు పనులు, ఓడిబియ్యం, మట్టెలు, పుట్టు వెంట్రుకలు, స్తంభం, కడప, వ్యవసాయారంభం, గృహారంభం, కోత్త ధాన్యం భుజించుట, ఆరామ తటాక కూపములు తవ్వుట, కొత్త బండినెక్కుట చేయకూడదు.

**కర్తరి లో చేయదగినివి :-**

**మౌంజీబంధే వివాహేచ ప్రవేశే యజ్ఞకర్మణి ! భరణీ కృత్తికా చైవ న దోషో మండపాదిషు !!**

ఉపనయనం, వివాహం, గృహప్రవేశం, యజ్ఞం, మండపాదులు గట్టుట చేయవచ్చును.

**మౌఢ్యమిలో చేయగూడని పనులు :-** గర్భదానం, ఓడిబియ్యం, మట్టెలు, పుట్టువెంట్రుకలు, స్తంభం, కడప, వ్యవసాయారంభం, గృహారంభం, కోత్త ధాన్యం భుజించుట, ఆరామ తటాక కూపములు తవ్వుట, కొత్త బండినెక్కుట, ఉపనయనం, వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠలు మొదలగు శుభకార్యక్రమములు చేయకూడదు.

**మౌఢ్యమిలో చేయదగినవి :-** దేవతాపూజ, ప్రాయశ్చిత్తము, నక్షత్ర శాంతులు, దోష శాంతులు, మాస ప్రయుక్త పుంసవనాది కార్యక్రమాలు చేయుటకు మౌఢ్యదోషము లేదు.

**వర్జ్యంలో చేయదగినవి :-** స్నానము, దానము, జపము, నిత్యకర్మలు, దేవతాపూజ, ప్రాయశ్చిత్తము, భుజించుట, మల, మూత్ర విసర్జన చేయుటకు వర్జ్యదోషము లేదు.

**జన్మనక్షత్రమందు చేయుదగినవి :-** నిషేకము, చౌలము, త్యాగము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, అక్షరాభ్యాసము, పట్టాభిషేకము చేయవచ్చును. స్త్రీలకు వివాహం శ్రేష్టం కాని **జన్మతారయందు** కాకుండా **అనుజన్మతారయందు** చేసిన శ్రేష్ఠం.

**జన్మ నక్షత్రమందు చేయగూడనవి :-** గర్భాదానము,వివాహం,పుంసవనము,సీమంతము, ప్రయాణం, ఔషధ సేవ,క్షౌరం చేయకూడదు.

**నామ నక్షత్ర అవసరము :-** ఊరచ్చుబాటు,గ్రామార్వణము,గృహ పథకమునకు, యుద్ధమునకు, జ్వరమునకు వ్యవహారమునకు,దూత కార్యము చేయుటకు దానం చేయునప్పుడు మంత్రమునందు, దేవతాపూజలందు,భూమి కొన్నప్పుడు జన్మనామము ఉన్ననూ పేరు మాత్రమే ప్రధానము కాని జన్మనక్షత్రము కాదు.

**జన్మ నక్షత్ర అవసరము :-** గృహ నిర్మాణ, గృహ ప్రవేశ, పట్టబంధ, రాజ్యాభిషేక, వ్యవసాయ ఆరంభ, ఉపనయన, అన్నప్రాశనం, ఆభరణములు ధరించుటకు, వివాహమునకు జన్మనామము చూచుకోవలెను.

**విషకన్యా దోష విషయం :-** మూలా నక్షత్రం 1-2-3 పాదములందు పుట్టిన కన్య మామను ఆశ్లేష 1వ పాదము విడచి తక్కిన మూడు పాదములందు జన్మించినది అత్తను జ్యేష్ట 4వ పాదము కలిగిన యువతి బావను, విశాఖ 2వ పాదమున జన్మించిన స్త్రీ మరిదిని హరించును పై నక్షత్రములయందు మిగిలిన పాదములయందు దోషములేదు. ఈదోషము వివాహమప్పుడేనని గ్రహించ వలయును. ఈ అంశము స్త్రీలవరకే వర్తించును.

## వివాహ కన్యకు బదులు పేరు పెట్టుటకు విధి

వివాహ సమయమునందు పురోహితుడు జలముతో కూడిన కొత్త కలశమున మర్రి, మామిడి, జువ్వి, నేరేడు, రావి చెట్ల యొక్క బెరడు, తెల్లని ఆవగింజలు, గరిక, రావి చిగుళ్ళతో అలంకరించిన ఆ కలశోదకముచే కన్యకను ప్రోక్షించి ఒక ముత్తైదువుచే కొత్త పేరుతో పిలిపించవలెయును.

**వివాహానంతరము చేయగూడని పనులు :-** కర్ణవేద, ఉపనయనము, ఉద్యాపనలు, తీర్థ యాత్రలు, పుట్టు వెంట్రుకలు, గంగాస్నానము, క్షౌరం, గయాశ్రాద్ధం, పిండ ప్రదానములు, ఆరు నెలలలోగా మళ్ళీ వివాహాది శుభకార్యములు చేయకూడదు.

**ఏకోదర వివాహ విషయం :-** ఒక తల్లి పిల్లలకు ఒకే సమయమున ఒకే సంస్కారము చేయకూడదు. ఆరు మాసముల తర్వాతగాని, ఒక సంవత్సర భేదమునగాని చేయ వచ్చు. అన్నదమ్ములకు అక్క చెల్లెండ్లను ఇవ్వకూడదు. అట్లు చేసిన ఒకరు నష్టపోదురు. ముహూర్త భేదమైనను, స్థల బేధమైనను ఇద్దరు కూతుళ్ళకు చేయవచ్చును. కూతురుని ఇచ్చినవారి ఇంటి నుండి తన కూమారునకు కన్యను తేకూడదు. బదులు వివాహం చేయకూడదు. మొదలు ఇచ్చిన పుత్రిక జీవించియుం డగా తిరిగి ఆతనికే ఇంకో పుత్రికను ఇవ్వకూడదు. జ్యేష్ట పుత్రపుత్రికాదులను విడిచి చిన్నవానికి చేయకూడదు. పుత్రుని వివాహం తర్వాత పుత్రిక వివాహం చేయకూడదు. పుత్రిక వివాహానంతరము పుత్రునకు కేశఖండనము, ఉపనయనము చేయకూడదు. ముందు కేశఖండనము చేసిన తర్వాత పుత్రిక వివాహం చేయవలెను. ఒక సంవత్సరం కన్నా ముందుగాని లేక ఒకే వేదికపై గాని 3 శుభ కార్యక్రమములు ఒకేసారి చేయకూడదు.

**తండ్రి మొదలగువారు మరణించిన పిమ్మట వివాహమునకు తగిన కాలము :-** తండ్రి చనిపోయిన యెడల ఒక సంవత్సరము, తల్లి మరణించిన ఆరు మాసములు, భార్య గతించిన మూడు మాసములు, సహోదరులుగాని, పుత్రులుగాని మృతి చెందిన ఒకటిన్నర మాసము, ఇతర జ్ఞాతులు మరణించిన ఒక మాసము విడిచిపెట్టి తరువాత వివాహము చేసుకోవలెను. ఈ విధముగా విడిచిపెట్టుటకు వీలుగాని

పరిస్థితి ఏర్పడిన పండితులను కలిసి **వినాయకశాన్తి** చేసి, తిలయుక్త సువర్ణాన్ని దానము చేసి శుభకార్యము చేయవచ్చును. పెండ్లినాడు మొదలు నాలుగు రోజుల లోపు తద్దినము కాని, అమావాస్య కాని వచ్చిన ఆకన్యకు దుఃఖము సంభవించును. ఒకవేళ భర్తకు హాని కలుగుట కాని లేక సంతాన హీనురాలగుటగానీ జరుగునని శాస్త్రవచనం.

**వివాహమైన సంవత్సరమున వధువు అత్తవారింట, పుట్టినింట వుండు మాసముల వలన కలుగు దోష విషయము :-** వివాహం అయిన సంవత్సరములో కొత్త కోడలు అత్తవారింట ఆషాఢ మాసమునందు ఉన్న యెడల అత్తకు కీడు, ఇట్లే క్షయమాసమందు ఉన్న యెడల తనకు జ్యేష్ఠమాసమందు బావకు, పుష్యమాసమునందు మామకు, అధికమాసము నందు భర్తకు హాని సంభవించును. చైత్రమాసమున పుట్టింట ఉన్నయెడల తండ్రికి కీడు కలుగును.

## త్రిజ్యేష్ట వివరము

**శ్లో॥ జ్యేష్ఠే మాసి కరగ్రహో నశుభకృజ్జ్యేష్ఠాంగనా పుత్రయోః ।**
**జ్యేష్ఠేమాస్యపి జాతయోశ్చయదివా జ్యేష్ఠోడు సంభూతయోః ।**
**దంపత్యోర్యది యోన కేన విధినా జ్యేష్ఠాత్రయం చాస్తిచే ।**
**త్రిజ్యేష్ఠాహ్వయదోషదోహి సతతం నాపాద్యగర్భద్వయే ॥**

అద్యగర్భ ప్రసూతాయాః కన్యకాయా పరస్యచ । జ్యేష్ఠమాసే నకుర్వీత కదాచిదపి మంగళమ్ ॥ **॥కాలామృతం॥**

ప్రథమగర్భంలో జన్మించిన వరుడు, ప్రథమగర్భంలో జన్మించిన వధువునకు జ్యేష్ఠమాసము యందు వివాహము చేయుటను లేదా వధూవరులలో ఒకరు ప్రథమగర్భ జనితులు, మరొకరు జ్యేష్ఠానక్షత్ర జాతకులైనప్పుడు జ్యేష్ఠమాసము యందు వివాహము చేయుటను త్రిజ్యేష్ట అందురు. ఇటువంటి సమయమున జ్యేష్ఠమాసముయందు కాక వేరొక మాసమందు వివాహము చేసిన త్రిజ్యేష్ఠ దోషముండదు. దీనియందు జ్యేష్ఠం ఒక్కటి శుభప్రదం. రెండు జ్యేష్ఠములు మధ్యమము. మూడు జ్యేష్టములు హాని కలుగును. ఒకరు జ్యేష్ఠులై ఇంకొకరు ద్వితీయ గర్భ సంజాతులైన దోషము లేదు.

## వివాహ విషయమై వైశ్యుల గోత్ర సందేహ నివృత్తి

నాయక ప్రథమంబు నారీతృతీయంబు, మానుగా గూడిన మనుమరాలు పురుషునిది మూడోది పూబోణి మొదటిది, దనరంగ గలసిన తల్లివావి పిల్లవానిది రెంట పిల్లది మూడింట పోసగజేసిన నాతి పుత్రికయగును. పరగనాథుని మూట పడుచుదిరెంటను సమరిన నామె మేనత్తయగును కూడనొక పతిసతీ రెంట కోడలగును. వరుని రెంటను సతియాది మరదయ్యె పిల్లలిద్దరు నొకటైన చెల్లెలగును. వైశ్య గోత్రంబు లీరీతి వరుసదెలసీ పెండ్లి జేసిరి తగునని పెద్దలపుడు.

**శుభప్రదమైనవి**

1. వరుని **2** వ గోత్రం వధువు **1** వ గోత్రం అయినప్పుడు **మరదలు** వరుస అగును.
2. వరుని **1** వ గోత్రం వధువు **2** వ గోత్రం అయినప్పుడు **కోడలు** వరుస అగును.
3. వరుని **3** వ గోత్రం వధువు **2** వ గోత్రం అయినప్పుడు **మేనత్త** వరుస అగును.
4. వరుని **1వ** గోత్రం వధువు **3వ** గోత్రం అయినప్పుడు **మనుమరాలు** వరుస అగును.

**కావున వివాహమునకు పనికివచ్చును.**

**అశుభప్రదమైనవి**

1. వరుని **3** వ గోత్రం వధువు **1** వ గోత్రం అయినప్పుడు **తల్లి** వరుస అగును.
2. వరుని **1** వ గోత్రం వధువు **1** వ గోత్రం అయినప్పుడు **చెల్లెలు** వరుస అగును.
3. వరుని **2** వ గోత్రం వధువు **2** వ గోత్రం అయినప్పుడు **చెల్లెలు** వరుస అగును.
4. వరుని **2వ** గోత్రం వధువు **3వ** గోత్రం అయినప్పుడు **పుత్రిక** వరుస అగును.
5. వరుని **3వ** గోత్రం వధువు **3వ** గోత్రం అయినప్పుడు **చెల్లెలు** వరుస అగును.

**కావున వివాహమునకు పనికిరాదు.**

## రాహుకాల - దుర్ముహుర్త చక్రము

| వారం | దుర్ముహూర్తం | రాహు | వారం | దుర్ముహూర్తం | రాహు |
|---|---|---|---|---|---|
| **ఆది** | సా.4-24 | సా.4-30 | **గురు** | ఉ.10-00, మ.2-48 | మ.1-30 |
| **సోమ** | మ.12-24, మ.2-48 | ఉ.7-30 | **శుక్ర** | ఉ.8-24, మ.12-24 | ఉ.10-30 |
| **మంగళ** | ఉ.8-24, రా.10-48 | మ.3-00 | **శని** | ఉ.6-00, ఉ.6-48 | ఉ.9-00 |
| **బుధ** | ఉ.11-36 | మ.12-00 | | | |

ప్రతీది ప్రారంభ సమయం. దుర్ముహూర్తము 0-48 ని॥ రాహుకాలం 1-30 ని॥ ఉండును.

## స్ఫుటలగ్న పుష్కరాంశ ప్రమాణములు

| లగ్నం | ప్రమాణములు | | పుష్కరాంశ | | లగ్నం | ప్రమాణములు | | పుష్కరాంశ | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఘ.వి. | గ॥ని॥ | ఘ.వి. | గ॥ని॥ | | ఘ.వి. | గ॥ని॥ | ఘ.వి. | గ॥ని॥ |
| **మేషం** | ౪-౨౨ | 1-45 | ౩-౦౩ | 1-13 | **తుల** | ౫-౨౬ | 2-10 | ౪-౨౧ | 1-45 |
| **వృషభం** | ౫-౦౧ | 2-00 | ౨-౨౦ | 0-56 | **వృశ్చికం** | ౫-౩౪ | 2-14 | ౧-౧౮ | 0-31 |
| **మిథునం** | ౫-౩౦ | 2-12 | ౪-౨౪ | 1-46 | **ధనుస్సు** | ౫-౧౭ | 2-07 | ౩-౪౧ | 1-29 |
| **కర్కాటకం** | ౫-౩౦ | 2-12 | ౧-౧౭ | 0-31 | **మకరం** | ౪-౩౯ | 1-52 | ౨-౧౦ | 0-52 |
| **సింహం** | ౫-౧౮ | 2-07 | ౩-౪౩ | 1-29 | **కుంభం** | ౪-౦౮ | 1-39 | ౩-౧౮ | 1-19 |
| **కన్య** | ౫-౧౫ | 2-06 | ౨-౨౭ | 0-59 | **మీనం** | ౪-౦౧ | 1-36 | ౦-౫౬ | 0-22 |

## ఘాత చక్రము

| రాశి | తిది | వారం | నక్ష | చన్ద్ర | రాశి | తిథి | వారం | నక్ష | చన్ద్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| **మేషం** | షష్టి | ఆది | మఘ | ౧ | **తుల** | ద్వాద | గురు | శత | ౩ |
| **వృషభం** | చవితి | శని | హస్త | ౫ | **వృశ్చికం** | దశమి | శుక్ర | రేవతి | ౭ |
| **మిథునం** | అష్టమి | సోమ | స్వాతి | ౯ | **ధనస్సు** | విదియ | శుక్ర | భరణి | ౪ |
| **కర్కాటకం** | షష్టి | బుధ | అనూ | ౨ | **మకరం** | ద్వాద | మంగ | రోహి | ౮ |
| **సింహం** | నవమి | శని | మూల | ౯ | **కుంభం** | చవి | గురు | ఆర్ద్ర | ౧౧ |
| **కన్య** | అష్టమి | శని | శ్రవ | ౧౦ | **మీనం** | తది | శుక్ర | ఆశ్లే | ౧౨ |

**ఘాతవారమందు చేయగూడనివి :-** గృహ ప్రవేశము, వ్యాపారారంభము, యాత్రలు, బావిత్రవ్వుట, ప్రయాణం చేయకూడదు.

**ఘాత వారమందు పనికి వచ్చునవి :-** వివాహము, ఉపనయనము, పట్టాభిషేకము, సీమంతము, జాతకర్మ, పుంసవనము చేయుటకు దోషము లేదు.

# శుభ కార్యక్రమములకు శుభసమయములు



**వివాహము :-** మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ మాసములు శ్రేష్ఠం, మార్గశిర, కార్తీక మాసములు మధ్యమం, చైత్ర, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వీయుజ మాసములు అధమములు, శుక్ల పక్షములో విదియ,తదియ,పంచమి,సప్తమి, నవమి, దశమి,త్రయోదశి, చతుర్దశి, పౌర్ణిమ తిథులు, బహుళ పక్షములో పాడ్యమి, విదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి తిథులు ఆది, బుధ, గురు, శుక్ర, శనివారములు, అశ్విని,రోహిణి,మృగశిర,మఖ,ఉత్తర, హస్త,స్వాతి,అనూ, మూల,ఉ॥షాఢ, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు, మేష, వృషభ, మిధున, కర్కాటక, సింహ,తుల,కన్య,ధను, మీన లగ్నములు మంచివి. సప్తమ (7)వ స్థానములో ఏగ్రహము లేకుండా ఉండవలెను. మీనరాశిలో సూర్యుడు ఉండగా చైత్రమాసం వచ్చిన ఆ మాసమునందు ముహూర్తం పెట్టరాదు. అష్టమశుద్ధి చూడవలయును. కుమార్తె వివాహానంతరం కుమారుని వివాహం చేయవలెను. కుమారునకు ముందు ఉపనయనం చేసి తర్వాత కుమార్తెకు వివాహం చేయవచ్చును. ఏకోదరులకు 6 నెలలు లోపున వివాహం చేయరాదు. కాని ఫాల్గుణ మాసమందు ఒకరికి, మీనేతర చైత్రమాసమందు ఒకరికి వివాహం చెయ్యవచ్చును. ఒకే ఇంటికి అన్నదమ్ములకు అక్కచెల్లెండ్రనిచ్చి వివాహం చేయరాదు. ఇద్దరు సోదరులకు ఒకే లగ్నములో ఒకే ఇంటిలో వివాహముగాని, ఉపనయనముగాని చేయరాదు. ఒకే లగ్నమందు కుమార్తెకు, కుమారునకు వివాహం చేయరాదు. ఒకే ఇంటియందు (ఒకే ఆవరణలో) మూడు వివాహములు చేయరాదు.

**పునర్వివాహము :-** భార్య పోయినవారు మరల వివాహము చేసు కొనదలచిన యెడల చనిపోయిన భార్యయొక్క సంతానం జీవించియున్న బేసి మాసం-బేసి సం॥రములయందు, సంతానము లేనియెడల సరిమాసము, సరి సంవత్సరములయందు వివాహం చేసుకొనవలెను.

**నిశ్చయ తాంబూలములకు :-** ఉభయ పక్షముల యందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, శుక్ల పక్షమున ఏకాదశి, త్రయోదశి, పౌర్ణమి తిథులయందు, అశ్వని, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శతభిష నక్షత్రములయందు, ఆది, బుధ, గురు, శుక్ర, శనివారములయందు, లగ్నమునకు 5-9 స్థానముల యందు పాపగ్రహములు లేకుండగను నిశ్చయ తాంబూలములు తీసుకొనుటకు శుభప్రదము.

**పెండ్లి కుమారుని, పెండ్లి కుమార్తెను చేయుటకు :-** మంచి తిథులతో కలిసిన ఆది, బుధ, గురు, శనివారములు, పునర్వసు, పుష్య, అశ్వ, అనూ, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధనిష్ఠ ఈ నక్షత్రములు మంచివి. మంగళవారం పెండ్లికుమారుని పెండ్లికూతురుని చేయరాదు. పసుపు కొమ్ములను కొట్టరాదు. సోమ, శుక్రవారములు మధ్యమము.

**పెండ్లిపీట :-** పెండ్లిపీట 6 అంగుళముల ఎత్తు, 8 అంగుళముల వెడల్పు, 37 అంగుళముల పొడవు ఉండునట్లు చేయించవలెను.

**గర్భాధానము :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, రోహిణి, మృగ, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, ధని, శత, ఉ॥భాద్ర నక్షత్రములు, వృష, కర్కాటక, కన్య, తుల, ధను, మీనలగ్నములు, లగ్నశుద్ధి, అష్టమశుద్ధి యుండవలెను. పంచపర్వములు, వ్రత దినములు, శ్రాద్ధ దినములు, సంధ్యా సమయం పనికిరావు. గురు, చంద్ర, శుక్రబలములు ఉండవలయును. ఇరువురిలో ఏ ఒక్కరికి నైధనతార కాకూడదు. వివాహము అయిన 16 రోజుల లోపున ముహూర్తములు చూడనవసరములేదు.

**సత్యన్నారాయణ వ్రతము చేసుకొన్న రోజున రాత్రి గర్భాధానము చెయరాదు.**

**గర్భాధానము అయిన తర్వాత మరుసటి రోజున సత్యన్నారాయణ వ్రతము చేసుకొనవచ్చును.**

**నిషేకము :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వ, రోహిణి, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, శత, ఉ॥భాద్ర నక్షత్రములు, వృషభ, మిధున, కర్కా, కన్య, తుల,ధను, మీన, లగ్న ములు, లగ్నశుద్ధి తప్పనిసరి. సంధ్యా, పర్వ, వ్రత, శ్రాద్ధ దినములు, పగటి వేళలు పనికిరావు. వయోవతియైన స్త్రీ రజస్వల కాలస్యముగా నున్నచో భర్తతో కలుపుటను నిషేకమందురు.

**వివాహానికి మృతాశౌచ శంక :-** వివాహ విషయములో తండ్రి మరణించిన యెడల 1 సం॥రం, తల్లి మరణించిన 6 మాసములు, భార్య మరణించిన 3 మాసములు, పుత్రులుగాని, సోదరులుగాని మరణించిన ఒకటిన్నర మాసములు, ఇతర జ్ఞాతులు మరణించిన ఒక మాసం విడిచిపెట్టి వినాయక శాన్తి చేసి వివాహం చేసుకొనవచ్చును.

**నవ వధూ ప్రవేశము :-** వివాహము జరిగిన 6వ రోజున మొదలు 16 రోజులు లోపున గృహప్రవేశము చేయు వారు తిథి వారాది నక్షత్రములను పాటించక గృహప్రవేశము చెయ్యవచ్చును. ముహూర్తములు చూడనవసరములేదు. తరువాత అయినచో విషమ వర్ష, మాసాదులు చూసుకోవలయును.

విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులు, బుధ, గురు, శుక్రవారములు, అశ్వ, రోహిణి, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవణం, మఖ, మూల, పున, జ్యేష్ఠ, ధని, రేవతి నక్షత్రములు, వృషభ, మిధు, కర్కా, సింహ, వృశ్చిక, ధను, కుంభ, మీన లగ్నములు, ద్వాదశ శుద్ధి తప్పనిసరిగా చూడవలయును.

కొత్త పెండ్లికూతురు పెండ్లియైన మొదటి సం॥రములో అత్తవారింట జ్యేష్ఠ మాసములోయున్న బావగారికి, పుష్య, ఆషాఢ మాసములో మామగారికి, అధిక మాసములో అత్త వారింట యున్న భర్తకు, క్షయమాసములో తనకు కీడు సంభవించును.

**నవ వధువు పుట్టింట ఉండదగనిది :-**పెండ్లియైన మొదటి చైత్రమాసములో పుట్టింట యుండరాదు. ఉన్న తండ్రికి లేదా కుటుంబ యజమానికి హాని కలుగును.

**గాజులు పెట్టుటకు :-** 5 వ నెలలో గానీ 7 నెలలో గానీ (బేసి నెలలలో) పెట్టవలెను.

**పుంసవన, సీమంతములు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి తిథులు, బుధ, గురు, శుక్ర వారములు, రోహిణి, హస్త, చిత్త, స్వాతి, పుష్య, ఉత్తరాత్రయం, పునర్వసు, అనూ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు, మేష, మిధున, తుల, ధను, కుంభ లగ్నములు శుభం. **పుంసవనమునకు** 3వ మాసం, **సీమంతమునకు** 4-6-8 మాసములు మంచివి.

## పురిటి విషయములు



**గర్భవతియైన స్త్రీని పురిటికి తీసుకొని వచ్చుటకు :-** తిథి-వార- నక్షత్రములు మంచివి చూసి 7వ మాసమునందుగాని, 9వ మాసం రాగానే పుట్టింటికి తీసుకొని రావలెను. **మొదటి రెండు పురుళ్లు పుట్టింట్లోను, మూడవ పురుడు అత్తవారింటిలోను పోయవలెను.**

**బాలింతరాలికిపథ్యము :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పౌర్ణమి తిథులు, బుధ, గురు, శుక్రవారములు, పున, పుష్య, ధని, మృగ, హస్త, చిత్త, స్వాతి, రోహి, శ్రవ, శత, ఉత్త, ఉ॥షాఢ,ఉ॥భాద్ర, అనూ,రేవతి నక్షత్రములందు శుభం. దశమ స్థానమందు గ్రహములు లేకుండా ఉండవలయును.

**బాలింతరాలికి స్నానమునకు :-** పురుడు అయిన 11వ రోజుననే చేయించవలెను, ఒకవేళ అట్లు కుదరని ఎడల ఆది, సోమ, మంగళ, గురువారములు, హస్త, మృగ, అనూ, రోహి, రేవతి, అశ్వ, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, స్వాతి నక్షత్రములు శుభం.

**బాలింతరాలు నీళ్ళు తోడుటకు :-** పునర్వసు, పుష్యమి, హస్త, మృగ, మూల, అనూ,శ్రవణ నక్షత్రములు, సోమ, బుధ, గురువారములు, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులయందు, 21-23-25-27-29 రోజులలో బాలింతరాలచే జలపూజ చేయించి నూతిలో చాద వేయించి నీరు తోడించవలెను.

**స్త్రీలు ఆభరణములు ధరించుటకు :-** అశ్వ, ధని, రేవ, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ నక్షత్రములందు స్త్రీలు వెండి-బంగారు రత్నాభరణములు, నూతన వస్త్రములు ధరించిన మంచిది.

**ధరించకూడని నక్షత్రములు :-** రోహి, ఉత్తరాత్రయం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పునర్వసు, పుష్యమి, నక్షత్రముల యందు, మంగళ వారమునందు సౌభాగ్యవతియగు స్త్రీ నూతన వస్తు వస్త్రములు ధరించకూడదు.

**స్త్రీలు కొత్తకాటుక వాడుటకు :-** అశ్విని, చిత్త, స్వాతి, విశా, అనూ, ధని , రేవతి ఈ నక్షత్రములయందు, శుక్ర, శని, ఆదివారముల యందు స్త్రీలు కొత్తకాటుకను వాడుటకు శ్రేష్టము.

## బిడ్డల విషయమై శుభాశుభములు



**శిశువును ఉయ్యాలలో వేయుటకు :-** శిశువును జననాదిగా 11వ రోజునగాని, 21వ రోజునగాని 29వ రోజునగాని, 1,3,5 నెలలలో,వర్జ్యం, దుర్మహూర్తం లేకుండా ముహూర్త నిర్ణయముచేసి శిశువు యొక్క తల్లిగాని, పెద్దముత్తైదువుగాని శిశువు యొక్క శిరస్సు తూర్పు దిక్కుగా ఉండునట్లుగా చూచి బిడ్డను ఉయ్యాలలో పరుండబెట్టవలెను. విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వని, రోహిణి, మృగ, పున, పుష్య, హస్త ,చిత్త, అనూ, ఉత్తరాత్రయం, రేవతి నక్షత్రములు, వృష, మిధున, కర్కా, కన్య, తుల, ధను, మీన లగ్నములు శుభం, అష్టమశుద్ధి తప్పనిసరిగా చూడవలెను.

**శిశువునకు మొలత్రాడ కట్టుటకు:-**అశ్వ, రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, అనూ, మూల, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు, మంగళవారం పురిటి శుద్ధి రోజున మంచిది. వెండి లేక బంగారు మొలత్రాడు 5వ మాసమందు కట్టవలెను. మొలత్రాడు నకు నల్లపూసలు, రాగికాణి, శిశువుయొక్క పురిటి సమయ మందు తీసిన బొడ్డుగాని కట్టిన గాలి దోషములు, దృష్టిదోషములు తొలగును.

**బిడ్డను ఇల్లు కదుపుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పౌర్ణిమ తిధులు, అశ్వ, రోహి, పున, పుష్య, మృగ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధనిష్ట, శత, రేవతి నక్షత్రములు, మేష, వృషభ, కర్కా, తుల, ధను, మీన లగ్నములు,సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి. శిశువుపుట్టిన 3వ మాసములో ఇంటినుండి బయలుదేరి మొదట దేవాలయమునకు తీసుకొని వెళ్ళి ఆపైన మేనమామ ఇంటికి తీసుకొని వెళ్ళవలెను.

**శిశువుతో అత్తవారింటికి వెళ్ళుటకు :-** పైన తెలిపిన వారములు తిథులు, నక్షత్రములయందు, శిశువుకు,తల్లికి తారాబలం–ఆనందాదియోగం చూచుకొని, 3,5,7,9,11 బేసి నెలలయందు వెళ్ళవలెను. వారశూల లేకుండా చూడవలెను. బేసి నెలలలో శూన్య మాసము, మూఢమి వచ్చినను వెళ్ళవచ్చును.

**సూర్య చంద్రుల దర్శనము :-** శిశువు జన్మించిన 3వ నెలలో మంచి తిథి–వార–నక్షత్రములు చూసి సూర్య చంద్రులను చూపించవలెను.

**నామకరణము :-** నామకరణము అనగా బిడ్డకు పేరు పెట్టుట. ఈ కార్యమును పురిటిశుద్ధి అనంతరం బాలసారె రోజున 11–21–29 రోజులలో లేదా 1,3వ నెలలో చేయవలయును. బాలసారె రోజున నామకరణము. గ్రహశాంతులు మొ॥ జరిగించుట శుభం. విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి,త్రయోదశి తిథులయందును, అశ్వ, రోహి, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, శ్రవ,ధని, శతభిష నక్షత్రములు, వృషభ, మిధువ, కర్కా, కన్య, తుల, ధను, మీనలగ్నములు, అష్టమశుద్ధి, పక్షచ్ఛిద్రముకాని దినములు చూడవలయును.

**శిశువును భూమిపై కూర్చుండబెట్టుటకు :-** అశ్వని, మృగ, పుష్య, జ్యేష్ట నక్షత్రములు మంచివి. కుంచెడు ధాన్యం రాశిగా పోసి దానిపైన నూతన వస్త్రము వేసి, 5వ నెలలో శిశువును దానిపై కూర్చుండబెట్టవలెను. పెద్దలచే ఆశీర్వాదము చేయించవలెను.

**అన్నప్రాశన :- పురుషులకు సరిమాసం, స్త్రీలకు బేసిమాసం చూడవలయును.** లగ్నశుద్ధి, దశమశుద్ధి చూడవలయును. మగపిల్లవానికి 6,8,10,12, సరి మాసములలో చెయ్యవలెను. ఆడపిల్లకు 7,9,11 బేసి మాసములలో చెయ్యవలెను.

విదియ, తదియ, పంచమి, సప్తమీ, దశమి త్రయోదశి తిధులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వని, రోహిణి, మృగ, పున, పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉ॥షాఢ, శ్రవ, ధని, శత, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు; వృషభ, మిధున,కర్కా, కన్య, ధను, మీన లగ్నములు శుభం.



**కేశఖండనము (పుట్టు వెంట్రుకలు) :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిధులు,సోమ,బుధ, గురు,శుక్రవారములు; అశ్వని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని,శత, రేవతి నక్షత్రములు; వృషభ, మిధున, కర్కా, కన్య, తుల, ధను, మీనలగ్నములు; ఉత్తరాయణమునందు, 1,3,5 సంవత్స రములలో చేయవలెను. అష్టమశుద్ధి చూసి **పురుషులకు**

**సరిమాసం, స్త్రీలకు బేసిమాసం చూడవలయును.** పుణ్యక్షేత్రములలో కూడ జరిపించవచ్చును. శిశువు యొక్క తల్లి 5 మాసములుదాటి గర్భవతియైన యెడల పుట్టు వెంట్రుకలు తీయించరాదు. 5 సం॥లు దాటిన (పిల్ల) పిల్లవానికి తల్లి గర్భవతి యైననూ కేశఖండన చేయవచ్చును.

**చెవులు కుట్టుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వని, మృగ, పున, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, అనూ, ఉ॥షాఢ, శ్రవ, ధని, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు వృషభ, మిధు, కర్కాటక, కన్య, ధను, మీనలగ్నములు, 6,7,8 మాసములందు జరిగించవలెను. అష్టమశుద్ధి, గురుబలం ఉండవలెను.

**కన్యలకు ముక్కు కుట్టుటకు :-** అశ్వ, మృగ, పున, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, శ్రణ, ధని, శతభిష, రేవతి నక్షత్రములయందు, శుక్ల పక్షమునందు ముక్కు కుట్టవలెను.

**అక్షరాభ్యాసం :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు, సోమ, బుధ, గురు, శుక్ర వారములు, అశ్వని, పున, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, రేవతి, నక్షత్రములు, మేష, కర్కా, తుల, మకర లగ్నములు; అష్టమ శుద్ధి కావలెను. ఉత్తరాయణములోను, 5వ సం॥రమున జరిగించవలయును. గురు, శుక్ర మూఢములలో చేయకూడదు.

**ఉపనయనము :-** 2,3,5,7,10 కృష్ణపక్షమున 2,3 తిథులు; బుధగురు, శుక్రవారములు, అశ్వ, రోహి, మృగ, పున, పుష్య,ఉత్త,హస్త, అనూ స్వాతి, ఉ॥షాఢ, శ్రవ, ధని, శత, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు, వృషభ, మిధున, కర్కాటక, కన్య, ధను, మీనలగ్నములు, అష్టమశుద్ధి చూడవలయును. అనధ్యయనం కూడదు. మీనచైత్రం దీనికి శుభప్రదము. గ్రహబలం, తల్లిదండ్రులకు తారాబలం చూడవలెను. కేంద్రమున పాపులుండకూడదు. ఉత్తరాయణమందు చెయ్యవలెను.

**దత్తత స్వీకారము :-** 2,3,5,7,10 శుద్ధ ఏకాదశి, త్రయోదశి తిథులు, రోహి, పున, పుష్య, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, హస్త, స్వాతి, అనూ, శ్రవణం, ధనిష్ట, శత, రేవతి, నక్షత్రములు, బుధ, గురు, శుక్రవారములందు జరిగించ వచ్చును. లగ్నమందు శుభగ్రహములుండుట, శుభగ్రహదృష్టి మంచిది.

## విద్యా విషయమై శుభ సమయములు



**విద్యాభ్యాసము :-** అశ్వని, మృగశిర, పున, పుష్య, ఆర్ద్ర, ఆశ్లే, హస్త, చిత్త, స్వాతి, మూల, శ్రవ, రేవతి నక్షత్రములు; మేష, కర్కా,తుల,మకర, మీన లగ్నములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులు; ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారములు మంచివి. అష్టమ శుద్ధి, అనాధ్యాయ రహితం చూసి పగటి కాలమున చేయవలెను.

**మంత్రోపదేశమునకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్వ, రోహి, పున, పుష్య, ఉత్తర, మృగ, స్వాతి, అనూ, శ్రవణ, రేవతి నక్షత్రములు; వృషభ, మిధున, కర్కా, కన్య, తుల, ధను, మీనలగ్నములు మంచివి.

**న్యాయశాస్త్రమునకు :-** అశ్వని,రోహిణి, పున, పుష్యమి, శ్రవణం, హస్త, శతభిషం, ఉత్తరాత్రయం, స్వాతి నక్షత్రములయందు మంచిది.

**వైద్య విద్యారంభమునకు :-** ఆది,సోమ, మంగళవారములు; అశ్వ,మృగ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్లేష, హస్త, చిత్త, స్వాతి, అనూ, జ్యేష్ట, మూల, శ్రవ, ధని, శత, రేవతి.

**హిందీ, ఉర్దూ మొదలగు భాషలు నేర్చుకొనుటకు :-** భరణి, కృత్తిక, ఆరుద్ర, ఆశ్రేష, మఘ,పుబ్బ, విశా, జ్యేష్ట, పూ॥షాఢ, ఉ॥షాఢ, శత, పూ॥భాద్ర, రేవతి నక్షత్రములు; ఆది, మంగళ, శనివారములందు; చంద్రునితో కూడిన స్థిరలగ్నమందు చాల మంచిది.

**కంప్యూటర్, గణిత విద్యారంభములకు :-** శత, పూ॥భాద్ర, అనూరాధ, ఆరుద్ర, రోహి, హస్త, పుష్య, రేవతి; బుధ, గురువారములు చాలా మంచివి.

**సంగీత,నృత్యములకు,లలితకళలకు:-** సోమ,బుధ,గురు,శుక్రవారములు, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, అనూ, పుష్య, జ్యేష్ఠ. శతభిషం,ఆరుద్ర,ధనిష్ఠ,రేవతి నక్షత్రములు శుభం.

**వ్యాకరణవిద్యకు :-** రోహిణి,మృగ,ఆరుద్ర,పున,పుష్య, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, అశ్వని నక్షత్రములయందు; సోమ, బుధ, గురు, శుక్రవారములయందు మంచిది.

**ధర్మశాస్త్ర పురాణములకు :-** అశ్వని, మృగ, శ్రవణం, ధనిష్ఠ, శత, హస్త, చిత్త, స్వాతి,విశా,అనూ,పుష్య, రేవతి నక్షత్రములయందు ధర్మశాస్త్ర పురాణములు ప్రారం భించుటకు మంచిది.

**వేదవిద్యారంభమునకు :-** అశ్వని, ఆర్ద్ర, పున, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, పూర్వాషాఢ, శ్రవణం, ఉత్తరాత్రయం, రోహిణి, రేవతి, నక్షత్రములు మంచివి. పాడ్యమి, చవితి, అష్టమి, నవమి, చతుర్దశి, పూర్ణిమ తిధులు పనికిరావు. సప్తమి, త్రయోదశి మధ్యమములు. తక్కిన తిథులు, ద్విస్వభావ రాశులు మంచివి. లగ్నమునకు ఎనిమిదింట ఏ గ్రహము యుండరాదు.

**శస్త్ర చికిత్సకు :-** శుక్లపక్షమందు శస్త్రచికిత్స చేయుట మంచిది. పౌర్ణమి యందు పనికిరాదు. మంగళ, శనివారములు; చవితి, నవమి, శుద్ధ చతుర్దశి తిధులయందు; ఆరుద్ర, జ్యేష్ఠ, ఆశ్లేష, మూల, నక్షత్రములయందు మంచిది. అష్టమ శుద్ధిగల లగ్నమందు కుజుడు బలవంతుడై ఉండగా చికిత్స చేయించ వలెను. చంద్రుడు జన్మరాశియందున్నప్పుడు పాపగ్రహాక్రాంత యున్న ప్పుడు చంద్రస్థిత నక్షత్రమునకు పాపగ్రహాక్రాంత యున్నప్పుడు ప్రారంభించకూడదు.

**వీణ, ఫిడేలు, మాండలీను మొ॥ సంగీత వాయిద్యములు నేర్చుకొనుటకు :-** రోహి, మృగ, పుష్యమి, ఉత్తర, హస్త,అనూ,ఉ॥షాఢ,శత,ఉ॥భాద్ర, రేవతినక్షత్రములు, సోమ, బుధ, గురు, శుక్రవారముల యందు, పంచమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి మొదలగు తిధులు మంచివి.

**తబలా, మద్దెల మొ॥ వ్రేళ్ళతో నేర్చుకొను సంగీత వాయిద్యములు :-** అశ్వని,మృగ, పున,పుష్య,హస్త,చిత్త,స్వాతి,అనూ,శ్రవ,ధని,శత,రేవతి,నక్షత్రములయందు;బుధ, గురు, శుక్రవారములయందు,తదియ,పంచమి,అష్టమి,దశమి,త్రయోదశి, పౌర్ణమి తిధులు చాలా మంచివి.



**కార్టూన్లు, పెయింటింగ్స్,(చిత్రలేఖనం)బొమ్మలువేయుటకు :-** అశ్వని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి,ఉ॥షాఢ, శ్రవ, పూ॥భాద్ర, రేవతి నక్షత్రములు; ఆది,సోమ,గురు,శుక్రవారములు; విదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి తిధులు మంచివి.

**అన్ని రకములైన యితర భాషలు నేర్చుకొనుటకు :-** భరణి, కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, మఖ,పుబ్బ,విశాఖ, జ్యేష్ఠ, పూ॥షాఢ,ఉ॥షాఢ,శతభిషం, పూ॥భాద్ర, రేవతి నక్షత్రములు; ఆది, మంగళ, శనివారములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిధులు మంచివి. చంద్రుడు స్థిరలగ్నమందుండిన చాలా మంచిది.

**గారడీవిద్య మ్యాజిక్ నేర్చుకొనుటకు :-** ఆది, సోమ, మంగళ, వారములు; అశ్వని, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష,హస్త,చిత్త,స్వాతి,అనూరాధ,మూల, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతినక్షత్రములు మంచివి.

**ఉద్యోగములో ప్రవేశించుటకు :-** రోహిణి, మృగశీర్షమఖ, ఉత్తర, హస్త,స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములు;బుధ,గురు, శుక్రవార ములు; వృషభ, మిధున, కర్కాటక, తుల, కన్య, ధనస్సు మీనలగ్నములు మంచివి.

## వ్యాపార విషయమై శుభ సమయములు

**వెండి, బంగారు దుకాణములకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిధులయందును; అశ్వ,రోహి, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, ఉత్తరాత్రయం, అనూ, శ్రవ, ధని, రేవతి, నక్షత్రములయందును; సోమ, బుధ, గురు, శుక్రవారములు శుభదాయకమైనవి.



**ఇనుము, స్టీలు వ్యాపారములకు :-** బుధ, శనివారములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిధులు; అశ్వ, రోహిణి, మృగ, పుష్య, అనూ, స్వాతి, ఉ॥భాద్ర నక్షత్రములు మంచివి.

**మందుల షాపులు :-** రోహి, మృగ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవణ, ధనిష్ఠనక్షత్రములు; ఆది, మంగళ, బుధవారములు యోగించును.

**ఫ్యాన్సీ షాపులు :-** విదియ, తదియ పంచమి, సప్తమి, దశమి తిధులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, శ్రవణ, ధనిష్ఠ నక్షత్రములు లాభదాయకమైనవి.

**పండ్ల దుకాణములు :-** రోహి,మృగ,పున,పుష్య,ఉత్తర,హస్త,చిత్త, స్వాతి, శ్రవ, ధని,పూ॥భాద్ర, ఉ॥భాద్ర, రేవతినక్షత్రములు;సోమ,బుధ,గురు,శుక్రవారములు మంచివి.

**బట్టల షాపులు :-** అశ్వ, రోహి, పున, ఉత్త, హస్త, చిత్ర, స్వాతి,అనూ, ఉ॥షాఢ, శ్రవ, ధని, శత, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు శుభం.

**గాజు మరియు ఎలక్ట్రికల్ షాపులు :-** రోహి, మృగ, పుష్య, హస్త, అనూ, శ్రవ, ధని, ఉ॥భాద్ర నక్షత్రములు, సోమ, మంగళవారములు; 2,3,5,7,10; పూర్ణిమ తిథులు మంచివి.

**రేడియో,టి.వి.వాచీలు, ఎలక్ట్రానిక్ మొ॥ షాపులకు :-** సోమ, బుధ, శనివార ములు; మృగ, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, ఉ॥భాద్ర నక్షత్రములు; 2,3,5,7,10 తిథులు మంచివి.

**అన్ని రకములవాయిద్యములు విక్రయించు వ్యాపారములకు :-** అశ్వ, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని,శత, రేవతి నక్షత్ర ములు; 2,3,5,7,10,13 పౌర్ణమితిథులు; బుధ, గురు, శుక్రవారములుమంచివి.

**పేపరు, పుస్తకములు, స్టేషనరీ దుకాణములు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2,3,5,7,10 తిథులు; రోహి, మృగ, హస్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, శత, పూ॥భాద్ర, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు శుభం.

**కిరణా దుకాణములు :-** రోహి, మృగశిర, ఉత్తర హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, ధని, శత, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు; సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**ఫర్నిచర్ షాపులకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2,3,5,7,10 తిథులు; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ॥షాఢ, శ్రవ, శత, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు యోగ్యమైనవి.

**జోళ్ళ షాపులకు :-** ఆది, బుధ, శనివారములయందు; మఖ, కృత్తిక, మృగ, ఆర్ద్ర, ఆశ్లేష, పుబ్బ, చిత్త, విశా, జ్యేష్ఠ, మూల, పూ॥షాఢ, పూ॥భాద్ర, రేవతి నక్షత్రములు యోగించును. మరియు చర్మముతో చేసే పనులకు, క్రొత్త చెప్పులు ధరించుటకు మంచిది.

**బట్టలకు రంగులు వేయు వ్యాపారములకు :-** అశ్వని, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, శ్రవ, ధనిష్ఠ నక్షత్రముల యందు, ఆది, మంగళ, గురు, శుక్రవారములు; 2,3,5,7,10 తిథులయందు వస్త్రములకు రంగులు వేయుటకు శుభం.

**కాఫీ హోటల్స్, స్వీటుస్టాల్స్ వ్యాపారములకు :-** అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్తరాత్రయం, హస్త మూల, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములయందు; సోమ, బుధ, గురు, శుక్రవారములయందు; 2,3,5,7,10 తిథులయందు ప్రారంభించవలెను. లగ్నమునకు తృతీయ శుద్ధి యుండవలెను.

**మత్తు పానీయములు (బ్రాందీ, విస్కీ మొదలగువాటికి) :-** ఆది, మంగళ, శనివారములు, 2,3,5,7,10,11,15 తిథులు, భరణి, ఆరుద్ర, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాషాఢ, పూర్వాభద్ర, జ్యేష్ఠ, మూల, శతభిష నక్షత్రములు, మేష, వృషభ, తుల, ధనస్సు, మకర, కుంభ, మీనలగ్నములు మంచివి.

**చిట్‌ఫండ్ సంస్థలకు :-** బుధ, గురువారములు; 2,5,7,10,11 తిథులు; అశ్వని, రోహిణి, మృగశిర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, స్వాతి, అనూరాధ, శ్రవణం, రేవతి నక్షత్రములు; వృషభ, మిధున, కర్కాటక, తుల, ధనస్సు, మీనలగ్నములు మంచివి. సప్తమమందు శుభగ్రహము యుండవలెను.

**మోటారు వాహనముల ఫైనాన్స్ వ్యాపారమునకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2,3,5,7,10 తిథులు; అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు పుష్యమి, మఖ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, శతభిష, రేవతి నక్షత్రములు మంచివి.

**మోటారు వాహనముల ఫైనాన్స్ వ్యాపారమునకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2,3,5,7,10 తిథులు; అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, శతభిష, రేవతి నక్షత్రములు మంచివి.

**రైసు మిల్లులు ప్రారంభించుటకు :-** సోమ, బుధ, గురు, శుక్రవార ములు; 2,3,5,7,10,11 తిథులు; అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, రేవతి నక్షత్రములు మంచివి. స్థిర లగ్నం, చతుర్థ, అష్టమ శుద్ధి యుండవలెను.

**ఫిలిం డిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు :-** అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర స్వాతి, అనూరాధ, ఉ॥భాద్ర, రేవతి, నక్షత్రములు; సోమ,బుధ, గురు, శుక్రవారములయందు; 2,3,5,7,10,11,13,15 తిథులయందు చెయ్యవలెను. శుక్రుడు బలముగా యుండవలెను. సప్తమశుద్ధి కలిగియుండవలెను.

# గృహసంబంధమైన శుభాశుభములు

**బంగారు, వెండి పాత్రలయందు భుజించుటకు :-** అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, శతభిషం, రేవతినక్షత్రములు; బుధ, గురు, శుక్ర వారములయందు అమృతయోగ ఘడియలలోను సువర్ణ, రజిత పాత్రలయందు భోజనము చేయుటకు మంచిది.

**స్టీలు పాత్రలు, కంచములు, గ్లాసులు ఉపయోగించుటకు :-** అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, అనూరాధ ఈ 9 నక్షత్రములయందు; సోమ, బుధ, గురు, శుక్రవారములయందు; శుభతిథులు, శుభ లగ్నములయందు ఉపయోగించవలెను.

**సైకిళ్ళు, కార్లు, లారీలు మొ॥గు కొత్త వాహనములు వాడుటకు :-** రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, శ్రవణం, రేవతి నక్షత్రముల యందు; సోమ, బుధ, గురు, శుక్ర వారముల యందు; వృషభ, మిధున, కర్కాటక, కన్య, తుల, ధనస్సు, మీన లగ్నముల యందు ఉపయోగించవలెను. అష్టమశుద్ధిగల లగ్నము అయి ఉండవలెను. పగటి భాగము నందు ముహూర్తము నిర్ణయించవలెను. రాత్రియందు కూడదు.



**మంచములు, కుర్చీలు, టేబుల్స్ వాడుటకు :-** అశ్వని, రోహిణి, మృగశిర,పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయం,హస్త,చిత్ర,స్వాతి,శ్రవణం,శతభిషం,రేవతినక్షత్రములయందు; విదియ, తదియ,పంచమి, సప్తమి, దశమి,శుద్ధ ఏకాదశి, త్రయోదశి తిధులు; బుధ,గురు, శుక్రవారములు మంచివి.



**కొత్తజోళ్ళు ధరించుటకు :-** ఆరుద్ర, మృగశిర, మఖ, ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రములు, బుధ, శని, ఆదివారములు మంచివి.

**గ్యాస్ స్టౌ,ఫ్రిజ్, మిక్సీ, గ్రైండర్ మొ॥నవి వాడుటకు :-** మంగళ, బుధ, గురు, శుక్రవారముల యందు; విదియ, తదియ, పంచమి, సప్తమి,దశమి,ఏకాదశి, త్రయోదశితిధులు;వర్జ్యం-దుర్ముహూర్త ములులేకుండా కుజహోరలోవాడినయెడల చాలాకాలం వరకు రిపేర్లు రావు.



**ఇండ్లస్థలములు కొనుటకు అమ్ముటకు :-** 1,2,3,5,7,10,11 తిథులు మృగ, పున, ఆశ్రే, మఖ, పూర్వాత్రయం, విశా, అనూ, మూల, రేవతీ తారలు మంచివి. గురు, శుక్రవారములు కొనుటకు, బుధ, గురువారములు అమ్ముటకు మంచివి.

**కూపాది జలాశయములకు :-** రోహి, ధని, పుష్య, శత, పూ.షాఢ, అనూ, మఖ, హస్త, ఉత్తరాత్రయం, రేవత్యాదినక్షత్రములందు శుభమాస, శుభతిధులయందు ఆరంభించదగును.

**శంకుస్థాపన :-** రాత్రియొక్క మూడవభాగమందుగాని ప్రాతఃకాలమందుగాని చేయవలయును. యజమానికి ఎట్టిఆశౌచములు కలిగినపుడుగాని భార్యగర్భవతిగా ఉన్నప్పుడు, బహిష్టురాలై ఉన్నప్పుడుగాని శంకుస్థాపనచేయరాదు. చైత్ర,వైశాఖ,శ్రావణ,కార్తీక,మార్గశిర,మాఘ, ఫాల్గుణమాసములు గృహారంభమునకు యోగ్యములు.

**గృహప్రవేశము :-** గృహప్రవేశమైనది మొదలు అందు కాపురముండవలెను. ఏకారణముచేతనైనను గృహప్రవేశ ముహూర్తమునకు ఆలస్యమైన ఎడల కట్టుబడి చేసిన గృహమును ఖాళీగా ఉంచక దీపారాధన చేయుచుండవలెను. భార్యగర్భిణితో ఉండగా 5 మాసములు దాటిన తరువాత గృహప్రవేశము చేయరాదు.

**ఇనుపపెట్టె స్థానము :-** ఇనుపపెట్టె, ధనముదాచుకొనే బీరువాలు గృహములో ఉత్తరమున ఉంచుట శుభదాయకము. రోళ్లు, తిరగళ్ళు సామాన్లు పెట్టుకొను బీరువాలు మొదలగునవి బరువుగల సామానులు దక్షిణమున నైఋతి భాగమున పెట్టుకొనవలెను.

**దేవతాపూజా :-** ఈశాన్యమున దైవమందిరముండవలెను.

**వృక్షములు నరకుటకు :-** మృగశిర, పునర్వసు, అనూరాధ, హస్త, మూల, ఉత్తరాత్రయం, స్వాతి, శ్రవణం ఈ తారలందు వృక్షములు నరకుట మంచిది. వృక్షములు నరకిన తరువాత 6 మాసములు లేదా కనీసం 3 మాసములలోగా గృహారంభము చేయరాదు. తులసికోట సింహద్వారముకెదురుగా లేదా వంట యింటికి ఎదురుగా పెరటిలో ఉండుట సర్వవిధముల శుభకరము.

**తేనెపట్టు :-** తూర్పున ధనలాభం, పడమర మనోవ్యధ, ఉత్తరమున పుత్రలాభం, దక్షిణమున మరణం, ఆగ్నేయమున అగ్నిభయం, వాయువ్యమున ధనహాని, ఈశాన్యమున బంధుదర్శనము, నైఋతి ధాన్యహాని నట్టింట యజమాని మరణం.

# వ్యవసాయ సంబంధమైన శుభాశుభములు



**క్రొత్తభూమిలో కృషికి ప్రవేశించుటకు :-** అనూ,హస్త, చిత్త, స్వాతి,రోహిణి, ధని,మఖ, అశ్వని, ఉత్తరాత్రయం, రేవతి, మూల నక్షత్రములు; ఆది, మంగళ,బుధ, శుక్రవారముల యందు ప్రవేశించుటకు మంచిది. సోమవారము మధ్యమము, రిక్త, దగ్ధ తిధులు; ప్రతివత్తు,అమావాస్య,ఆవమ, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాత ఈయోగములు, విష్టి లేకభద్ర కరణంబులు విడిచి తక్కినదినములలో భూమిలో కృషికి ప్రవేశించుటకు మంచిది.

**ఏరువాకకు, దుక్కిదున్నటకు :-** అశ్వని, రోహి, మృగ, పునర్వసు, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉ॥షాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిష, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములందును; ఆది, మంగళ, గురువారము లందును; వృషభ, మిధున, కన్య, ధను, వృశ్చిక, మీన లగ్నములయందు వ్యవసాయం, హలకర్మకు మంచిది. మేషలగ్నమున పశునాశనము, కర్కాటకమున వర్షం వలన నాశనము, సింహమున విషజంతుభయం, తులయందు ప్రాణహాని, మకరమున సస్యనాశనం, కుంభమున చోరభీతి కల్గును.

**విత్తనములు చల్లుటకు :-** అశ్వ, హస్త, పుష్య, చిత్త, రేవతి, మృగ, అనూ, రోహి, ఉత్తరాత్రయం, స్వాతి, మూల, మఖ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం ఈ 17 నక్షత్రములలో విత్తనములు జల్లిన ఫలించును. ఇంకా వన్నెగల విత్తనములు ఆ రంగుగల గ్రహవారములందు అన్నివిధములైన విత్తనములు జల్లిన శుభం చేకూరును. బుధ, గురు, శుక్రవారములలో శుభము. పైన చెప్పిన ఏరువాక లగ్నములలో మంచిది. పంట బాగా పండును.

**పాలి పెట్టుటకు :-** అశ్వ, రోహి, పున, పుష్యమి, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, రేవతి ఈ నక్షత్రములు; గురు, శుక్ర, ఆదివారములు; తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి తిధులు మంచివి.

**వరి ఆకు ఊడ్చుటకు :-** అశ్వ, రోహి, మృగ, పుష్య, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ధని, రేవతి నక్షత్రములు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; రిక్తతిధులు; చవితి, నవమి, చతుర్దశి తిధులు మొలకపైరు ఊడ్చుటకు శుభం.

**పంట కుప్ప వేయుటకు, నూర్చుటకు :-** తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిధులు, బుధ, గురు, శుక్రవారములు; అశ్వ, రోహి, మృగ,పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉత్తరాయం, పూర్వాత్రయం, రేవతి నక్షత్రములు మంచివి.



**క్రొత్తధాన్యం పొలము నుండి తెచ్చుటకు :-** చిత్త, రేవతి, మృగ, అనూరాధ, పుష్య, హస్త ఈ 6 నక్షత్రములు; సోమ,గురు,శుక్రవారములుమంచివి.

**ధాన్యం దంచుటకు :-** మఖ, పుబ్బ, అనూ, జ్యేష్ట, మూల, రేవతి నక్షత్రములతో కూడిన సింహ లగ్నమునందు మంచిది

**కొత్త ధాన్యాన్నమును భుజించుటకు :-** అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూ, మూల, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి నక్షత్రములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు; మేష, వృశ్చిక, మీన లగ్నములందు అష్టమ చంద్రుడు లేకుండా శని, గురువారములయందు మంచిది.

**ధాన్యం, బియ్యం, అపరదినుసులు, వగైరాలు రాసికొలతలకు వార ఫలములు :-** గురు, శుక్ర వారములలో కొలచిన తరుగు గాని, హరింపు గాని కలగదు.

**పొగాకునారు పోయుటకు :-**అశ్వ, భరణి, మృగ, ఆరుద్ర, పుష్య, స్వాతి, నక్షత్రములు; ఆది, మంగళ, గురువారములు మంచివి.

**ప్రత్తిచేను వేయుటకు :-** ఆది, గురువారములోను; కర్కా, కన్య, మీన లగ్నములు; అశ్వ, భరణి, మృగ, హస్త, పున, పుష్య, స్వాతి, మూల, రేవతి, నక్షత్రములు మంచివి.

**అరటిమొక్కలు, మామిడి మొక్కలు వేయుటకు :-** పుష్య, ఉ॥భాద్ర, మఖ, అశ్వ, అనూ, ఉత్తర, రేవతి నక్షత్రములు; మేష, వృషభ, వృశ్చిక, కన్యా లగ్నములు; తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి తిధులు; బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**ఖర్జూర, పోక, కొబ్బరి తోటలు వేయుటకు :-** అశ్వ, పుష్య, హస్త, మృగ, అనూ, మూల నక్షత్రము లందును; బుధ, గురు, శుక్రవారములు; స్థిర లగ్నము లందును, శుభ తిధులయందును పై మొక్కలు వేసినచో ఫలప్రదమగును.

**కంది, శెనగ, పెసర, మినుము, గోధుమ విత్తనములు చల్లుటకు :-** మూల, ఉత్తరాత్రయం, శ్రవ, మృగ, పున, ధని, రేవతి, రోహి, అనూ, స్వాతి, ఈ 12 నక్షత్రములు; కర్కాటక, ధను, తుల, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ, లగ్నములు; బుధ, గురు శుక్రవారములు మంచివి. ➤ మూల, ఉత్తర, ఉ॥షాఢ ఉ॥భాద్ర, అనూ, విశా,మఖ, శ్రవ, రేవతి, పుష్యమి ఈ 10 నక్షత్రములలో సమస్త జాతి విత్తనములు కట్టగా కట్టిన నిలువకు శుభం.

**జామి, బత్తాయి, నిమ్మ, దానిమ్మ పంటలకు :-** అశ్వని, భరణి, రోహిణి, ఆరుద్ర, పునర్వసు, ఆశ్లేష, పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, రేవతి నక్షత్రములు; బుధ, గురు, శుక్ర, శని, ఆదివారములు మంచివి.

**గుమ్మడి, చిక్కుడు, పొట్ల, కాకర, బీర, దోస పాదులకు :-** అశ్వని, భరణి, శ్రవణం, ధనిష్ఠ, రేవతి, నక్షత్రములు, బుధ, గురు, శుక్ర, శని, ఆది వారములు మంచివి.

**పూలమొక్కలు వేయుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులున్నూ; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్వని, రోహి, మృగ, స్వాతి, హస్త, శ్రవ, పుష్యమి నక్షత్రములు; మిధున, కన్య, ధను, మీనలగ్నములు మంచివి.

## పశు, మత్స్య పరిశ్రమ సంబంధమైన శుభాశుభములు



**దూడలకు దుక్కి అలవాటు చేయుటకు :-** అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, హస్త, స్వాతి, విశాఖ,అనూరాధ, మూల,శ్రవ, ధని,రేవతి; 2,3,5,7, 10,11,శుద్ధ త్రయోదశి తిధులు;ఆది, సోమ, గురు, శుక్రవార ములు మంచివి.

**పశువులను క్రొత్తగా తెచ్చుటకు :-** భరణి, కృత్తిక, ఆరుద్ర, అనూ, మూల, మఖ,స్వాతి,పున,చిత్త,మృగశిర ఈ 10 నక్షత్రములు; మంగళ, శని ఆదివారములలో కొనుటకు మంచిది.

**పశువులకు బంధము వేయుటకు :-** రేవతి, అశ్వని, పుష్య, పుబ్బ, మృగశిర, మూల, ఈ 6 నక్షత్రములు; గురు, శుక్ర, ఆదివారములు మంచివి.

**క్రొత్తగా పశువులకు కాడి పూన్చుటకు :-** ఆది, గురువారములలోను, శతభిషం, విశాఖ, హస్త, పునర్వసు, రోహి, జ్యేష్ఠ, భరణి, అశ్వని, రేవతి, ఈ 9 నక్షత్రములు మంచివి.

**పోతులను పూన్చుటకు :-** భరణి, చిత్త, శ్రవ, రోహి, ఉత్తరాత్రయం, ఈ 7 నక్షత్రములు; శనివారం; చవితి, అష్టమి, నవమి, చతుర్దశి, అమావాస్య తిధులు దుక్కి కుప్పుటకు, కాడి పూయుటకు శుభం.

**పశువులను అమ్ముటకు :-** పుబ్బ, పూ॥షాఢ, పూ॥భాద్ర, ధనిష్ఠ, జ్యేష్ఠ, మృగశిర, రేవతి, విశాఖ, ఆశ్రేష, మఘ, అశ్వని ఈ 11 నక్షత్రములు లాభదాయకమైనవి.

**పశువులను కట్టుటకు, పశువులశాల వేయుటకు :-** మృగశిర, పూ॥భాద్ర, మూల,అశ్వని, పుష్యమి, హస్త ఈ 6నక్షత్రములలో పశువులను నూతనముగా కట్టిన పశువృద్ధి అవును. విదియ, తదియ, పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు; సోమ, బుధ, గురు, శుక్రవారములలో పశువులశాల వేయుట మంచిది.

**పొలము కాపలా కాయుటకు :-** బుధ, గురు, శుక్రవారములు; అశ్వని, ధని, చిత్త, కృత్తిక, మూల నక్షత్రములు మంచివి.

**పిచ్చుకలగూడు పెట్టుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిధులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; పుష్య, శ్రవణ, హస్త, మృగ, అనూ, మూల, చిత్త, స్వాతి నక్షత్రములు; వృషభ, మిధున, సింహ, కన్య,వృశ్చిక, ధను, కుంభ లగ్నములు మంచివి.
లగ్నమునకు శుభగ్రహ దృష్టి యుండవలెను.



**పడవలు తయారుచేయుటకు :-** బుధ, గురు, శుక్రవారములు; అశ్వని, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త,ఉత్తరాత్రయం, శ్రవ, అనూ, రేవతి; 2,3,5,7, 10,13 తిధులు; వృష, మిధు, కర్కా

కన్య, తుల, ధను, మీన లగ్నములు శుభం.

**పడవలను నీటిలో దింపుటకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్వ, మృగ, హస్త, చిత్త, మూల, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూ॥షాఢ, పూ॥భాద్ర, విశాఖ, రేవతి నక్షత్రములు; విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, పౌర్ణమి, బహుళ పాడ్యమి తిథులు; మేష, మిథు, కర్కా, తుల, మకర, మీన లగ్నములు మంచివి.

**వల ముడుచుటకు :-** రోహి, పుష్య, ఉత్తర, ఉత్తరాషాఢ, ఆర్ధ్ర, శ్రవ, ధని, శతభిషా నక్షత్రములయందు; సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**వల నీటిలో తడుపుటకు :-** అశ్వని, రోహి, స్వాతి, శ్రవణ, అనూ, పుష్య, జ్యేష్ఠ, హస్త, పున, ఉత్తర, శతభిష, మూల నక్షత్రములు; ఆది, సోమ, బుధ, వారములు; పాడ్యమి, పంచమి, సప్తమి దశమి, ఏకాదశి, పౌర్ణమి తిథులు మంచివి.

**గాలము మూహూర్తము :-** రోహి, మృగ, ఆర్ధ్ర, పున, పుష్య, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, పూ॥షా, ఉ॥షా, శ్రవ, ధని, శత, పూ॥భాద్ర, ఉ॥భాద్ర, రేవతి నక్షత్రములు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; పాడ్యమి, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి తిథులు; వృష, మిథు, కర్కా, తుల, మకర, మీన, కుంభలగ్నములు శుభం కలిగించును.

**బోట్లు, పడవలు ప్రయాణమునకు :-** 2,3,5,7,10,13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్వని, మృగ,పున,పుష్య,హస్త, అనూ, జ్యేష్ఠ, శ్రవణ, ధని, రేవతి నక్షత్రములు; మేష, వృషభ, కర్కా, కన్య, తుల, ధను, మీనలగ్నములు మంచివి.

**రొయ్యు విత్తనం (సీడ్) చేప పిల్లలు చెరువులలో వేయుటకు :-** అశ్వని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఆశ్లేష, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, శ్రవణ, రేవతి నక్షత్రములు; 2,3,5,7,9,10,11,12,15 తిథులు మంచివి.

**పొలములో చేపల చెరువులు త్రవ్వించుటకు :-** రోహిణి, పుష్యమి, మఖ, హస్త, అనూరాధ, పూర్వాషాఢ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు, శుభ తిథులు, బుధ, గురు, శుక్ర వారములు, శుభ మాసములు మంచివి.

## సర్వార్థ సాధనా చక్రము (సర్వ కార్యక్రమములకు శుభప్రదము)

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | శ్రవణం | అశ్విని | – | అశ్విని | అశ్విని | శ్రవణం |
| పుష్యమి | పుష్యమి | ఆశ్రేష | – | పుష్యమి | – | – |
| ఉత్తర | రోహిణి | – | రోహిణి | – | – | రోహిణి |
| హస్త | – | – | హస్త | రేవతి | రేవతి | – |
| మూల | మృగశిర | – | మృగశిర | పునర్వసు | పునర్వసు | – |
| ఉ॥షా॥ | – | కృత్తిక | కృత్తిక | – | – | స్వాతి |
| ఉ॥భా॥ | – | ఉ॥భా॥ | అనూరాధ | అనూరాధ | అనూరాధ | – |

**పరామర్శకు :-** ద్విపాద, త్రిపాద నక్షత్రములు; ధనిష్ఠా పంచకములు, ఆది, మంగళ, శుక్రవారములయందు పరామర్శ చేయరాదు. సంవత్సర మధ్యలో ఎప్పుడు చూచుటకు వెళ్ళినా బేసి మాసము (1,3,5,7,9,11) లలో చూడవలెను.

**సకేశస్త్రీని పరామర్శ చేయుటకు :-** వర్జ్య, దుర్ముహూర్తములు. పంచ పర్వములు, మంగళవారం శుక్రవారం వీటిని తప్పించి సకేశిగాఉన్న విధవా స్త్రీని,భోజనము చేసిన తర్వాత వెళ్ళి పరామర్శించవలెను. ఈ విషయంలో ద్విపాద, త్రిపాద నక్షత్ర విచక్షణ అవసరము లేదు.

**సంగమము చేయకూడనవి :-** పగటి భాగము సంధ్యా కాలము, పర్వదినములు, తండ్రి లేక తల్లి తద్దినము పెట్టినరోజున, జాతాశౌచము, మృతాశౌచదినములు; పురుడు, మైల, దుష్ట నక్షత్రముల యందు భార్యతో గర్భాదానము చేయరాదు.

## జననకాల నక్షత్రముల సూక్ష్మ ఫలములు

1. **అశ్విని నక్షత్రం :** అనుకూలవంతుడు, శౌర్యవంతుడు, అందగాడు,సమర్థుడు, క్రౌర్యము గలవాడు గొప్ప శరీరము గలవాడై యుండును.
2. **భరణీ నక్షత్రం :** విద్యావంతుడు, ఆరోగ్యవంతుడు, మనస్థైర్యము గలవాడు విషయ గ్రహణము గలవాడు, యదార్థముగా భాషించు వాడును, ఖచ్చితమైన నిర్ణయము గైకొనువాడగును.
3. **కృత్తిక నక్షత్రం :** న్యాయశాస్త్ర మెరుంగువాడును, భోజన ప్రియుడు, అధికారము చలాయించువాడు అత్మాభిమానము గలవాడగును.
4. **రోహిణి నక్షత్రం :** మంచి రూపము గలవాడు, స్థిర అలోచన గలవాడు, అభిమానవంతుడు, సుఖ జీవనం గడుపువాడును, మంచి ప్రవర్తన గలవాడును, తేజోవంతుడు, సంభోగ ప్రియుడును స్త్రీ జన్మించిన సంతానము గలదియు సౌందర్యవంతురాలు కీర్తి ప్రతిష్టలు గలది పూర్ణాయువు గలదై యుండును.
5. **మృగశిర నక్షత్రం :** ధనార్జనలో పైచేయిగలవాడు, శత్రువులను జయించు వాడును, చురుకైన ప్రవర్తన గలవాడు,కోపాధికము గలవాడును, స్త్రీ పుట్టిన రూపవతి సంతోషము గలదియు మంచి మర్యాదలు గలదియు, ధర్మపు నడక గలదియు పుత్ర సంతానము గలదియగును.
6. **ఆర్ద్రా నక్షత్రం :** శూరవంతుడు, సాహస కార్యములు చేయువాడు, క్రయవిక్రయముల లో ఆరితేరినవాడు కృతఘ్నుడు క్రౌర స్వభావం గలవాడు చీకూచింత లేనివాడగును, స్త్రీ జన్మించిన సతతం కలహించుకొనునది దుష్కార్యములు చేయునదగును.
7. **పునర్వసు నక్షత్రం :** రూపలావణ్యయుక్తుడును పరస్త్రీ కార్యములు చేయువాడు, ఆలోచించి కార్యములు సాధించువాడు, కొద్దితో తృప్తిపడువాడు,స్త్రీ పుట్టిన శాంత స్వభావముగలది తమవారితో ప్రేమాధికముగలది,సహనముగలది,ధార్మిక కార్యములు చేయునదియగును.
8. **పుష్యమీ నక్షత్రం :** కామోద్రేకములు గలవాడు స్థిర బుద్ధి గలవాడు శుభ్రముగా ఉందువాడు, మంచి చదువు గలవాడును, స్త్రీ పుట్టిన రూపవతియై ధార్మిక ప్రవర్తనలో దేవబ్రాహ్మణులను తృప్తి పరుచునదియగును.
9. **ఆశ్లేష నక్షత్రం :** సుఖ సౌఖ్యములు అనుభవించువాడు.క్రూర స్వభావము గలవాడు వ్యసనములు గలవాడును స్త్రీ జన్మించినఅధికముగా మాట్లాడునదియు క్రూర స్వభావం గలది కలహమందాసక్తి గలది యగును.
10. **మఘ నక్షత్రం :** నలుగురిలో క్రూరుడనిపించుకొనును.బలిసిన చెక్కిళ్ళుగ లవాడు, కోపాధికము గలవాడు,వాదనలో దక్షుడు స్త్రీ పుట్టిన గౌరవ ప్రతిష్టలు కలదియు దేవతా గురుభక్తి గలదగును.
11. **పూర్వ ఫల్గుణి నక్షత్రం :** ధనికుడు, ధార్మిక స్వభావి, కార్యాకార్య విచారము గలవాడు నృత్య శాస్త్రాభిమాని. స్త్రీ పుట్టిన నలుగురితో పేరు గడించునది,సంతానం గలది, ధనవంతురాలు,శతృవులను జయించునది అగును.
12. **ఉత్తర ఫల్గుణి నక్షత్రం :** శత్రువులను జయించువాడును,సుఖసౌఖ్యాదులు అనుభవించువాడును,ధనవంతుడు స్త్రీ పుట్టిన ప్రేమగలదియు,యధార్థముగా మాట్లాడునది,ఇంటి పనులలో నేర్పరియైయుండును.
13. **హస్తా నక్షత్రం :** విద్యావంతుడు,ధనవంతుడు,పరులకు మేలు చేయువాడు, సౌఖ్యవంతుడు, ధైర్యసాహసం గలవాడు, స్త్రీ పుట్టిన శీల, గుణ, సౌందర్యవతి, గౌరవ ప్రతిష్టలు గలదై యుండును.
14. **చిత్తా నక్షత్రం :** వస్త్రధారణలో అభిలాషగలవాడును, ప్రయాణములతో సమాయాన్ని హెచ్చుగా వెచ్చించువాడు,ధనవంతుడు, భోగభాగ్యములను అనుభవించువాడు, స్త్రీ పుట్టిన రూపవతి,ఆభరణములుధరించునది,సౌఖ్యములను అనుభవించునదియగును.

15. **స్వాతి నక్షత్రం :** ధర్మప్రవర్తన గలవాడు,వ్యవహారములలో పైచేయి గలవాడు,విద్యావంతుడు, ధైర్య సాహసములు గలవాడు,స్త్రీ పుట్టిన కీర్తి ప్రతిష్టలు గడించునది,మంచినడవడిక గలదై యుండును.
16. **విశాఖ నక్షత్రం :** సూక్ష్మంగా విచారించువాడును, ఓర్వలేని తనం గలవాడు, ఇంద్రియ నిగ్రహం గలవాడును, దయాదాక్షిణ్యము గలవాడును, స్త్రీ పుట్టిన మనోహర శరీరము గలది, బంధువులయందు ప్రేమగలది, తీర్థయాత్రలయందు అభిలాష గలదై యుండును.
17. **అనూరాధ నక్షత్రం :** శూరత్వము గలవాడు, విదేశములలో యుండువాడు, రాజకీయ కార్యములందాసక్తి చూపువాడు, రూపవంతుడు, స్త్రీ పుట్టిన ఉపకారము చేయునది, తగిన స్నేహితులు గలది, సౌందర్యవంతురాలుగా వుండును.
18. **జ్యేష్టా నక్షత్రం :** పురుషుడు పుట్టిన ధనవంతుడు,శ్రమలనోర్చువాడు, అసత్యమందు జంకువాడు,స్త్రీ జన్మించిన అధికప్రేమగలదియు,కోపాధికం గలదై యుండును.
19. **మూలా నక్షత్రం :** ధనవంతుడు, ఆత్మాభిమానం గలవాడు, సౌఖ్యవంతుడు, ధర్మ శాస్త్ర ప్రవర్తన గలవాడు, బంధువుల నాదరించువాడు, స్త్రీ పుట్టిన విద్యా ధనం గలదియు, స్వల్ప సౌఖ్యము గలదై యుండును.
20. **పూర్వాషాఢ నక్షత్రం :** వినయ విధేయతలు గలవాడు, ప్రసన్నవదనుడు, త్యాగగుణము గలవాడు, అభిమానవంతుడు, స్త్రీ జన్మించిన ఆదరాభిమానము గలదియు, విశాలమైన నేత్రములు గలదై యుండును.
21. **ఉత్తరాషాఢ నక్షత్రం :** ధార్మికుడు, విశ్వాస యోగ్యుడు, సంతానము గలవాడు, సౌందర్యవంతుడు, మంచి భార్య గలవాడు, స్త్రీ పుట్టిన అనురాగ పూరిత మనస్సు గలదియు, భోగభాగ్యములను అనుభవించునదై యుండును.
22. **శ్రవణా నక్షత్రం :** పాండిత్యము గలవాడు,ఉదార స్వభావం గలవాడు,వాదనలో సమర్దుడు విజయం పొందువాడు.స్త్రీ జన్మించిన ధర్మ ప్రవర్తన గలదై యుండును. దానదర్మములు చేయునదై యుండును.
23. **ధనిష్టా నక్షత్రం :** దురలవాట్లు గలవాడు, క్రూర స్వభావం గలవాడు, అపవాదులు చేయువాడు స్త్రీ జన్మించిన ఇతిహాసములందు ఆసక్తి గలది, తోటి స్త్రీలు నాదరించునది ధర్మ ప్రవర్తన గలదై యుండును.
24. **శతభిషా నక్షత్రం :** కపటము గలవాడు, దుష్టుడు, సుందరాస్యుడు, భార్యయందు ప్రేమాధిక్యము గలవాడు, స్త్రీ పుట్టిన దేవతా గురుభక్తి గలదియు ఇంటి పనులలో నేర్పరియై యుండును.
25. **పూర్వాభాద్ర నక్షత్రం :** దురలవాట్లు గలవాడు, పరస్త్రీలయందాసక్తి గలవాడు, తరచుగా అవకతవకలు గలవాడు, స్త్రీ పుట్టిన ధనవంతురాలును,దైవభక్తి గలది, సత్సంతానము గలదియు, వినయ విధేయత ప్రవర్తన గలదై యుండును.
26. **ఉత్తరాభాద్ర నక్షత్రం :** స్త్రీసంతానంగలవాడు,ధార్మిక కార్యము చేయువాడు, శత్రువులను జయించువాడు, స్త్రీ పుట్టిన గౌరవ ప్రతిష్టలు గలది ఓర్పుగలదై యుండును.
27. **రేవతి నక్షత్రం :** ధనవంతుడు, నలుగురిలో పేరు సంపాదించువాడును, సౌందర్యవంతుడును, స్త్రీ పుట్టిన శారీరక పుష్టి గలదై, ఆచారవంతురాలై యుండును.

**శ్లో॥ కలౌ పారాశరీ హోరా ప్రత్యక్ష ఫల దర్శినీ ।**
**తదుక్త రీత్యానుమేయం జన్మకాల శుభాధికమ్ ॥**

ఈ కలియుగమున పరాశరోక్త హోరాశాస్త్రం అనుభవమునకు సరిగా సరిపోవుచున్నది. ఫలితములు చెప్పుటకు పరాశర పద్ధతి, జైమిని పద్ధతి, బృహజ్జాతక పద్దతి, వృద్ధయవన పద్దతి, తాచక పద్దతి, నాడీజాతక పద్దతి, కేరళీయ జ్యోతిష పద్దతులు సర్వశ్రేష్ఠములు.

**బాలారిష్ట దోషములు :-** జనన కాల లగ్నమునకు చంద్రుడు ఎనమిదిన, కుజుడు ఏడున, రాహువు తొమ్మిదిన, శని లగ్నమున, గురుడు మూడున, సూర్యుడు ఐదున, శుక్రుడు ఆరున, బుధుడు నాల్గున, కేతువు రెండున ఉన్న యెడల బాలారిష్ట దోషము సంభవించును. శిశువు జన్మించిన లగ్నమునకు 1, 5, 6, 7, 8, 12 రాశుల యందు పాపగ్రహములు కూడియుండిన లేక పాపగ్రహములచే చూడబడినను క్షీణ చంద్రుడు 12వ రాశియందును లేదా 1, 8వ రాశులయందు పాపగ్రహములు ఉండిన బాలారిష్ట దోషములు కలుగును.

**బాలారిష్ట దోష నివృత్తి : -** జనన కాలానికి ఏ గ్రహమైతే బాలారిష్టము చెంది యున్నదో దాని సంవత్సర పరిమాణాన్ని రోజులలోకి మార్చుకొని జనన సమయాదిగా కలుపగా ఎన్ని రోజులు వచ్చునో అప్పటి వరకు ఆ దోషము ఉండును. కావున ఆ సమయములోపల దైవజ్ఞుని దగ్గరికి వెళ్ళి ఆ గ్రహ సంబంధ ధాన్యమును, వర్ణ వస్త్రమును, లోహమును దానమివ్వవలయును.

**జన్మ సమయ తిథ్యాది దోష గండములు :-** అమావాస్య, పాఢ్యమిలయొక్క, దశమి, ఏకాదశమిలయొక్క, పూర్ణిమ,పాడ్యమిల సంధి యందు **3ఘడియల** కాలము దోషము. దాని వలన శిశువునకు బాలారిష్టము. బహుళ చతుర్థశి తిథియందు శిశువు జన్మించిన యెడల ఆ తిథిప్రమాణమును ఆరు భాగములు చేయవలెను. ఆ భాగములో మొదటి భాగమున జన్మించిన శుభము, రెండున తండ్రికి, మూడున అన్నకు, నాల్గున మేనమామలకు, ఐదున వంశమంతటికి, ఆరవ భాగమున శిశువునకు హాని, ధనహాని కలుగును. కావున శాస్త్రోక్త విధిగా తప్పక శాంతిని చేయవలయును.

**జ్యేష్ట నక్షత్రం విశేష వివరణ**

ఈనక్షత్రమందు జననమైన ప్రబలమైన హోమశాన్త్యాదులు చేయవలయును. నక్షత్ర ఆద్యన్త ఘడియలను పదిభాగములు చేయగా 1వభాగం తల్లితల్లికి, 2వభాగం తల్లితండ్రికి, 3వభాగం మేనమామలకు, 4వభాగం తల్లికి, 5వభాగం శిశువునకు, 6వభాగం పశుసంపద(వ్యాపారము,ధనం)కు, 7వభాగం ఉభయ వంశముల వారికి, 8వభాగం వంశనాశనం, 9వభాగం శ్వశురునకు, 10వభాగం అందరికి హాని కల్గును. మంగళవారం తో కూడిన జ్యేష్టయందు జననమైన జ్యేష్ట సోదరునకు హాని.

**మూల నక్షత్రం విశేష వివరణ**

ఈనక్షత్రమందు జననమైన ప్రబలమైన హోమశాన్త్యాదులు చేయవలయును. నక్షత్ర ఆద్యన్త ఘడియలను 12భాగములు చేయగా 1వభాగం తండ్రికి, 2వభాగం తల్లికి, 3వభాగం సోదరులకు, 4వభాగం తోబుట్టువులకు, 5వభాగం మేనమామలకు, 6వభాగం మేనత్తకు, 7వభాగం పినతల్లి,పెద్దతల్లికి, 8వభాగం మామలకు, 9వభాగం శిశువునకు, 10వభాగం అందరికి హాని 11వభాగం ధనమునకు, 12వభాగం అభివృద్ధికి హాని కల్గును.

**ఏక నక్షత్ర జనన శాంతి వివరణ**

శ్లో॥ **ఏకస్మిన్నేవ నక్షత్రే భ్రాత్రోర్వా పిత్రు పుత్రయోః ।**
**ప్రసూతిశ్చ తయోర్మృత్యుః భవేదేకస్య నిశ్చయః ॥**

శ్లో॥ **భ్రాత్రోఃభ్రాతృభగిన్యో రిత్యర్థః ।**
**పిత్రోః నక్షత్రే పుత్రదుహిత్రోః యతిప్రసూతి రిత్యర్థః ॥**

**భావం :-** తండ్రిజన్మనక్షత్రమందు గాని సోదరుడి లేదా సోదరీ జన్మనక్షత్రమందు గాని పితామహుని జన్మనక్షత్రమందు గాని మాతామహుని జన్మనక్షత్రమందు గాని శిశువు జననమైన యెడల ఎవరి నక్షత్రములో జననమైనాడో వారికి మృత్యుగండము. కావున వారు ఆ శిశువు ప్రతిబింబమును తైలములో చూడవలయును. మరియు గోయమళ జనన శాంతి చేసుకోవలయును.

**(ఆధారం : జ్యోతిర్నిబంధం)**

**పక్ష శ్రాద్ధము వివరము**

రవికన్యలో ప్రవేశించిగానే యముడు సకల జీవులను భూలోకంలోనికి పంపును. వారు తమ వంశస్థులుగాని, బంధుమిత్రులుగాని, ధర్మాచరణపరులుగాని తమకు శ్రాద్ధాదులాచరింతురేమోనను ఆశతో సంచరించిన కర్మ చేయబడిన సమస్త జీవులు ఉల్పాపాత భూకంపాది భీభత్సమృతులు ఆనాథలు శ్రాద్ధఫలం పొంది వారు ఆచరించిన వారికి సమస్త సుఖములు కలుగునట్లు ఆశీర్వదింతురు. మరియు సప్త గోత్రముల వారి 101 వంశీయులు కూడా తరింతురు. తండ్రి తిథియందు లేక తల్లి తిథియందు లేదా ద్వాదశీ ఆమావాస్యయందుగాని పక్షాశ్రాద్ధ, పక్షశ్రాద్ధము ఆచరించవలెను. కాని మాతాపిత్రాదుల తిథిని ఏ పరిస్థితులలో కూడా విడవకూడదు. పక్షములోనే తిథి సంభవించిన తిథి ఆచరించి మరుసటి దినమున పక్షము ఆచరించవలెను. సితృతిథి శ్రేష్టము, మాతృతిథి మధ్యమం మిగతా ప్రతినెల తిథియందు కూడా బ్రాహ్మణ భోజనం పెట్టవలెను గాని శుభకార్యములు చేయరాదు.

**వాయసాది దోష విషయములు**

ఇంటిలోనికి కాకిగాని, గ్రద్దగాని, ద్వారము గుండా వెళ్ళినచో ఒక మాసము, కుక్క చేత తరుమబడి ఇంటిలోనికి వచ్చిన ఇంటిలో ఉండువారికి అందరికి దోషము. ద్వారం గుండా వచ్చి వేరే ద్వారం గుండా వెళ్ళినచో ఆరు మాసములు గృహ మధ్యమందు దక్షిణ భాగం ఈశాన్య, ఆగ్నేయ, నైరుతియందు పుట్టలు గాని మొండి చేతులు గాని తేనె తెట్టలుగాని మొలచినను ఇంటిలోనికి ఉడుముగాని, పైడి కట్టె, పంతరాగం, పెద్దపిట్ట కౄర పక్షులుగాని ప్రవేశించిన మృత్యు దోషము కలుగును. కావున అట్టి ఇంటిని ఆరు మాసములు విడిచిపెట్టి అనంతరము **ఉదకశాంతి, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము చేసినచో అట్టి దోషము పరిహారమై శుభములు కలుగును.**

కాకి గాని, గ్రద్దగాని, గుడ్లగూబగాని పైడికట్టె, పంతరాగం, పెద్ద పిట్ట మొదలగు క్రూర పక్షులు తాకినా, కాక మైధునం చూచినా, మోదుగ కట్టెలతో **"యత ఇన్ద్రభయామహే"** అను మంత్రమనుచు (1008) గాని (108) గాని చెరుహోమం చేయవలయును. మరియు(101) మందికి (11) మందికిగానీ బ్రాహ్మణులకు భోజనము పెట్టిన కీడు తొలగును. తేనె పట్టులు, గుడ్లగూబ పుట్టలు, ఉప్పలి హస్తములు గృహానికి ఈశాన్య, మధ్య, ఆగ్నేయ, వాయువ్య దిశలయందు గృహావరణములో ఎక్కడ వచ్చినను ప్రాణహాని కలుగును. దోష నివృత్తి కోసం మూడు మాసములు గృహమును విడిచిపెట్టి శాస్త్రోక్తముగా శాంతి నిర్వహించవలెను.

**ఆగ్నేయ దిశమున గుడ్లగూబ** వాలినచో శిశు నాశనము, వాయువ్యమున వాలిన కళత్రనాశనము, ఈశాన్యమున వాలిన శరీర నాశనము, మొదటి జామున ఇంటిమీదకు ఎక్కిన కష్టము, రెండవ జామున నష్టము, మూడవ జామున దుఃఖము, నాల్గవ జామున, శుభము.

**మృత విషయమై దుష్ట తిథి- వార నక్షత్రములు**

1-4-6-8-12-13-14-30 ఈ తిథుల యందును, ఆది, మంగళ, శుక్రవారముల యందు కృత్తిక, రోహిణి, మృగ, పున, మఘ, ఉప, చిత్త, విశా, ధని, శత, పూభా, ఉభా, రేవతి ఈ నక్షత్రముల యందు మృతి సంభవించిన గృహమునకు దోషము.

కేవలం తిథి వల్ల దోషం లేదు. తిథి, వారం వల్ల, స్వల్ప దోషము తిథి నక్షత్రం వల్ల అర్ధ దోషము, వారనక్షత్రము త్రిపాదదోషము. తిథి వార నక్షత్రముల వలన సంపూర్ణదోషము కలుగును.

| నక్షత్రం | వర్జ్య సమయం | నక్షత్రం | వర్జ్య సమయం | నక్షత్రం | వర్జ్య సమయం |
|---|---|---|---|---|---|
| **భరణి** | **6 నెలలు** | **మఖ** | **6 నెలలు** | **శతతార** | **6 నెలలు** |
| **కృత్తిక** | **4 నెలలు** | **చిత్త** | **3 నెలలు** | **పూ॥భా॥** | **6 నెలలు** |
| **రోహిణి** | **6 నెలలు** | **విశాఖ** | **4 నెలలు** | **ఉ॥భా॥** | **6 నెలలు** |
| **మృగశిర** | **3 నెలలు** | **ఉ॥షా॥** | **4 నెలలు** | **రేవతి** | **6 నెలలు** |
| **పునర్వసు** | **4 నెలలు** | **ధనిష్ఠ** | **6 నెలలు** | | |

**రజస్వల విషయములు :-**

శుక్ల, కృష్ణపక్షములలో 1, 4, 6, 9, 12, 14, 15, 30 ఆది, మంగ, శనివారములు భర, కృత్తి, ఆర్ద్రా, పున, ఆశ్లే, మఖ, పుబ్బ, జ్యేష్ట, పూషా, పూ.భాలయందును. వర్జ్య దుర్ముహూర్తముల యందును, ప్రథమ రజస్వల అయిన శాస్త్రయుక్తముగా శాంతి చేసిన శుభములు కలుగును. కృత్తి 4, మఖ, ఆర్ద్రా 5, జ్యేష్ట, పున, ఆశ్లే, పుబ్బ, పూషా 1, 2 భరణి 2, మాసములు పతి సంయోగము పనికి రాదు. ప్రాతఃకాలమున సౌభాగ్యవతి పూర్వాహ్ణం తీర్థయాత్రలు చేయునది మధ్యాహ్నం ధనవతియు, సాయంకాలం జారిణయు, సంధ్యలయందు దుశ్చేష్టురాలు, పూర్వరాత్రియందు దీర్ఘాయువు గలది, అర్థరాత్రి యందు విధవయు, ఉషః కాలంయందు సౌభాగ్యహీనురాలగును. భర్త జన్మనక్షత్రమందైనను విధవయగును.

మేషము, సింహము, వృశ్చిక, మకర, కుంభ లగ్నములయందు గాక మిగిలిన లగ్నముల యందు రజస్వల అయిన శుభప్రదము. నీలి వస్త్రము, రక్త వస్త్రము, చిత్ర వస్త్రము, జీర్ణ వస్త్రము, వస్త్రము లేకుండుట గాక మిగిలిన వస్త్రముల యందు రజస్వల అయిన శుభప్రదము. ఇతరుల గృహముల యందు, ఇతర గ్రామముల యందు, మార్గమందుగాక స్వగృహమందే అయిన శుభప్రదము.

**ప్రారంభ దిన నిర్ణయము :** స్త్రీలు రజస్వల అయినప్పుడు, ప్రసవించినపుడు, మైల కలిగినపుడు రాత్రి ప్రమాణమును మూడు భాగములు చేసి అందు మొదటి రెండు భాగములలో అయిన పూర్వ దినము, చివరి మూడవ భాగమున అయిన మరుసటి దినముగా లెక్కించవలయును.

## మృత సమయము నందు ఆశౌచ సమయ నిర్ణయ చక్రము

| మృతిచెందిన వారు (బాంధవ్యము) | పురుషులకు ఆశౌచ సమయం | స్త్రీలకు ఆశౌచ సమయం |
|---|---|---|
| 1. తల్లి | 10 రోజులు | 3 రోజులు |
| 2. తండ్రి | 10 రోజులు | 3 రోజులు |
| 3. తండ్రి యొక్క తండ్రి (తాత) | 10 రోజులు | 1 1/2 రోజు |
| 4. తండ్రి యొక్క తల్లి (నానమ్మ) | 10 రోజులు | 1 1/2 రోజు |
| 5. చిన్నాన, పెద్దనాన్న (పితృవ్యులు) | 10 రోజులు | స్నానం |
| 6. పితృవ్యుల భార్యలు | 10 రోజులు | స్నానం |
| 7. తండ్రి యొక్క మేనత్త | 1 1/2 రోజు | స్నానం |
| 8. తండ్రి యొక్క మేనత్త కుమారులు | 1 1/2 రోజు | స్నానం |
| 9. తండ్రి యొక్క పిన తల్లులు, పెద్ద తల్లులు (నానమ్మ తోబుట్టులు) | 1 1/2 రోజు | - |
| 10. నానమ్మ తోబుట్టువుల కుమారులు | 1 1/2 రోజు | - |
| 11. తండ్రి యొక్క మేనమామ | 1 1/2 రోజు | - |
| 12. తండ్రి యొక్క మేనమామ కుమారులు | 1 1/2 రోజు | - |
| 13. తల్లి యొక్క తండ్రి తోబుట్టువులు (తల్లి మేనత్త) | 1 1/2 రోజు | - |
| 14. తల్లి యొక్క మేనత్త కుమారులు | 1 1/2 రోజు | - |
| 15. తల్లి యొక్క మేనమామ | 1 1/2 రోజు | - |
| 16. తల్లి యొక్క మేనమామ కుమారులు | 1 1/2 రోజు | - |
| 17. తల్లి యొక్క తోబుట్టువులు (పిన్నమ్మలు, పెద్దమ్మలు) | 1 1/2 రోజు | 1 1/2 రోజు |
| 18. తల్లి యొక్క తోబుట్టువుల కుమారులు | 1 1/2 రోజు | స్నానం |
| 19. తండ్రి యొక్క తోబుట్టువులు (మేనత్తలు) | 1 1/2 రోజు | స్నానం |
| 20. మేనత్త | 1 1/2 రోజు | స్నానం |
| 21. మేనత్త కుమారులు | 1 1/2 రోజు | - |
| 22. మేనమామ | 1 1/2 రోజు | 1 1/2 రోజు |
| 23. మేనమామ కుమారులు | 1 1/2 రోజు | 1 1/2 రోజు |
| 24. సవితి మేనమామ | 1 1/2 రోజు | 1 రోజు |

| మృతిచెందిన వారు (బాంధవ్యము) | పురుషులకు ఆశౌచ సమయం | స్త్రీలకు ఆశౌచ సమయం |
|---|---|---|
| 25. అనుపనీత మేనమామ | $1^1/_2$ రోజు | $1^1/_2$ రోజు |
| 26. సొంత మేనమామ భార్య | $1^1/_2$ రోజు | $1^1/_2$ రోజు |
| 27. ఉపనీత మేనల్లుడు | 3 రోజులు | – |
| 28. సాపత్ని మేనల్లుడు | 3 రోజులు | – |
| 29. అనుపనీత మేనల్లుడు | $1^1/_2$ రోజు | – |
| 30. మేనకోడలు | స్నానం | – |
| 31. తల్లి యొక్క తండ్రి (మాతమహుడు) | 3 రోజులు | 3 రోజులు |
| 32. తల్లి యొక్క తల్లి (మాతామహీ) | 3 రోజులు | 3 రోజులు |
| 33. అనుపనీత దౌహిత్రుడు | $1^1/_2$ రోజు | $1^1/_2$ రోజు |
| 34. ఉపనీత దౌహిత్రుడు | 3 రోజులు | 3 రోజులు |
| 35. దౌహిత్రి | స్నానం | స్నానం |
| 36. పిల్లనిచ్చిన అత్తమామలు (శ్వశురం) | $1^1/_2$ రోజు | – |
| 37. స్వంత అల్లుడు | 1 రోజు | 1 రోజు |
| 38. ఉపనీత భార్య సోదరుడు | 1 రోజు | – |
| 39. భార్య మృతి అనంతరం శ్యాలక మృతి జరిగిన | స్నానం | – |
| 40. అనుపనీత భార్య సోదరుడు | స్నానం | – |
| 41. భార్య యొక్క సోదరి | స్నానం | – |
| 42. తమ్ముని బిడ్డ (వివాహిత) | స్నానం | – |
| 43. నామకరణాత్పూర్వం మగ శిశువు మృతి | తండ్రి 3 రోజులు న పిండులకు స్నానం | తల్లికి 3 రోజులు |
| 44. నామకరణాత్పూర్వం ఆడ శిశువు మృతి | తండ్రికి 1 రోజు సపిండులకు స్నానం | తల్లికి 1 రోజు |
| 45. అనుపనీత సోదరుడు | 3 రోజులు | పెళ్లయిన అక్కా చెల్లెలకు స్నానం |
| 46. మూడు సంవత్సరముల నుండి యుక్తవయస్కురాలైన అవివాహిత మృతి | తండ్రికి 3 రోజులు సపిండులకు 1 రోజు | తల్లికి 3 రోజులు |

| మృతిచెందిన వారు (బాంధవ్యము) | పురుషులకు ఆశౌచ సమయం | స్త్రీలకు ఆశౌచ సమయం |
|---|---|---|
| 47. కన్యాదాన వాగ్దానానంతరం అవివాహిత మృతి | తండ్రికి 3 రో॥లు కాబోయే భర్తకు 3 రోజులు | తల్లికి 3 రోజులు |
| 48. వివాహిత కన్య పితృగృహమందు మృతము చెందినచో | తండ్రికి 3రోజులు సోదరులకు 3రో॥ సపిండులకు స్నానం | తల్లికి 3 రోజులు |
| 49. వివాహిత కన్య భర్తృ గృహమందు మృతము చెందినచో | తండ్రికి $1\ ^1/_2$ రో. సోదరులకు $1\ ^1/_2$ రోజు | తల్లికి $1\ ^1/_2$ రో. సోదరీమణులకు 1 రోజు |
| 50. దత్తత పుత్రుడు | జనకపిత 3 రో॥ | జనకమాత 3రో. |
| 51. జనక పితమృతి | 3 రోజులు | 3 రోజులు |
| 52. జనకమాత మృతి | 3 రోజులు | 3 రోజులు |
| 53. పెండ్లికాని చిన్నమ్మల, పెద్దమ్మల మృతి | $1\ ^1/_2$ రోజు | 1 రోజు |
| 54. పెళ్లయిన సొంత అక్కాచెల్లెల్లు | $1\ ^1/_2$ రోజు | $1\ ^1/_2$ రోజు |
| 55. సొంత అక్కాచెల్లెళ్ల భర్త (బావ) | $1\ ^1/_2$ రోజు | - |
| 56. ఉపనీత సోదరుడు | 10 రోజులు | 3 రోజులు |
| 57. సహాధ్యాయి | 1 రోజు | స్నానం |
| 58. మిత్రుడు | 1 రోజు | స్నానం |
| 59. రాజు (పరిపాలకుడు) | నక్షత్ర దర్శనం | స్నానం |
| 60. ఇంటి పురోహితుడు | 1 రోజు | స్నాం |
| 61. శిష్యుడు | 1 రోజు | స్నానం |
| 62. గురువు | $1\ ^1/_2$ రోజు | స్నానం |
| 63. పెంపుడు జంతువు | దాని దేహం గృహమందు ఉన్నంత వరకు ఆశౌచం | |

## మహాలయ పిండ ప్రదాన వివరణ చక్రం

| ధర్మ పిండాః | | | ధర్మ పిండాః | | ధర్మ పిండాః | |
|---|---|---|---|---|---|---|
| | 31. స్వామినః | | | 32. గురుః | 33. రిక్థిన్ | |
| 28. శ్వశుర | 30. శ్యాలక | 29. శ్వశ్రూ | | | 23. పితృభగినీ | |
| | | | 24. మాతృభగినీ | 26. భావుక | 22. భాగినేయక | 20. భగినీ |
| | | | | 25. జామాతా | 21. దౌహిత్రః | 19. దుహితా |
| 10. మాతుః ప్రపితామహ | | 13. మాతుః ప్రపితామహి | 3. ప్రపితామహ | 17. పితృవ్య | | 6. ప్రపితామహి |
| 9. మాతుః పితామహ | | | 2. పితామహ | 16. భ్రాతృ | | 5. పితామహి |
| | 18. మాతుల | 12. మాతుః పితామహీ | 1. పితృ | 15. సుత | 27. స్నుషా | 4. మాతృ |
| 8. మాతామహ | | 11. మాతామహి | | | 7. సాపత్నీ మాతృః | |
| | | | 14. ఆత్మ పత్నీ | | | |

## గురు గ్రహ సంచారమును అనుసరించి పుష్కరములేర్పడు నదులు

| | | | |
|---|---|---|---|
| 1. మేష గురుడు | గంగానది | 7. తులా గురుడు | కావేరి నది |
| 2. వృషభ గురుడు | నర్మదా నది | 8. వృశ్చిక గురుడు | భీమ నది |
| 3. మిథున గురుడు | సరస్వతి నది | 9. ధను గురుడు | బ్రహ్మపుత్ర నది |
| 4. కర్కాటక గురుడు | యమున నది | 10. మకర గురుడు | తుంగభద్ర నది |
| 5. సింహ గురుడు | గోదావరి నది | 11. కుంభ గురుడు | సింధూ నది |
| 6. కన్యా గురుడు | కృష్ణా నది | 12. మీన గురుడు | ప్రణీతా నది |

## పుష్కరకాలంలో పన్నెండు (12) రోజులు చేయవలసిన దానములు

| | |
|---|---|
| **1వ రోజు** భూ ధాన్య రజిత అన్నదానములు | **7వ రోజు** గృహ, శయ్యా దానములు |
| **2వ రోజు** గో మణి లవణ వస్త్రదానములు | **8వ రోజు** పుష్ప, పీఠ దానములు |
| **3వ రోజు** గో గుడ శాక, ఫల దానములు | **9వ రోజు** సాలగ్రామ, కన్యాదానములు |
| **4వ రోజు** తైల క్షీర ఘృత దానములు | **10వ రోజు** పుష్ప,ముక్త, సువర్ణదానములు |
| **5వ రోజు** ధాన్య వృషభ దానములు | **11వ రోజు** పుస్తక, తాంబూలదానములు |
| **6వ రోజు** చందన ఔషధ దానములు | **12వ రోజు** షోడశ దానములు |

## బల్లిపడుట వలన కలుగు ఫలితములు

తలమీద లక్ష్మీకరము.
నడి నెత్తిమీద రోగము.
కుడినెత్తిలో సోదరునకు భయము.
నెత్తి వెనుక తమ్మునకు భయము.
బ్రహ్మరంధ్రమునకు ముందు మేనమామకు చేటు.
బ్రహ్మరంధ్రమునందు మృత్యు భయము.
ముఖమునందు ధనలాభము
ముంగురములమీద హాని
కేశాంతమందు వ్యసనము,మరణము
జుట్టు మీద కష్టము
జడమీద పతికి మృత్యువు
ముచ్చిలిగుంటలో భారము మోయుట
పాదమందు కళ్యాణము
గంధస్థలమందు (పురుషులకు) బంధువులు వత్తురు
(స్త్రీలకు అశుభం, చెవి దగ్గర, చెంప మీద స్త్రీలకు శుభం)
తల ముసుగుల మీద స్త్రీలకు మిక్కిలి కీడు,వైధవ్య సూచన
చెవి మీద – దుర్వార్త వినుట
కనుబొమ్మల మీద – ధనలాభము
కను బొమ్మల మధ్య – కలహ సూచకము
కుడికన్ను పరాజయము
ఎడమకన్ను అవమానము
ముక్కు మీద కార్యహాని
ముక్కు కొనయందు పరాజయము
ముక్కు ప్రక్కన మిత్రలాభము
మీసం మీద అధిక లాభము
పై పెదవియందు భూలాభము
క్రింది పెదవియందు అన్న లాభము
నాలుకయందు విద్యాలాభము
గడ్డం మీద అపమృత్యువు
దంతముల మీద భూమి నష్టము
గడ్డం వెంట్రుకల మీద కారాగృహ ప్రాప్తి
వెనుక మెడయందు మరణభయం
ముందు తట్టు కంఠమందు బుద్ధి నాశనము
గొంతు యముకమీద ఉభయ సంకటములు
రొమ్మున జయము
గుండెమీద అధైర్యము
పై కడుపున పుత్రలాభము
బొడ్డున భయము
కడుపు ప్రక్కన ఆరోగ్యము
భుజములయందు సహాయము తీసుకొనుట
రెక్కల యందు – యత్నకార్యభంగము
అరచేతియందు – ద్రవ్యలాభము
మోచేతియందు – సహాయ నాశనము
మణిబంధమున – గర్వభంగము
గోళ్ళయందు – జంతు భయము
చంకయందు – ప్రేత భయము
వెన్నున శతృ భయము
వెన్నెముకయందు పిశాచ భయము
నడుము వెనుక – వస్త్ర లాభం
పిరుదున – శయ్యా లాభము
తొడ వెనుక – విషభయము
తొడమీద – సుఖము (స్త్రీకి – వ్యభిచారము)
తొడ మొదట – బరువు తగ్గుట
శిష్నమందు – సంతానము
శిష్నాగ్రహమున – దాంపత్య భంగము
శిష్న రోమములయందు – దేశ భ్రమణము
వృషణములయందు– చోరత్వము
గుదముయందు – ఆయుద భయం
మోకాలియందు – వాహన లాభము
మోకాలి సంధియందు – వాహన భ్రష్టత్వము
మోకిల క్రింద – వాతరోగము,వైద్య మూలక ధన వ్యయము
పిక్కలయందు – కార్యానుకూలము
మోకాలి క్రింద ఎముక మీద – వ్యాపార లాభము
పాదము ఎముక మీద – కార్యహాని
పాద సంధియందు – రోగము
పాదముల వెనుక – కారాగృహ ప్రవేశము
వ్రేళ్ళయందు – రోగము
అరికాళ్ళయందు – రాజ్య లాభము కలుగును.

## శరీరం అదురుట వలన కలుగు ఫలితములు

కుడిప్రక్క – మేలు, ఎడమప్రక్క–మధ్యఫలము, నడినెత్తిన–మృష్టాన్నము, నొసలు–మేలు, కుడిచెంప–రాజభయం, ఎడమచేయి–ఉద్యోగం, స్త్రీలకు కుడికన్ను – కీడు, ఎడమకన్ను – శుభము, పురుషులకు ఎడమకన్న – కీడు, కుడికన్ను – మేలు, రెండు కన్నులు అదిరిన–మేలు, ముక్కు–రోగము, పై పెదవి–కలహము, క్రింది పెదవి–భోజన సౌఖ్యము, గడ్డము–లాభము, కుడి చెక్కిలి–ధనము, ఎడమ చెక్కిలి–దొంగల భయము, కుడి భుజము–సంభోగము, ఎడమ భుజము–కీడు, రొమ్ము–ధనము, చేతులు–వాహన లాభము, అరచేయి–సంతానము, కుడి తొడ–రాజభయం, మోకాళ్ళు–జాడ్యము, మీగాళ్ళు–ధనలాభము, అరికాళ్ళు–సౌఖ్యము, పిక్కలు–ఆభరణ ప్రాప్తి.

## ప్రయాణ సంబంధ విషయములు

**అన్ని దిక్కులకు ఉత్తమ తిధులు :** శుక్లపక్ష మందు-బహుళపక్షమందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి మరియు శుక్లపక్ష త్రయోదశి, మంచివి. **మంచి నక్షత్రములు :** అశ్వ, మృగ, పున, పుష్య, హస్త, అనూ, మూల, శ్రవ, ధని, రేవతి. **మధ్యమ నక్షత్రములు :** రోహిణి, ఉత్తర, ఉ॥షాఢ, ఉ॥భాద్ర, శతభిషం. మిగిలిన నక్షత్రములు ప్రయాణమునకు దోషం.

## ప్రయాణ విషయమై తిధి, నక్షత్ర, వారశూలలు - కూడనవి

**1. తూర్పునకు :** 1,9 తిధులు; శని, సోమవారములు; జ్యేష్ఠ, ధనిష్ఠ నక్షత్రములు; తుల, కుంభలగ్నములు పనికిరావు.

**2. ఆగ్నేయమునకు :** 3,11 తిధులు; గురు, శనివారములు కూడదు. మకర లగ్నం పనికిరాదు.

**3. దక్షిణమునకు :** 5, 13 తిధులు; గురువారం; శ్రవణం, అశ్వని నక్షత్రములు; మీన, వృశ్చిక లగ్నములు మంచివికావు.

**4. నైఋతికి :** 4,12 తిధులు; సోమ, శుక్రవారములు; కర్కాటకలగ్నముకూడదు.

**5. పడమరకు :** 6,14 తిధులు; ఆది, శుక్రవారములు; పుష్యమి, రోహిణి నక్షత్రములు; ధనస్సు, సింహలగ్నములు మంచివికావు.

**6. వాయవ్యమునకు :** 7,15 తిధులు; ఆది, మంగళవారములు; మేష లగ్నము పనికిరావు.

**7. ఉత్తరం :** 2,10 తిధులు; మంగళ, బుధవారములు; హస్త, పుబ్బ నక్షత్రములు, వృషభ, కన్యాలగ్నములు మంచివికావు.

**8. ఈశాన్యం :** 8,30 తిధులు, బుధవారం, మిధునలగ్నము పనికిరావు.

నవమీ ఆదివారం, ఏకాదశీ సోమవారం, పంచమీ మంగళవారం, తదియా బుధవారం, షష్ఠీ గురువారం, అష్టమీ శుక్రవారం, ద్వాదశీ శనివారం ఇవి దగ్ధయోగ ములు గాన ఆ రోజులలో ప్రయాణము చేయరాదు. కష్టనష్టములు, చిక్కులు కలుగును.

## ప్రయాణమునకు చుక్కెదురు దోషము

చుక్కెదురు పోకూడదని శాస్త్రవచనం. శుక్ర నక్షత్రాన్నే చుక్క అని వాడుకలో పిలుస్తుంటారు. ఈ శుక్రనక్షత్రం కొన్ని మాసములు తూర్పు దిక్కునందు, మరికొన్ని మాసములు పశ్చిమదిశయందు నుండగలదు. పంచాంగమును బట్టి చుక్కగల దిక్కు తెలుసుకొని చుక్క తూర్పున యున్న ప్పుడు తూర్పు ఈశాన్య-ఉత్తర-వాయువ్య దిక్కులకు, పశ్చిమదిశయందు న్నప్పుడు పడమర-నైఋతి-దక్షిణ-ఆగ్నేయ దిక్కులకు ప్రయాణమై పోకూడదు. (గమ్యస్థానమున్న దిశయే ప్రధానం) ముఖ్యంగా చుక్కెదురు దోషం గర్భిణీ స్త్రీలకు, బాలింతరాళ్ళకు, శిశువులకు, సంవత్సరంలోపల తల్లి శిశువులకు, యాత్రికులకు (తీర్ధయాత్ర చేయువారు) వర్తించగలదు. దైనందిన జీవితంలో చేయవలసిన ప్రయాణములకు ఈ దోషం వర్తించదు. మరియు ఒకే గ్రామమునందు చుక్కెదురు దోషముండదు. వివాహం నిమి త్తంగా వెళ్ళువారికి, యోగులకు, జ్ఞానులకు, రోగార్తులకు ఆకలి కల్గి అన్నా ర్తులై వెళ్ళువారికి, యాచకులకు, దేశోపద్రవములు సంభవించినప్పుడు, రాజభయపీడితులకు, శత్రుపరాజితులై ప్రాణభీతితో వెళ్ళువారికి, ఈ అభిముఖ శుక్రదోషం ఉండదు, మరియు భరద్వాజ, అత్రి, అంగీరస, కాశ్యప, భృగు వశిష్ఠ, గర్గ, గౌతములను ఋషి గోత్రములు గలవారికి చుక్కెదురు దోషం లేదు. వివాహమైన పిమ్మట 16 దినములు లోపల భర్తతో సహా భర్త గృహమును ప్రవేశించుటకు ప్రయాణమగు నూతన వధువునకు, పితృగృహమందే రజస్వలయైన కన్యకు ఈ చుక్కెదురు దోషం లేదని కొన్ని గ్రంథములు దెల్పుచున్నవి.

## సు స్వప్నములు (కలలు)

ఫలవృక్షములు, రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, మేడ, పర్వత ములు, వీటిని ఎక్కుట, రాజు, రాజలాంఛనములు, బంగారం, ఎద్దు, ఆవు, పండ్లు, పూలు, గోక్షీరము, గోఘృతము, కన్యక, వేశ్య, రత్నములు, ముత్యాలు, శంఖము, దేవతా విగ్రహములు, చందనము, పుణ్యస్థలం, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, భక్ష్యములు తినుట, పీతాంబరములు, ఆభరణములు ధరిం చుట, జయము పొందుట, దేవతాదర్శనం, సువాసినిలు, విమానయానము, ఉన్నతపదవి నందుట, సన్మాన సత్కారములు, పల్లకి, ఆకాశయానము, గాలిలో తేలిపోవుట, సూర్యచంద్రులు, సాధుపురుషులు, గురువులు, స్త్రీ సంగమము, తల్లి, చెల్లి, భార్య, వదిన, అత్త, సంగీత సాధనములు, నాట్యము, కల్లు, అగ్ని (మంటలు), నక్షత్రములు, ప్రవహించునదులు, ఉద్యాన వన ములు, స్వప్నమందు కనుపించుట శుభప్రదము.

## దు స్వప్నములు

సముద్రమున పడుట, బురదలో కూరుకుపోవుట, ప్రవాహమున కొట్టుకు పోవుట, వాహనం నుండి పడుట, చెరసాలలోనుండుట, ఏడ్చుట, అరచుట, మృతివార్త వినుట, క్షౌరం చేయించుకొనుట, ముండ్ల పొదలో చిక్కుట, పర్వతం నుండి జారుట, తన గొంతుకు ఉరి తగిలినట్టు, తనను ఇతరులు కొట్టినట్లు, తన చేతిలోని ఫలవస్తువులను ఇతరులు లాక్కొనుట, సర్పం, దున్నపోతు, గాడిద, కాకి, పిల్లి, నక్క, ఆముదము, తిలభాండము, నువ్వులు, నల్లని ద్రవ్యములు, ఊక, బూడిద, బొగ్గులు, ఎముకలు, ఆయుధాలు, యముడు, యమదూతలు, భూత, ప్రేతపిశాచాలు, క్షుద్రవ్యక్తులు, మంత్రగాళ్ళు, వైద్యుడు, రక్షకభటులు, సంకెళ్ళు, ఇతర ఇనుప గొలుసులు, మంత్రసాని, బిచ్చగత్తె, చాకలిస్త్రీ, రోగగ్రస్తులు. రైలుబండి ఓడ, పడవ, అరణ్యము, క్రూరజంతువులు, వేట, శవములు, స్మశానం, సన్యాసి, రక్తం, పొగ, మలినవస్త్రములు ధరించినట్లు, ఆకాశం నుండి క్రింద పడుచున్నట్లు, దున్న, గాడిదలను ఎక్కినట్లు, తనకు శిక్షపడినట్లు, విధవా స్త్రీ, పసిపిల్లలు, చీకటిగుహలు, శత్రువు, కోతి మొ॥నవి దుష్టస్వప్నములు చెడును సూచించును, అశుభ ప్రదము.

## ఔషధ సేవా శుభకాలము

ఆది, మంగళ, గురు, శుక్రవారములందు గల అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతీ నక్షత్రములందు రోగికి తారాబలము గల నక్షత్రం గల దినమందు శుభగ్రహ హోరాకాలంలో ఔషధసేవనము ప్రారంభించుట శుభప్రదము.

## క్షౌరమునకు శుభాశుభములు

క్షౌరము చేసుకొనుటకు 2,3,5,7,10,13 తిథులు సోమ, బుధ, గురువారములు అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, జ్యేష్ట, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతీ నక్షత్రములు. భోజనాత్పూర్వము ప్రాతఃకాలము శుభప్రదము.

తూర్పులేక ఉత్తరముఖముగా కూర్చుని క్షౌరము చేయించుకొనవలెను. ముందు కుడివైపు ప్రారంభించవలెను. పుణ్యక్షేత్రము లందు వివాహ యజ్ఞాదిదీక్షా కాలములందు, రాజాజ్ఞ లందు, మృతసూతక, ప్రాయశ్చిత్తాది కార్యములందు, నిషిద్ధ తిథివారాదుల యందు కూడా దోషము లేదు.

## తలంటు, నూతన మంచము నేత, క్షౌరము, నూతన వస్త్రధారణలకు ఫలములు

| వారములు | తలంటు | మంచం నేత | వస్త్రధారణ | క్షౌరకర్మ |
|---|---|---|---|---|
| ఆదివారము | సంతానం | ధనలాభం | చిరుగుట | నెల రోజులు ఆయుక్షీణం |
| సోమవారము | శాంతి | సౌఖ్యం | చింతన | 7 నెలలు ఆయుర్వృద్ధి |
| మంగళవారము | అల్పాయువు | దుఃఖం | శుభహాని | 8 నెలలు ఆయుక్షీణం |
| బుధవారము | ధనలాభం | పీడ | ధనప్రాప్తి | 5 నెలలు ఆయుర్వృద్ధి |
| గురువారము | ధననష్టం | సౌఖ్యం | జ్ఞానవృద్ధి | 10 నెలలు ఆయుర్వృద్ధి |
| శుక్రవారము | సౌఖ్యహాని | రాజ్యలాభం | మిత్రప్రాప్తి | 11 నెలలు ఆయుర్వృద్ధి |
| శనివారము | సర్వలాభం | నాశనం | మాలిన్యత | 7 నెలలు ఆయుక్షీణం |

## రవ్యాది గ్రహ స్వభావ స్వక్షేత్రాది వివరములు ( వసిష్ఠ సంహిత )

| శ్రీరస్తు | జాతి | అధికారం | నీతి తత్వం | వర్ణం | స్వభావం | స్వక్షేత్రం | ఉచ్ఛరాశి | నీచరాశి | కారకములు | గ్రహదృష్టి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **రవి ః** | క్షత్రియ | రాజు | దండనీతి | ఎర్రని | పైత్య | సింహం | మేషం | తుల | ఆత్మబలం,పితృసౌఖ్యం,రాజయోగం, వ్యవహారములకు. | 7వ |
| **చంద్ర ః** | వైశ్య | రాజు/రాణి | దాననీతి | తెలుపు | సౌమ్య | కటకం | వృషభం | వృశ్చికం | మనోబలం,సుగంధం,ఉదకం,మాతృ విషయములకు. | 7వ |
| **కుజ ః** | క్షత్రియ | యువరాజు | దండనీతి | ఎర్రని | క్రూర | మేషం,వృశ్చికం | మకరం | కటకం | భూ,గృహ,క్షేత్ర,వాహన,సోదర,సేవక,సాహస,శస్త్ర, రోగాదులకు. | 4వ,7వ,8వ. |
| **బుధ ః** | వైశ్య | సేనాధిపతి | భేదనీతి | ఆకుపచ్చ | ద్విస్వ | కన్య,మిధునం | కన్యా | మీనం | గణితం,కావ్యం,శిల్పం,ఉపాసన,జ్యోతిషం, విద్యబుద్ధి,మేనమామ. | 7వ |
| **గురు ః** | బ్రాహ్మణ | మంత్రి | సామనీతి | బంగారు | మృదు | ధను,మీన | కటకం | మకరం | యజ్ఞం,ఉపాసన,కీర్తి,బంగారం,పుత్రులు, వస్త్రములు,అశ్వాదులకు. | 5వ,7వ,9వ. |
| **శుక్ర ః** | బ్రాహ్మణ | మంత్రి | సామనీతి | తెల్లని | స్థిర | తుల,వృషభం | మీనం | కన్య | భార్య,కామం,క్రీడ,సంగీతం,సుఖం,అభరణాలు, హాస్యతత్వం,సరసాదులకు. | 7వ |
| **శని ః** | శూద్ర | దాసీజన నాయకుడు | భేదనీతి | నల్లని | తీక్షణ | మకరం,కుంభం | తుల | మేషం | ఆయువు,ఆయుధములు,బంధనం,జీవనోపాది, మరణాదులకు. | 3వ,7వ,10వ. |
| **రాహు ః** | చండాల | నీచకుల నాయకుడు | భేదనీతి | ధూమ్ర | చర | కన్య | వృశ్చికం | వృషభం | మాంసం,మద్యం,యవ్వనం,కామం,సేవనం, పూర్వజన్మ,బంధువిరోదాదులకు. | 7వ,3వ |
| **కేతు ః** | మ్లేచ్ఛ | సంకరకులనాయకుడు | భేదనీతి | చిత్ర | చంచల | కుంభం | కన్య | మీనం | ఆలస్యం,నిద్ర,స్వప్నం,జ్ఞానం,మోక్షం,దానం, తంత్రం,వైద్యాదులకు. | 7వ,11వ |

**గ్రహాదులకు మూర్తి నిర్ణయం (గోచార విషయమై)**

జన్మ నక్షత్ర రాశికి గ్రహం ః-1-6-11 రాశులలో ఉన్న స్వర్ణమూర్తి పూర్తిశుభం, 2-5-9 రాశులలో ఉన్న రజిత మూర్తి 3/4 భాగం శుభం, 3-7-10 రాశులలో ఉన్న తామ్ర మూర్తి 1/2 భాగం శుభం, 4-8-12 రాశులలో ఉన్న లోహమూర్తి 1/4 భాగం శుభం.గురు, శుక్రులు స్వర్ణమూర్తులుగా, బుధ, చంద్రులు రజిత మూర్తులుగా రవి, కుజులు తామ్రమూర్తిగా, శని, రాహు, కేతువులు లోహమూర్తులుగా నున్నప్పుడు శుభమునిత్తురు.

# దశాంతర్దశా చక్రము

| అంతర్దశ | రవి దశ 6 సంIIలు | | చంద్ర దశ 10 సంIIలు | | కుజ దశ 7 సంIIలు | |
|---|---|---|---|---|---|---|
| | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| సూర్య | 0-3-18 | 0-3-18 | -- | -- | --- | --- |
| చంద్ర | 0-6-0 | 0-9-18 | 0-10-0 | 0-10-0 | --- | --- |
| కుజ | 0-4-6 | 1-1-24 | 0-7-0 | 1-5-0 | 0-4-27 | 0-4-27 |
| రాహు | 0-10-24 | 2-0-18 | 1-6-0 | 2-11-0 | 1-0-18 | 1-5-15 |
| గురు | 0-9-18 | 2-10-6 | 1-4-0 | 4-3-0 | 0-11-6 | 2-4-21 |
| శని | 0-11-12 | 3-9-18 | 1-7-0 | 5-10-0 | 1-1-9 | 3-6-0 |
| బుధ | 0-10-6 | 4-7-24 | 1-5-0 | 7-3-0 | 0-11-27 | 4-5-27 |
| కేతు | 0-4-6 | 5-0-0 | 0-7-0 | 7-10-0 | 0-4-27 | 4-10-24 |
| శుక్ర | 1-0-0 | 6-0-0 | 1-8-0 | 9-6-0 | 1-2-0 | 6-0-24 |
| రవి | --- | --- | 0-6-0 | 10-0-0 | 0-4-6 | 6-5-0 |
| చంద్ర | --- | --- | --- | --- | 0-7-0 | 7-0-0 |
| అంతర్దశ | రాహు దశ 18 సంIIలు | | గురు దశ 16 సంIIలు | | శని దశ 19 సంIIలు | |
| | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| రాహు | 2-8-12 | 2-8-12 | --- | --- | --- | --- |
| గురు | 2-4-24 | 5-1-6 | 2-1-18 | 2-1-18 | --- | --- |
| శని | 2-10-6 | 7-11-12 | 2-6-12 | 4-8-0 | 3-0-3 | 3-0-3 |
| బుధ | 2-6-18 | 10-6-0 | 2-3-6 | 6-11-6 | 2-8-9 | 5-8-12 |
| కేతు | 1-0-18 | 11-6-18 | 0-11-6 | 7-10-12 | 1-1-9 | 6-9-21 |
| శుక్ర | 3-0-0 | 14-6-18 | 2-8-0 | 10-6-12 | 3-2-0 | 9-11-21 |
| రవి | 0-10-24 | 15-5-12 | 0-9-18 | 11-4-0 | 0-11-12 | 10-11-3 |
| చంద్ర | 1-6-0 | 16-11-12 | 1-4-0 | 12-8-0 | 1-7-0 | 12-6-3 |
| కుజ | 1-0-18 | 18-0-0 | 0-11-6 | 13-7-6 | 1-1-9 | 13-7-12 |
| రాహు | --- | --- | 2-4-24 | 16-0-0 | 2-10-6 | 16-5-18 |
| గురు | --- | --- | --- | --- | 2-6-12 | 19-0-0 |
| అంతర్దశ | బుధ దశ 17 సంIIలు | | కేతు దశ 7 సంIIలు | | శుక్ర దశ 20 సంIIలు | |
| | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం | కాలము | మొత్తం కాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| బుధ | 2-4-27 | 2-4-27 | --- | --- | --- | --- |
| కేతు | 0-11-27 | 3-4-24 | 0-4-27 | 0-4-27 | --- | --- |
| శుక్ర | 2-10-0 | 6-2-24 | 1-2-0 | 1-6-27 | 3-4-0 | 3-4-0 |
| రవి | 0-10-6 | 7-1-0 | 0-4-6 | 1-11-3 | 1-0-0 | 4-4-0 |
| చంద్ర | 1-5-0 | 8-6-0 | 0-7-0 | 2-6-3 | 1-8-0 | 6-0-0 |
| కుజ | 0-11-27 | 9-5-27 | 0-4-27 | 2-11-0 | 1-2-0 | 7-2-0 |
| రాహు | 2-6-18 | 12-0-15 | 1-0-18 | 3-11-18 | 3-0-0 | 10-2-0 |
| గురు | 2-3-6 | 14-3-21 | 0-11-6 | 4-10-24 | 2-8-0 | 12-10-0 |
| శని | 2-8-9 | 17-0-0 | 1-1-9 | 6-0-3 | 3-2-0 | 16-0-0 |
| బుధ | --- | --- | 0-11-27 | 7-0-0 | 2-10-0 | 18-10-0 |
| కేతు | --- | --- | --- | --- | 1-2-0 | 20-0-0 |

# శాస్త్రీయ వాస్తు వివరణ

**శ్లో॥ సమస్తే దేవి గాయత్రి సూర్య మండల వాసిని।**
**బ్రహ్మ విద్యే మహా విద్యే వేదమాతర్నమోస్తుతే॥**
**"వేద పురుషస్య వామనేత్రం వాస్తుః దక్షణ నేత్రం జ్యోతిషీ"**

అను శాస్త్ర వచనానుసారము వేద పురుషుని యొక్క వామనేత్రము వాస్తు శాస్త్రము, దక్షిణ నేత్రము జ్యోతిష శాస్త్రముగా విరాజిల్లుతున్నవి.

ఈ వాస్తు శాస్త్రము **ఆలయవాస్తు, శిల్పవాస్తు, గృహవాస్తు, యంత్రవాస్తు, భూగర్భ (జలార్గళ) వాస్తు** అను ఐదు భాగములుగా భూలోకవాసులకు ఉపయుక్తమవుతున్నది. ప్రస్తుత కాలమందు ఈ వాస్తు శాస్త్రమునకు ఆదరణ అధికముగా ఉన్ననూ శాస్త్రీయ సమ్మతమగు వాస్తు విధానములు కాక పలుపలు విధములుగా వ్యవహరిస్తున్నారు. అందులో అతి ముఖ్యమైనది గృహవాస్తు. సశాస్త్రీయ వాస్తు విధానముతో నిర్మింపబడిన గృహమందు నివాసము వలన సకల క్లేశములు తొలగి శుభములు చేకూరును. సంపూర్ణముగా వాస్తు ప్రకారము నిర్మాణాదులు చేయుట, ఇప్పటి కాలమందు బహుదుర్లభం. అటువంటి సమయమునందు శాస్త్రమునంధు చెప్పబడినట్లుగా కొని ఉపహార క్రియలు చేసుకొనుట వలన శుభములు చేకూరును. **వాస్తు కర్మలయందు జన్మ నక్షత్రము ఉన్ననూ నామ నక్షత్రమే ప్రాధాన్యము.**

## గ్రామార్వాణము (ఊరు అచ్చుబాటు)

ప్రతి ఒక్కరికి అన్ని గ్రామములు శుభప్రదముగా ఉండవు. కావున గ్రామము అనుకూలముగా ఉన్నదా లేదా అని తెలుసుకొనుటకు రెండు పద్ధతులు కలవు.

**1వ పద్ధతి :** గ్రామము యొక్క అక్షర సంఖ్యను నాలుగు చే గుణించి యజమాని యొక్క అక్షర సంఖ్యలను కలుపగా వచ్చిన సంఖ్యను మూడు చే భాగించగా ఒకటి కాని, రెండు కానివచ్చిన శుభప్రదము, సున్న వచ్చిన అశుభప్రదము.

**2వ పద్ధతిః** గ్రామము యొక్క నామ నక్షత్రము నుండి యజమాని నామ నక్షత్రం వరకు లెక్కించగా వరుసగా మొదటి 5 నక్షత్రములు అర్ధ లాభము, 3 నక్షత్రములు ధన లాభము, 5 నక్షత్రములు ధన ధాన్య ప్రదము, 6 నక్షత్రములు దరిద్రము, 1 నక్షత్రము ప్రాణ సంకటము, 4 నక్షత్రములు సంపద, 1 నక్షత్రము పీడ, 1 నక్షత్రము లాభము, 1 నక్షత్రము నష్టము చేకూర్చును. ఈ విధముగా గ్రామము అచ్చుబాటు ఉన్నదా లేదా అను విషయము తెలుసుకొనవచ్చును.

## దిశార్వాణము (దిశ అచ్చుబాటు)

మేష రాశి యందు జన్మించిన జాతకులకు గ్రామమునందు ఉత్తర దిశ శుభ ప్రధము కాదు. వృషభ, మిధున, సింహ, మకర రాశి జాతకులకు గ్రామ మధ్యమము పనికి రాదు. కర్కాటక రాశి జాతకులకు నైరుతి, కన్యారాశి జాతకులకు దక్షిణ దిశ, తులా రాశి జాతకులకు వాయవ్య దిశ, వృశ్చిక రాశి జాతకులకు తూర్పు దిశ, ధనూరాశి జాతకులకు పశ్చిమ దిశ, కుంభ రాశి జాతకులకు ఈశాన్య దిశ, మీన రాశి జాతకులకు గ్రామమునందు ఆగ్నేయ దిశ అశుభం.

## యజమాని నామక్షరమును బట్టి సరిపడు దిశా వివరణ చక్రం

| యజమాని పేరులోని మొదటి అక్షరం | సరిపోయే దిశ | సరిపడని దిశ |
|---|---|---|
| 1. అ నుండి అం వరకు | తూర్పు, పడమర, దక్షిణం. | ఉత్తరం. |
| 2. క,ఖ,గ,ఘ. | దక్షిణం, పడమర. | తూర్పు, ఉత్తరం. |
| 3. చ,ఛ,జ,ఝ,ఞ. | తూర్పు, ఉత్తరం, పడమర. | దక్షిణం. |
| 4. ట.ఠ.డ.ఢ,ణ. | తూర్పు, ఉత్తరం, పడమర. | దక్షిణం. |
| 5. త,థ,ద,ధ,న. | తూర్పు, ఉత్తరం. | దక్షిణం, పడమర. |
| 6. ప,ఫ,బ,భ,మ. | తూర్పు, ఉత్తరం. | దక్షిణం, పడమర. |
| 7. య,ర,ల,వ. | తూర్పు, పడమర, దక్షిణం. | ఉత్తరం. |
| 8. శ,ష,స,హ,ళ,క్ష. | దక్షిణం, తూర్పు. | ఉత్తరం, పడమర. |

## సరియగు స్థలము - వివరణ

గృహ నిర్మాణాదులకు నది ఒడ్డు, కొండ చర్యలు, స్మశాన ప్రాంత స్థలములు పనికిరావు. రావి చెట్టు, చింత చెట్టు నీడలు పడుతున్న స్థలము నిర్మాణమునకు యోగ్యము కాదు. శివాలయమునకు ఎదుట వంద అడుగుల దూరము, విష్ణు ఆలయమునకు వెనుక భాగమున ఇరవై అడుగుల దూరము, దేవి ఆలయమునకు ఇరుపక్కల ఇరువది అడుగుల దూరము, దేవాలయ శిఖర ధ్వజముల నీడ పడు స్థలముల యందు నిర్మాణములు ఎట్టి పరిస్థితులలో చేయుట పనికిరాదు.

గృహ నిర్మాణములకు చతురస్ర, దీర్ఘ చతురస్ర స్థలములు ఉత్తమమైనవిగా చెప్పబడినవి. పశ్చిమ, దక్షిణ, నైఋతి ప్రాంతములు ఎత్తుగా ఉండి, మిగిలిన ప్రాంతములు పల్లముగా ఉండిన శుభప్రదము. తెలుపు రంగు, సుగంధ వాసన కలుగు దర్భలు మొలచిన స్థలము శుభప్రదమైనది. ఎరుపు రంగు, తుంగలు ఉన్న స్థలము, పసుపు రంగు స్థలము మధ్యమము. నలుపు రంగు స్థలము అధమము.

**స్థల పరీక్ష :** సూర్యాస్తమయ సమయమందు గజము లోతు తవ్వి, అందు నీరు నిండుగా పోసి, మరునాడు సూర్యోదయానికి చూడగా నీరు యదాతథముగా ఉన్న మిక్కిలి శ్రేష్టమైన భూమిగా, కొద్దిగా జలము ఉండిన శుభప్రదమైన భూమిగా, నీరు లేక బురదగా ఉండిన మధ్యమ స్థలముగా, నీరు పూర్తిగా ఇంకిపోయిన అధమస్థలముగా గుర్తించవలయును.

## శల్య వాస్తు పరీక్ష

శల్యములు అనగా బొగ్గులు, నూతి (బావి) ఒరలు, ఎముకలు, కుండ పెంకులు, వెంట్రుకలు, సగముకాలిన పదార్థములు వీటిని శల్యములు అని అందురు.

ఈ శల్యములు ఇంటి మధ్యమునందు ఉండిన ఎల్లవేళల గృహమునందు కలహములు కలుగును. పడమర యందు శల్యములు ఉండిన ఆకస్మిక మరణములు కలుగును. తూర్పునందు శల్యములు ఉండిన పశు నష్టములు కలుగును. ఈశాన్యమందు శల్యములు ఉండిన ఇరుగుపొరుగు వారితో ఇబ్బందులు అధికమగును. ఆగ్నేయమందు శల్యములు ఉండిన పాలక విరోధములు అధికమగును. నైరుతియందు శల్యములు ఉండిన ఋణ బాధలు అధికమగును. వాయవ్యము నందు శల్యములు ఉండిన ఆరోగ్య లోపములు అధికమగును. ఉత్తరమునందు శల్యములు ఉండిన అనుకోని ప్రమాదములు ఏర్పడుట జరుగును. కావున గృహమును నిర్మించుటకు ముందుగానే యజమాని ఎత్తుతో సమముగా స్థలమును చతురస్రముగా తవ్వించి వచ్చిన శల్యములను ఊరి బయట పారవేసి, ఆవులను ఆ స్థలమందు మూడు రోజుల పాటు మేతవేసి మేపిన పూర్తిగా శల్య దోషములు తొలగునని శాస్త్ర వచనము.

## గృహ పథకములు

గృహమునకు నాలుగు దిక్కుల యందు ఖాళీ స్థలము ఉంచిన, మిక్కిలి శ్రేష్టం. గృహమునకు మూడు భాగములయందు ఖాళీ స్థలం ఉంచిన మధ్యమము. గృహమునకు రెండు భాగములయందు ఖాళీ స్థలము ఉంచిన శుభ ప్రదం. గృహము చుట్టు ఖాళీ స్థలము లేకుండా నిర్మాణం జరిపిన అశుభ ప్రదం. గృహమును నిర్మించుటకు ముందుగా నిర్మాణ స్థలము యొక్క పొడవు మరియు వెడల్పులను గుణించగా వచ్చు గజములను క్షేత్రము లేదా గృహ పథము అని వ్యవహరింతురు. ఈ గృహపథమును గుణించుటకు ఉపయోగించు పొడవు మరియు వెడల్పు కొలతలు గోడల లోపలి కొలుతలుగా వ్యవహరించినను శాస్త్ర వచనానుసారము పిల్లర్ సెంటర్ కొలతలనే ప్రధానముగా తీసుకొని క్షేత్రమును గణించవలయును. ఈ క్షేత్రములు (గృహ పథకములు) పూర్ణాంకములైన పూర్తి శుభప్రదములు. భిన్నాంకములైన మధ్యమ ప్రదములు. వచ్చిన పథకమును కొన్ని సంఖ్యలచే గుణించి, కొన్ని సంఖ్యలచే భాగించగా గృహము యొక్క ఆయము, ధనము, ఋణము, ఆయుర్దాయము మొ॥ విషయములు తెలుసుకొన వచ్చును.

## గృహ పథకమునకు ఆయమును కట్టు వివరణ

| | |
|---|---|
| గృహ పథకం X**8/12** = ధనం | గృహ పథకం X**4/27** = యోగం |
| గృహ పథకం X**3/08** = ఋణం | గృహ పథకం X**5/07** = కరణం |
| గృహ పథకం X**9/07** = వారం | గృహ పథకం X**9/08** = దిక్పతి |
| గృహ పథకం X**9/08** = ఆయం | గృహ పథకం X**6/09** = అంశ |
| గృహ పథకం X**6/30** = తిథి | గృహ పథకం X**9/120** = ఆయుర్దాయం |
| గృహ పథకం X**8/27** = నక్షత్రం | |

## జంత్రి విధానమున కొన్ని శుభ గృహ పథకములు

ఉదాః పొడవు **25** అడుగులు X వెడల్పు **27** అడుగులు/**9** = **75**వ పథకం

| పథకం | ధనం | ఋణం | వారము | ఆయం | తిథి | నక్షత్రం | దిక్పతి | అంశ | ఆయువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| **9** | 12 | 03 | 04 | **01** | 14 | జ్యేష్ఠ | 01 | 09 | **81** |
| **11** | 04 | 01 | 01 | **03** | 06 | పునర్వసు | 03 | 03 | **99** |
| **13** | 08 | 07 | 05 | **05** | 18 | ధనిష్ఠ | 05 | 06 | **117** |
| **21** | 12 | 07 | 07 | **05** | 06 | ఆరుద్రా | 05 | 09 | **69** |
| **25** | 08 | 03 | 01 | **01** | 30 | పుబ్బ | 01 | 06 | **105** |
| **39** | 12 | 05 | 01 | **07** | 24 | స్వాతి | 07 | 09 | **111** |
| **51** | 12 | 01 | 04 | **03** | 06 | కృత్తిక | 03 | 09 | **99** |
| **63** | 12 | 05 | 07 | **07** | 18 | జ్యేష్ఠ | 07 | 09 | **87** |
| **65** | 04 | 03 | 04 | **01** | 30 | పునర్వసు | 01 | 03 | **105** |
| **75** | 12 | 01 | 03 | **03** | 30 | ఆరుద్రా | 03 | 06 | **75** |
| **79** | 08 | 05 | 04 | **07** | 24 | పుబ్బ | 07 | 09 | **111** |
| **87** | 12 | 05 | 06 | **07** | 12 | ఉ॥షా॥ | 07 | 09 | **63** |
| **89** | 04 | 03 | 03 | **01** | 24 | మఖ | 01 | 03 | **81** |
| **91** | 08 | 01 | 07 | **03** | 06 | ఉ॥భా॥ | 03 | 06 | **99** |
| **93** | 12 | 07 | 04 | **05** | 18 | స్వాతి | 05 | 09 | **117** |
| **103** | 08 | 05 | 03 | **07** | 18 | చిత్తా | 07 | 06 | **87** |
| **105** | 12 | 03 | 07 | **01** | 30 | కృత్తిక | 01 | 09 | **105** |
| **115** | 08 | 01 | 06 | **03** | 30 | భరణి | 03 | 06 | **75** |

**శుభ గృహ పథకమును గుర్తించు విధానము :-** పొడవు మరియు వెడల్పును గుణించగా వచ్చిన పథకము ద్వారా ముందు చెప్పుకున్న విధానం ప్రకారం ఏకాదశ వర్గులను సాధించగా అందులో ధనము ఋణము కంటే అధికముగా ఉండవలయును. తద్వారా నిర్మించు గృహమందు లాభము చేకూరును. ఆయము ధ్వజాయం గాని, సింహాయముగాని, వృషభాయము గాని, గజాయముగాని వచ్చిన శుభప్రదము. ఆయుర్దాయము తప్పక 60 సం॥లు పైన ఉన్నప్పుడే పథకమును శుభ గృహ పథకముగా నిర్ధారించవలయును. ముఖ్యముగా ఇంటి యజమాని యొక్క నామ నక్షత్రము నుండి గృహ పథక నక్షత్రము వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 9 చే భాగించగా శేషము 2,4,6,8,9 వచ్చినచో యజమానికి ఆ పథకము సరిగ్గా సరిపోవును అని నిర్ధారించ వలయును.

## శంఖుస్థాపన వివరణ

నూతన గృహమునకు శంఖుస్థాపన చేయుటకు అధికమాసములు, క్షయమాసములు, గురుమౌఢ్యమి, శుక్రమౌఢ్యమి, శూన్యమాసములు కర్తరి, విశాఖలు, పక్షచ్ఛిద్రములయందు పనికిరాదు. ఇంకనూ యజమాని యొక్క భార్యకు గర్భవతి అయిన ఆరవ నెల మొదలు బిడ్డ పుట్టిన మూడవ నెల వరకు నూతన గృహ శంఖుస్థాపనలు చేయుటకు పనికి రాదు. ఇంటియందు వివాహము జరిపించినది మొదలు ఒక సంవత్సర పరియంతం శంఖుస్థాపనలు చేయకూడదు. శంఖుస్థాపనకు బుధ, గురు, శుక్రవారములు శుభప్రదములు. ఆది, సోమ, శనివారములు మధ్యమములు. మంగళవారం నిశిద్ధం. పశ్చిమ, దక్షిణ సింహ ద్వారములు కల గృహములకు ఆశ్వీయుజ, కార్తీక మాసములలో, పశ్చిమ, ఉత్తర సింహ ద్వారములు కల గృహములకు మాఘ, మార్గశిర మాసములలో పూర్వ ఉత్తర సింహ ద్వారములు కల గృహములకు చైత్ర, వైశాఖ మాసములలో దక్షిణ తూర్పు సింహ ద్వారములు కల గృహములకు జ్యేష్ట శ్రావణ మాసములలో శంఖుస్థాపన చేయుట వలన శుభప్రదమని శాస్త్ర వచనము. శంఖుస్థాపన చేయుటకు శిలా శంఖు లేదా దారు శంఖును ఉపయోగించవలయును. దారు శంఖు చేయుటకు ఏప, పారిజాత, చంద్ర, దేవకాంచన, మద్ది, టేకు, కానుగ కలప (కర్ర) తో నిర్మాణము చేయవలయును. ఈ శంఖును మూడు భాగములుగా విభజించి మొదటి భాగమును నాలుగు పలకలుగా, రెండవ భాగమును ఎనిమిది పలకలుగా, మూడవ భాగమును గుండ్రముగా చేయించవలయును. ఈ శంఖుయొక్క ఎత్తు పద్దెనిమిది అంగుళములు ఉండవలయును. శంఖుస్థాపన ఈశాన్య ప్రాంతమందు చేయవలయును.



## బావులు, బోర్లు - ఫలితములు

నూతన నిర్మాణము చేయుటకు ముందుగా బావిని కాని, బోరు వేయించుట కాని, చేయుటవలన శుభ ఫలితములు చేకూరును. ఈశాన్య ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల సకల శుభములు చేకూరును. తూర్పు ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల సకల సౌఖ్యదాయకము. ఆగ్నేయ ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల ఇంటిలోని స్త్రీలకు మరణ సంబంధ రోగములను చేకూర్చును. దక్షిణ ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల ఇంటిలోని వ్యక్తులకు నిత్యం అనారోగ్యముల ఏర్పడును. నైఋతి ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల కుటుంబ కలహములు అధికమగును. పశ్చిమ ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల లక్ష్మీప్రదం. వాయవ్య ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల వాహన ప్రమాదములు చేకూర్చును. ఉత్తర ప్రాంతమందు బావి కాని, బోరు కాని ఉన్న యెడల నూతన వస్తు వాహన యోగములను కలిగించును.

ఇంటిలోని వాడకపు నీరు తూర్పు ఈశాన్యము ద్వారా వెళ్లుట వలన అష్టైశ్వర్య ప్రాప్తి కలుగును. తూర్పు ఆగ్నేయము ద్వారా వాడకపు నీరు వెళ్లుట వలన సంతాన పరమైన ఇబ్బందులు కలుగును. దక్షిణ నైఋతి ద్వారా వాడకపు నీరు వెళ్లుట వలన ఆరోగ్యపరమైన ఇబ్బందులు కలుగును. పశ్చిమ వాయవ్యము ద్వారా వాడకపు నీరు వెళ్లుట వలన ఋణ బాధలు అధికమగును. ఉత్తర వాయవ్యము ద్వారా వాడకపు నీరు వెళ్లుట వలన ఇరుగు పొరుగు వారితో ఇక్కట్లు తప్పనిసరియగును. ఉత్తర ఈశాన్యము ద్వారా వాడకపు నీరు వెళ్లుట వలన సర్వ శుభములు చేకూరును.

## ఖాళీ స్థలములు - ఫలితములు

నిర్మించు గృహమునకు తూర్పు ప్రాంతమందు ఖాళీ స్థలము ఉన్నయెడల కార్య సాఫల్యము చేకూరును. ఈశాన్య కోణయుత తూర్పు ప్రాంతమందు ఖాళీ స్థలము ఉన్న యెడల పుత్రలాభము, విద్యా, వైద్య లాభములు చేకూరును. దక్షిణ ప్రాంతమందు మాత్రమే ఖాళీ స్థలము ఉన్నయెడల అనుకొని ఆపదలు ఏర్పడుట జరుగును. పశ్చిమ ప్రాంతమందు ఖాళీ స్థలము ఉన్నయెడల స్త్రీ ఆధిక్యత ఉండును. ఉత్తర ప్రాంతమందు ఖాళీ స్థలము ఉన్నయెడల ఐశర్వ్యప్రదం. నైఋతి కోణం పెరిగిన యెడల వంశక్షయం జరుగుట, ఋణ బాధలు పెరుగుట జరుగును. ఆగ్నేయ కోణం పెరిగిన యెడల ఆరోగ్య భంగములు ఏర్పడుట వాహన ప్రమాదములు కలుగును. వాయవ్య కోణం పెరుగుట వలన అశుభములు, నిలకడ లేకపోవుట జరుగును. నాలుగు దిక్కులయందు ఖాళీ స్థలము ఉన్నయెడల సకల సౌఖ్యదాయకం.

## ఎత్తు పల్లములు - ఫలితములు

నిర్మించు గృహమునందు, స్థలమునందు ఈశాన్యము పల్లముగా ఉండినయెడల ధనధాన్య వృద్ధి కలుగును. ఉత్తర ఈశాన్యములు ఎత్తుగా ఉండిన యెడల స్త్రీలకు మాంగల్య దోషము, ధనధాన్యములకు కొరత ఏర్పడును. ఈశాన్యము కన్న వాయవ్యము పల్లముగా ఉండిన యెడల సౌఖ్య సంబంధ ఇబ్బందులు కలుగును. ఈశాన్యము కన్న ఆగ్నేయ నైఋతులు పల్లముగా ఉండిన యెడల ఋణ బాధలు అధికమగును. ఆగ్నేయ కన్న వాయవ్యం పల్లముగా ఉన్న యెడల అశుభ కార్యక్రమములకు అది నిలయమై ఉండును. తూర్పు ఈశాన్యముల కంటే నైఋతి పడమరలు ఎంత ఎత్తుగా ఉంటే అంత ధన ధాన్యాభివృద్ధి అని శాస్త్ర వచనం.

## శయన ప్రాంతములు - ఫలితములు

ఇంటియందు దక్షిణ, నైఋతి ప్రాంత గదులను శయన మందిరములుగా ఏర్పాటు చేసుకొనుట సకల శ్రేయోదాయకం. ఈశాన్య, ఉత్తర ప్రాంత గదిని శయన మందిరములు గా ఏర్పాటు చేసుకొనుట అనారోగ్య హేతువు, కుటుంబ కలహములకు నిలయమగును. తూర్పు దిక్కున శిరస్సు ఉంచి నిద్రించిన విద్యాప్రాప్తి కలుగును. దక్షిణ దిక్కున శిరస్సు ఉంచి నిద్రించిన ఆయుర్వృద్ధి కలుగును. పడమర దిక్కున శిరస్సు ఉంచి నిద్రించిన ధనధాన్య వృద్ధి కలుగును. ఉత్తర దిక్కున శిరస్సు ఉంచి నిద్రించిన బుద్ధిమాంద్యము, ఆకస్మిక మరణ ప్రదము. సొంత గృహమందు దక్షిణదిశగా, మామగారి, అత్తగారి ఇంటి యందు తూర్పుదిశగా, ప్రయాణముల యందు, క్షేత్రములయందు, పడమర దిశగా శిరస్సు ఉంచి నిద్రించుట వలన సకల శుభములు చేకూరును. ఏ ప్రాంతమందైనను ఎంత మంది చెప్పిననూ ఉత్తర దిశగా శిరస్సు చేసి నిద్రించరాదు.

## వంట గదులు - వాస్తవములు

ఇంటియందు ఆగ్నేయ ప్రాంతమందు వంటగది ఉన్నయెడల అన్నపూర్ణాదేవికి అది నిలయమై ఉండును. ఈశాన్య ప్రాంతమందు వంటగది ఉన్నయెడల వరదలవలె కష్టములకు అది నిలయమగును. ఉత్తర

ముఖంగా వంట చేసిన యెడల ఉన్నదంతయూ హరించుకుపోవును. దక్షిణ ముఖముగా వంట చేసిన యెడల దరిద్రము తాండవించును. పశ్చిమ ముఖముగా వంటచేసిన యెడల పతి (భర్త)తో విరోధములు ఏర్పడును. తూర్పు ముఖముగా వంట చేసిన యెడల సకల శుభములు చేకూరును.

## మరుగుదొడ్లు - ఫలితములు

ఇంటియందు ఈశాన్య ప్రాంతమందు మరుగుదొడ్లు ఉన్న యెడల అనారోగ్య హేతువు. నైఋతియందు సెప్టిక్‌ట్యాంక్ (గొయ్యి) లేకుండా మరుగుదొడ్లు నిర్మించవచ్చును. ఉత్తర వాయవ్య ప్రాంతమందు, ఆగ్నేయ ప్రాంతమందు మరుగుదొడ్లు, స్నానాల గది, సెప్టిక్‌ట్యాంక్ (గొయ్యి) నిర్మించుట సకల శుభప్రదము.

## వీధి శూలలు - వివరణ

ఇంటి ప్రాంతమును వీధి మూలలయందు పడునట్లుగా నిర్మాణము చేసిన వీధి శూల అని పిలవబడును. బావికి ఎదురుగా నిర్మాణము చేసిన కూప శూల అని పిలవబడును. దేవాలయమునకు ఎదురుగా నిర్మాణము చేసిన ఆలయ శూల అని పిలవబడును. ద్వారమునకు ఎదురుగా స్తంభములు (ఫిల్లర్లు) ఉండుటను స్థంభ శూల, ద్వారా శూల అని పిలవబడును. ఈ శూలలన్నియు (చూపు) ఏ కోణమందు పడుతున్నవో దాని ద్వారా ఫలితములను ఇచ్చును. ఆలయ శూల ఏ కోణమందైననూ దోష ప్రదమని శాస్త్ర వచనము. ద్వారా శూల ఏకోణ మందైననూ ద్వారామును మార్పు చేయుట తప్ప వేరొక మార్గము లేదని శాస్త్ర వచనము.

వీధి శూలయందు ఉత్తర ఈశాన్య వీధి శూల ధన లాభములు చేకూర్చును. దక్షిణ ఆగ్నేయ వీధి శూల అనారోగ్యములను చేకూర్చును. నైఋతి వీధి శూల ఇంటి యజమాని ఆయుర్ధాయమును తగ్గించును. వాయవ్య వీధి శూల ఋణ బాధలను అధికం చేయును. కావున శూలలు సర్వ బాధలకు మూలములు కావున నాలుగు దిక్కులకు శూలలు లేకుండా నిర్మాణం చేయుట శుభదాయకము.

## ముఖ్య విషయములు

ఇంటి ప్రాంతమందు తూర్పు ఉత్తర దిశలలో ఎంత ఖాళీ ఉంటే అంత అనుకూలత ఏర్పడును. ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలలో ఎత్తైన అరుగులు లేదా గోడలు ఉండుట వలన ఇంటిలోని స్త్రీలకు ఆరోగ్య భంగములు అధికమగును. పశ్చిమ, దక్షిణ దిశలలో ఎత్తైన అరుగులు లేదా గోడలు ఉండుట వలన శుభములు చేకూరును. ఇంటి ప్రాంతమందు పాలుకారె చెట్లు, ముళ్లచెట్లు ఎట్టి పరిస్థితులలో ఉండరాదు. చింతచెట్లు, మారేడు చెట్లు, తాటిచెట్లు ఇంటి యందు ఉండరాదు. ఉత్తరప్రాంత మందు నిమ్మ చెట్లు, నేరేడు చెట్లు, కుంకుడు చెట్లు, రేగు చెట్లు ఉన్న యెడల కుటుంబ కలహములు అధికమగును. పశ్చిమ, దక్షిణ ప్రాంతములయందు కొబ్బరి చెట్లు, పనస చెట్లు, మామిడి చెట్లు, రావి చెట్లు, జువ్వి చెట్లు ఉన్నయెడల శుభములు చేకూరును. ఈశాన్య ప్రాంతమందు తులసి మొక్కలు, పూల మొక్కలు ఉండుట వలన శుభప్రదము. తూర్పు, ఉత్తర ప్రాంతమందు ఎత్తైన, బరువైన వృక్షములు ఉండరాదు. ఫలములతో కూడిన వృక్షములు ఉండవచ్చును. ఎత్తైన, బరువైన వృక్షములు దక్షిణ, పడమర ప్రాంతములయందు తప్పక ఉండవలయును. తూర్పు, ఉత్తర ప్రాంత సరిహద్దులను ఖాయము చేసి నిర్మాణము చేయుట వలన నిర్మాణములు మధ్యలోనే ఆగిపోవును. ముందుగా ప్రహారిగోడ నిర్మాణం చేసిన గృహనిర్మాణములో ఆటంకములు అధికముగా ఉండును. గృహము నిర్మాణము చేయుటకు ఉపయోగించు స్తంభములు (ఫిల్లర్లు) సరి సంఖ్యయందు ఉండవలయును. దూలములు (బీములు) గోడలను దాటి బయటకి వచ్చుట, పోటిగా గోడలు నిర్మాణము చేయకూడదు. బీములతో (దూలములతో) సమముగా గోడలను నిర్మించవలయును. ఇంటియందు మెట్లు నిచ్చెన మాదిరిగా నిటారుగా నిర్మాణము చేయకూడదు. యు ఆకారముగా కాని యస్. ఆకారముగా కాని నిర్మాణం

చేయవలెను. ఆగ్నేయ ప్రాంతమందు కాని, వాయవ్య ప్రాంతమందు కాని నైఋతి ప్రాంతమందు కాని మెట్లను నిర్మించవచ్చును. ఈశాన్య ప్రాంతమందు మాత్రం ఎట్టి పరిస్థితులలో మెట్లను నిర్మాణం చేయకూడదు. నైఋతి వాయవ్య, ఆగ్నేయ ప్రాంతములయందు నిర్మాణము చేయు మెట్లు తూర్పు, ఉత్తర ప్రహరీ గోడలకు ఆనినట్లైతే అశుభమునకు అది హేతువుగా మారును.
గృహమునకు ఏర్పాటు చేయు ద్వారములు సరిసంఖ్యయందు ఉండవలయును. మరుగుదొడ్ల, స్నానపు గదుల ద్వారములు లెక్కించకుండా ఇంటియందు ఉన్న ద్వారములే సరి సంఖ్యయందు ఉండవలయును. కిటికీలు కూడా సరిసంఖ్య యందు ఉండవలయును. ద్వారములు తూర్పు ఆగ్నేయ ప్రాంతమందు దక్షిణ నైఋతి, పశ్చిమ నైఋతి యందు ఏర్పాటు చేయుట వలన ఆరోగ్య భంగములు ఏర్పడును. ద్వారములకు ఎదురుగా బావి కాని, బోరు కాని, పొయ్యికాని రాకుండా చూసుకోవలయును. నీటిట్యాంకు ఇంటి పై భాగమందు నైఋతి ప్రాంతమందు ఏర్పాటు చేసుకోవచ్చును. ఇంటి పై కప్పు తూర్పు వాలుగా, ఉత్తరము వాలుగా ఉండేటట్లుగా నిర్మాణం చేసుకోవలయును.

## దోష నివారణ

ఎంత శాస్త్రము తెలుసుకున్ననూ, ఎంత జాగ్రత్తగా నిర్మాణము చేయుటకు సమయము వెచ్చించిననూ, ఏదో రకమైన దోషములు ఏర్పడుతునే ఉంటాయి. అటువంటి వాస్తు దోషములు, శల్య దోషములు, నిర్మాణ దోషములు, వీధి శూల దోషములు పథకము శుద్ధిగా లేకపోవుట మొదలగు దోషములు తొలగుటకు శాస్త్రవచనానుసారము ఇంటియందు పంచభూతత్వములకు ప్రతీకగా ఆగ్నేయ ప్రాంతమందు శీతలయంత్రము, నైఋతి ప్రాంత మందు కూర్మ యంత్రము, వాయవ్య ప్రాంతమందు వాస్తు యంత్రము ఈశాన్య ప్రాంత మందు మత్స్య యంత్రము గృహ మధ్యమమున రాజమాతంగీ ఆకర్షణ యంత్రములను జలాధివాస, ధాన్యాదివాస, శయ్యాధివాస, గర్తసంస్కార, రత్నబీజ ధాతు సంస్కార యుక్తముగా సుప్రతిష్టము చేసిన దోషములు తొలుగునని శాస్త్రవచనము.

**ఇతర జాతక, వాస్తు పరమైన వివరములకు <u>దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి</u> గారిని సంప్రదించగలరు. దూరవాణి : 9963732303, 9550017546, 9866839560.**

## తిలకధారణ విధి

బ్రాహ్మణాది సర్వ వర్ణులు లలాటమందు మృత్తికతో గాని, భస్మముతో గాని, గంధముతో గాని, జలముతో గాని తిలకధారణ చేయవలెను. **బ్రహ్మణాదులకు ఊర్ధ్వ పుండ్ర ధారణము అగ్ని హోత్రమువలె తప్పక చేయదగినది.** కనుబొమ్మలు మొదలుకొని నొసట భాగములందు లలాట తిలకమును ధరించవలెయును. అట్టి భస్మధారణ వలన మహాపాతకములు నశించును. అశుచిగాని, అనాచారుడుగాని, పాపముతో కూడి యున్నవాడుగాని, బస్మధారణ చేసిన పవిత్రుడగును. భస్మధారణ పాదుకలు ధరించి అద్దము ముందుగాని, జలమందు గాని తలకు వస్త్రము చుట్టుకొనిగాని ధారణ చేయకూడదు. **తన నీడను తాను జలమందు చూచుకుంటు భస్మధారణ చేయకూడదు.** అటుల చేసిన ఏడు జన్మల వరకు అంధుడగును.

**అంగులీనియమము :** బ్రొటన వ్రేలితో ధారణ చేసిన పుష్టికరం. మధ్యమవ్రేలితో ధారణ చేసిన కీర్తికరం. అనామిక వ్రేలితో ధారణ చేసిన లక్ష్మి ప్రదం. తర్జనీ వ్రేలుతో ధారణ చేసిన మొక్షప్రదం. ఎల్ల వేలలయందు దర్భలు ధరించి తిలక ధారణ చేయకూడదు. లక్ష్మి కాముకుడుగాని, పుష్టికాముకుడు గాని ఇష్టపూర్తిగా తిలకమును ధరించవలయును. స్నానానంతరము, జలముతో ఊర్ధ్వ పుండ్రమును, హోమానంతరము భస్మముతో, గంధముతో తిర్యక్పుండ్రమును ధరించెవలయును. అభ్యంగమందున లేదా ఉత్సావాదుల యందున కస్తూరితోగాని, గంధముతో ధరించవలయును.

స్వాధ్యాయాది , జపహోమ, తర్పణాదులయందు భస్మాది తిలక ధారణ లేకుండా చేసిన యెడల ఫలితము శూన్యము.

# సంఖ్యా శాస్త్రములో మెలుకువలు

**జనన సమయం లో ఉండే సంఖ్య ను బట్టీ ఫలితములను నిర్ధారించవలయును‘ ః-**

ఉదాహరణకు ది.వి 1-1-1988 శుక్రవారం రా॥ 11-17 ని॥కు జననం అనుకున్నట్టయితే ఆవ్యక్తి పై తేదీ సంఖ్య 1, నెల సంఖ్య 1, సంవత్సర సంఖ్య 8, మొత్తం కర్మ సంఖ్య **1**, వార సంఖ్య **6**, సమయ సంఖ్య **1**, వీటిలో బలవత్తరంగా ఉన్న సంఖ్య **1** కాబట్టి **1వ సంఖ్య** ప్రభావం అధికంగానూ తక్కిన సంఖ్యల ప్రభావం స్వల్పంగా ఉంటుంది. అందుకనే అనేక సంఖ్యల సమాహారంగానే ఫలితం చెప్పాలికానీ ఒక్క తేదీననుసరించే చెప్పకూడదు. ఈ విధంగానే నిర్ధారణ చేసి కర్మ సంఖ్యను తెలుసుకోవలయును. ముందుగా మనం పుట్టిన తేదీ వలన కలిగే సాముదాయక ఫలితములను తెలుసుకుందాం.

**1, 10, 19, 28 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** మంచిలో కాని చెడులో కానీ ఒకరికి లొంగి ఉండే ధోరణి ఏకోశానా ఉండదు, తమ పని నెరవేర్చుకోవడంలో మంచి తెలివి తేటలు, ధైర్య సాహసాలు ప్రదర్శిస్తారు, స్వశక్తితోను, స్వయంకృషితోను అభివృద్ధిచెందుతారు, వారున్న రంగంలో మంచి గుర్తింపులు తెచ్చుకుంటారు, ఏవిషయంలోనైనా సరే తుది గెలుపు దాకా పోరాడుతారు, ఏదైనా ఓటమి కలిగినా కృంగిపోరు, రేపటి మీద ఆశతో పోరాడుతారు, బంగారు, గోధుమరంగు దుస్తులు ధరించడం వలన శుభప్రదం.

**2, 11, 20, 29 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** వీళ్లు ఎంత మంచివాళ్లో అంతగా మాటలు పడుతూ ఉంటారు, ప్రతిపనికీ దూరాలోచన చేస్తూ ఉండటం వలన కాలయాపన జరిగి ఓ నిర్ణయానికి రాలేకపోతారు, జన్మతః రాజైనా సరే క్షాత్రం తక్కువగా వాణిజ్యధోరణి ఎక్కువగా ఉంటుంది, పని వెంట పని చురుగ్గా అందుకోకుండా కాస్తంత విశ్రాంతిని వాంఛిస్తారు, నిద్రా ప్రియులు, ఆకుపచ్చరంగు మీద అమితమైన ప్రేమ ఉంటుంది, వీరికి శత్రువులనే వారే ఉండరు, కవిత్వము పై పట్టుండును, తెలుపు, ఆకుపచ్చరంగులు అనుకూలించును.

**3, 12, 21, 30 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** ఆజన్మాంతం స్వేచ్ఛకోసం పోరాడే స్వభావం కలవారు, పరువు ప్రతిష్ఠలకోసం ప్రాణం పెడతారు, మహా తెలివైన వారు, రచయితలు, కవులు, కళాప్రియులు, శూరవంతులుగా ఉందురు, పెత్తనం చెలాయించడమే కానీ ప్రభువులకైనా సరే లొంగి ఉండే లక్షణం ఉండదు, బంగారపు రంగు దుస్తులు అనుకూలిస్తాయి.

**4, 13, 22, 31 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** విదేశీ ఇష్టత, విప్లవ ధోరణులు, కొత్తపంథాలో ఆలోచించడంలో వీరికి వీరే సాటి, పగపడితే పాముకి తమ్ముళ్లు అవుతారు, ఆర్థిక ఇబ్బందుల వలన వీరి ప్రజ్ఞ బయటపడటం కష్టతరము, 1, 8 తేదీల లక్షణాల సమ్మేళనమే వీరి లక్షణములు, లేతరంగు వస్త్రములు అనుకూలిస్తాయి.

**5, 14, 23 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** అందరికీ స్నేహ పాత్రులగుతారు, చట్ట వ్యతిరేకం కాని కొత్తపద్ధతులలో ధన సంపాదన చేయాలని తపిస్తూంటారు, చేసిన మేలు మరిచిపోరు, శాస్త్రపరిజ్ఞానం ఉంటుంది, చాలా విషయాలలో పిరికివారిగా ఉంటారు, ఆకుపచ్చ, బూడిద రంగు, మెరిసే రంగు వస్త్రాలు అనుకూలించును.

**6, 15, 24 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** ఎటువంటి వారినైనా ఇట్టే ఆకర్షిస్తారు, అనుకున్నది సాధించి తీరుతారు, కలలను నెరవేర్చుకోగలరు, వీణావాయిద్యం వంటి సున్నిత తంత్రీ వాయిద్యాలపై ఇష్టత కల్గి ఉంటారు, ప్రేమకు దాసులై పోతారు, సంగీతం, శృంగారం, కవిత్వం వీరి అభిమాన కళలు, ఆకస్మికంగా కీర్తి గౌరవాలు పొందుతారు, మిత్రుల సంఖ్య విపరీతంగా ఉంటుంది, కాకుంటే ప్రతిదాన్నీ అనుమానిస్తారు, కోపంలో వళ్లుతెలియని ప్రవర్తన వలన ఒక్కోసారి కష్టాలు తెచ్చుకొంటారు, తెల్లరంగు దుస్తులు అనుకూలిస్తాయి, స్త్రీలకు లేత నీలం వస్త్రాలు అనుకూలిస్తాయి.

**7, 16, 25 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** ప్రతిపనికీ దూరాలోచన చేస్తూ ఉండటం వలన కాలయాపన జరిగి ఓ నిర్ణయానికి రాలేకపోతారు, ఎంత గొప్పవారినైనా సరే ఎదిరించేందుకు వెనుకాడని ధైర్యవంతులు, నీలి వస్త్రములు, పసుపు వస్త్రములు అనుకూలిస్తాయి.

**8, 17, 26 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** మాటలు, చేతలు కత్తుల్లా ఉన్నా మనస్సు మెత్తగా ఉంటుంది, ఎటువంటి కష్టాన్నైనా ఓర్చుకోగలరు, స్వ విషయాలకన్నా ఇతరుల విషయాలలో ఎక్కువ సమయం వెచ్చిస్తారు, చేజేతులా జీవితాన్ని తొందర నిర్ణయాల వలన దుఃఖ మయం చేసుకుంటారు, నూటికి 75మంది సామాన్య జాతకులుగానే ఉన్నా తక్కిన 25మంది మాత్రం అఖండ విజయాలను సాధించి చూపిస్తారు, ముదురు రంగు వస్త్రాలు అనుకూలిస్తాయి.

**9, 18, 27 తేదీలలో పుట్టిన వారి ఫలితములు –** చురుకుదనం, కరుకుదనం, క్రీడాసక్తి పట్టుదల, అధిక ఆశ, అవతలి వారు ఎంత గొప్పవారైనా సరే ఎదిరించేందుకు వెనుకాడని ధైర్యవంతులు, నియమ నిబంధనలు అధికంగా కలవారు, అందరినీ తేలికగా నమ్మేస్తూ ఉంటారు, నీలి, ఎరుపు వస్త్రములు అనుకూలిస్తాయి.

**ముందుగా ఒకటవ సంఖ్య గురించి తెలుసుకుందాము ః-**

ఒకటవ సంఖ్యకు అధిపతి సూర్యుడు. రాజ లక్షణం, ఇంతవరకూ సరే, ఇంకొంచెం ముందుకు పోతే 1, 10, 19, 28 ఈ నాలుగూ కూడా ఒకటో సంఖ్యకు చెందినవే. కానీ ఈ నాలిగింటి లోనూ 10, 19, 28 అనేవి మిశ్రమ సంఖ్యలు. అందువల్ల వాటి వాటి గుణాగుణాలు రవ్వంత తేడాగా ఉంటాయి. ఉదాహరణగా ఏకత్వంలో భిన్నత్వాలను టూకీగా పరిశీలిద్దాం.

**నెం. 1 –** ఏ ఇతర సంఖ్యా ప్రమేయం లేకుండా స్వయం ప్రతిపత్తితో ఉండే సంఖ్య ఇది, ఈ తేదీ జాతకుల నైజం కూడా అలాగే ఉంటుంది, ఉద్యోగమైనా, రాజకీయమైనా, మరోకటైనా, ఏవృత్తిలో ఉన్నా సరే రాజాగా బ్రతకగలరు, అయితే రాజాలా ఉండటం వలన అడపాదడపా అహంకారం పాలై చాటుగానైనా నాలుక కొరుక్కునే పరిస్థితులు ఏర్పడినప్పటికీ కూడా చివరికి తమ పంతమే నెగ్గిందనిపించుకుంటారు. **ఈ ఒకటో నెంబర్ జాతకులు** తమ సాటి ఒకటో నెంబర్ జాతకుల పట్ల ఆదరం, 2 నెం జాతకులతో చనువు, 3వ సంఖ్య వారి పట్ల గౌరవం, 4వ సంఖ్యవారితో అంతరంగిక సాన్నిహిత్యాలు, 5,7 సంఖ్యల వారితో అంటీముట్టనితనము, 6 వ (శతృ) సంఖ్యా జాతకులపట్ల అభిమానము, 8వ సంఖ్యా జాతకులపై జాలి లేదా ఆధిపత్య ప్రకటనా వాంఛ, 9వ సంఖ్యా జాతకుల పట్ల సామాజిక సంబంధాలు కలిగి ఉంటారు.

**నెం. 10 –** ఇది కూడా ఒకటో సంఖ్యకు సంబంధించినదే, అయినా ఒకటికి సున్నాతో మిశ్రమం ఏర్పడినది, సున్నా అంటే విలువ లేనిది, విలువ కలిగించేది కూడా, అందువల్ల ఈ పది చాలా మిశ్రమ ఫలితంగా ఉంటుంది, సేవక వృత్తిలో ఉంటూ రాజరికం చెలాయించేవారు, రాజరికం చేస్తూ కూడా సామంతులుగా ఉండేవాళ్లు, రెండురకాల వాళ్లు ఉంటారు, ఎంత ఆత్మాభిమాన పరులో అంతగా అవసరాలకు తల వంచుతూ ఉంటారు, ఆకలి ఎక్కువ, తినేది తక్కువగా ఉండే ఈ జాతకులు దేన్నైనా సాధించగలరు, కానీ వెన్ను తట్టి ప్రోత్సహించేందుకు కేవలం మేమున్నాంగా అన్నట్టు 4,6 సంఖ్యల వారి తోడు ఉండాలే గానీ కేవలం ఈ 10 వ సంఖ్య వారు తమ మాటలతోనే ప్రపంచాన్ని బోల్తాకొట్టించేంత శక్తి కలిగి ఉంటారు, 4,6 సంఖ్యలను వదిలేస్తే 5,8,7 సంఖ్యలతో తప్ప మిగిలిన సంఖ్యలతో సఖ్యతతోనే ఉంటారు.

**నెం. 19 –** ఇది అత్యంత శక్తివంతమైన సంఖ్య, 1రాజు, 9 సైన్యాధిపతి, రాజుని సైన్యాధిపతిని అనుసరిస్తాడు, అధికారం, సైన్యం ఒకటైతే ఏం జరుగుతుందో వేరే చేప్పనక్కరలేదుకదా, ఈ జాతకులకు అధికారం సంక్రమించనే కూడదు, సంక్రమించిందో దానిని నిలబెట్టుకోవడం కోసం బలప్రయోగానికి కూడా వెనుదీయరు, సద్గుణాలు, సౌందర్యం కలబోసినట్లుండే వీరు ఆత్మగౌరవాన్నే తప్ప ఐశ్వర్యాన్ని లెక్కజేయని వారిగా ఉంటారు, 5,6,8 లతో తప్ప అన్ని సంఖ్యలతోనూ కలిసి మెలసి ఉంటారు, కానీ ఎప్పుడు ఎవరితో వైరం పెట్టుకుంటారో, ఎప్పుడు ఎవరితో పొత్తు పెట్టుకుంటారో వారికే పూర్తిగా తెలియదు.

**నెం. 28 –** ఇది చెప్పుకోదగిన సంఖ్య, 2చంద్రుడు, 8 శని, కలయికలో ఏర్పడిన సూర్య సంఖ్య ఇది, నెం.1 లక్షణాలన్నీ ఉంటాయి, కానీ వీళ్ల ప్రేమ పీడాకరంగా ఉంటుంది, వీళ్లను ప్రేమించే వాళ్లకు బాధపడటమే మిగులుతుంది, తీపి తినిపిస్తానని కంట్లో కారంపెట్టే రకం వాళ్లు వీరు, ప్రతిదాన్నీ ధనముతోనే సరి చూసుకునే వీళ్లు పొత్తు లేకుండా వ్యక్తిగతంగా తమ కార్యక్రమాలు సాగించినంత కాలం దివ్యంగా సాగుతుంది, వీళ్లకి 19వ సంఖ్యకు వారిమల్లే ఎవరితో వైరం పెట్టుకుంటారో, ఎప్పుడు ఎవరితో పొత్తు పెట్టుకుంటారో వారికే పూర్తిగా తెలియదు, ప్రపంచం మొత్తాన్నీ హోమియోమాత్రలా మింగేయాలనే ఆశ, బంధుప్రీతి, నీచప్రసంగం వీళ్ల ప్రత్యేకతలు.

ఇంతవరకూ మనం **1 వ నెంబరుకు** సంబంధించిన మిశ్రమ సంఖ్యలను పరిశీలించాము, ఇంకనూ జనన సమయ వార, మాస, సంవత్సరాన్ని బట్టి వచ్చే ప్రత్యేక లక్షణములను, విశేష ఫలితములను వచ్చే సంవత్సరం పంచాంగంలో తెలుసుకుందాం...... **మీ దైవజ్ఞ సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

## కాల మహిమ

శ్లో॥ ద్విఘటీ ప్రమితం తత్ర ముహూర్తం కథితం బుధైః ।
షడ్భిః ప్రాణైర్వినాడిస్యాత్ తద్దశా క్షణికా స్మృతా ॥

మనం చేసే ప్రతీ పనిలో కొంత ఆలస్యమైతేనో లేకపోతే లేదా తొందరగా వస్తానని చెప్పడానికో ఇదిగో క్షణం లో పూర్తి చేస్తాను. క్షణం లో వస్తాను. క్షణంలో వెళ్తాను ఇలాంటి మాటలు సహజంగా మాట్లాడుతూనే ఉంటాం కాని క్షణకాలం అంటే అందరం మన కాలమానం లో 1 నిమిషం అని లేదా కొద్ది సమయం అని భావన చెందుతూ ఉంటాము. మరి ఇంతకీ **క్షణకాలమంటే ఎంత? మన పూర్వులు ఏం చెప్పారు?** మన పూర్వులు మనకందించిన కాలమానం లో

| | | |
|---|---|---|
| 1 ప్రాణము (4 సెకన్లు) | - | 10 లిప్తలు (ఒక శ్వాస కాలము). |
| 6 ప్రాణములు | - | 60 లిప్తలు (ఒక విఘడియ), (24 సెకన్లు). |
| 2. 1/2 విఘడియలు | - | 1 నిమిషం |
| **10 విఘడియలు** | **-** | **4 నిమిషాలు 1క్షణ కాలం** |
| 60 విఘడియలు, 6 క్షణాలు | - | 1 ఘడియ (24 నిమిషములు). |
| **2 ఘడియలు** | **-** | **1 ముహూర్త కాలము. (48 నిమిషములు)** |
| 2. 1/2 ఘడియలు | - | 1 గంట |
| 60 ఘడియలు, 30 ముహూర్తములు | - | 1 అహోరాత్రము (24 గంటలు). |

6 ప్రాణములు 1 విఘడియగా, అటువంటి 10 విఘడియల తో సమానం మనం వాడుకలో వాడుతున్న ఒక్క క్షణ కాలం.

**1 క్షణ కాలం - 4 నిమిషములు**

**1 ముహూర్త కాలం - 48 నిమిషములు**



**AP ENDOWMENTS AGAMA ADVISOR, KANCHI PETHA ASTHANA SIDDHANTHI**
**"Jyothisha kesari" "jyothisha chaturanana" "daivagna shiroratna"**
**Brahma Sri.DAIVAGNA SUBRAHMANYA SIDDHANTHY**
**e-mail:** lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com
**9963732303, 9866839560**.

## వివిధ ప్రాంతములకు సూర్యోదయ సూర్యాస్తమయ సమయములు

| తేదీ | | కాంచీపురం | | తిరుపతి | | కర్నూలు | | వరంగల్ | | నిజామాబాద్ | | విజయవాడ | | రాజమండ్రి | | విశాఖపట్నం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. |
| ఏప్రిల్ | **10** | 6-05 | 6-19 | 6-07 | 6-22 | 6-10 | 6-28 | 6-02 | 6-23 | 6-08 | 6-29 | 5-59 | 6-19 | 5-53 | 6-09 | 5-47 | 6-07 |
| | **20** | 5-59 | 6-20 | 6-01 | 6-23 | 6-03 | 6-29 | 5-55 | 6-26 | 6-01 | 6-32 | 5-52 | 6-21 | 5-44 | 6-13 | 5-40 | 6-10 |
| | **30** | 5-54 | 6-21 | 5-55 | 6-24 | 5-58 | 6-32 | 5-49 | 6-28 | 5-54 | 6-35 | 5-46 | 6-23 | 5-38 | 6-16 | 5-34 | 6-12 |
| మే | **10** | 5-50 | 6-23 | 5-51 | 6-27 | 5-53 | 6-34 | 5-44 | 6-32 | 5-49 | 6-38 | 5-42 | 6-26 | 5-35 | 6-18 | 5-29 | 6-15 |
| | **20** | 5-48 | 6-26 | 5-49 | 6-28 | 5-50 | 6-37 | 5-41 | 6-35 | 5-45 | 6-42 | 5-39 | 6-29 | 5-30 | 6-22 | 5-26 | 6-19 |
| | **30** | 5-47 | 6-28 | 5-49 | 6-32 | 5-49 | 6-41 | 5-39 | 6-39 | 5-44 | 6-46 | 5-38 | 6-32 | 5-29 | 6-27 | 5-24 | 6-23 |
| జూన్ | **10** | 5-48 | 6-32 | 5-48 | 6-36 | 5-49 | 6-44 | 5-39 | 6-43 | 5-44 | 6-50 | 5-38 | 6-36 | 5-28 | 6-28 | 5-24 | 6-26 |
| | **20** | 5-49 | 6-33 | 5-50 | 6-38 | 5-50 | 6-47 | 5-40 | 6-45 | 5-45 | 6-52 | 5-40 | 6-39 | 5-30 | 6-33 | 5-26 | 6-29 |
| | **30** | 5-52 | 6-36 | 5-52 | 6-40 | 5-53 | 6-49 | 5-43 | 6-47 | 5-48 | 6-54 | 5-42 | 6-40 | 5-32 | 6-34 | 5-28 | 6-31 |
| జూలై | **10** | 5-54 | 6-37 | 5-55 | 6-41 | 5-56 | 6-49 | 5-46 | 6-47 | 5-51 | 6-54 | 5-45 | 6-41 | 5-34 | 6-35 | 5-31 | 6-31 |
| | **20** | 5-57 | 6-36 | 5-58 | 6-40 | 5-59 | 6-48 | 5-49 | 6-46 | 5-54 | 6-53 | 5-49 | 6-39 | 5-38 | 6-34 | 5-34 | 6-30 |
| | **30** | 5-59 | 6-35 | 6-00 | 6-38 | 6-02 | 6-46 | 5-53 | 6-42 | 5-58 | 6-49 | 5-52 | 6-37 | 5-42 | 6-30 | 5-38 | 6-27 |
| ఆగస్టు | **10** | 6-01 | 6-31 | 6-02 | 6-34 | 6-05 | 6-41 | 5-56 | 6-37 | 6-01 | 6-44 | 5-54 | 6-32 | 5-44 | 6-28 | 5-41 | 6-22 |
| | **20** | 6-02 | 6-25 | 6-03 | 6-29 | 6-06 | 6-35 | 5-58 | 6-31 | 6-04 | 6-38 | 5-56 | 6-26 | 5-47 | 6-20 | 5-43 | 6-16 |
| | **30** | 6-02 | 6-19 | 6-04 | 6-22 | 6-08 | 6-29 | 6-00 | 6-24 | 6-06 | 6-30 | 5-58 | 6-18 | 5-49 | 6-11 | 5-45 | 6-08 |
| సెప్టెంబర్ | **10** | 6-02 | 6-12 | 6-04 | 6-15 | 6-09 | 6-20 | 6-02 | 6-15 | 6-08 | 6-21 | 5-59 | 6-10 | 5-49 | 6-07 | 5-47 | 6-00 |
| | **20** | 6-02 | 6-05 | 6-05 | 6-07 | 6-10 | 6-12 | 6-03 | 6-06 | 6-09 | 6-12 | 6-00 | 6-02 | 5-52 | 5-56 | 5-48 | 5-51 |
| | **30** | 6-03 | 5-58 | 6-06 | 6-01 | 6-11 | 6-04 | 6-05 | 5-58 | 6-11 | 6-03 | 6-01 | 5-54 | 5-54 | 5-48 | 5-50 | 5-43 |

## వివిధ ప్రాంతములకు సూర్యోదయ సూర్యాస్తమయ సమయములు

| తేది | | కాంచీపురం | | తిరుపతి | | కర్నూలు | | వరంగల్ | | నిజామాబాద్ | | విజయవాడ | | రాజమండ్రి | | విశాఖపట్నం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. | సూ.ఉ. | సూ.అ. |
| అక్టోబర్ | **10** | 6-03 | 5-52 | 6-06 | 5-53 | 6-12 | 5-57 | 6-07 | 5-50 | 6-13 | 5-55 | 6-03 | 5-46 | 5-54 | 5-42 | 5-51 | 5-35 |
| | **20** | 6-04 | 5-46 | 6-07 | 5-48 | 6-14 | 5-50 | 6-10 | 5-42 | 6-16 | 5-48 | 6-05 | 5-40 | 5-58 | 5-33 | 5-54 | 5-28 |
| | **30** | 6-07 | 5-41 | 6-10 | 5-43 | 6-17 | 5-45 | 6-13 | 5-37 | 6-20 | 5-42 | 6-08 | 5-34 | 6-02 | 5-26 | 5-57 | 5-22 |
| నవంబర్ | **10** | 6-10 | 5-38 | 6-13 | 5-39 | 6-21 | 5-41 | 6-18 | 5-32 | 6-25 | 5-37 | 6-13 | 5-30 | 6-04 | 5-24 | 6-02 | 5-17 |
| | **20** | 6-15 | 5-38 | 6-18 | 5-39 | 6-26 | 5-40 | 6-23 | 5-30 | 6-30 | 5-35 | 6-18 | 5-29 | 6-11 | 5-20 | 6-07 | 5-15 |
| | **30** | 6-20 | 5-38 | 6-23 | 5-39 | 6-32 | 5-40 | 6-29 | 5-30 | 6-36 | 5-35 | 6-24 | 5-29 | 6-17 | 5-20 | 6-13 | 5-15 |
| డిసెంబర్ | **10** | 6-25 | 5-41 | 6-28 | 5-41 | 6-37 | 5-42 | 6-35 | 5-32 | 6-43 | 5-37 | 6-30 | 5-32 | 6-20 | 5-21 | 6-19 | 5-17 |
| | **20** | 6-31 | 5-45 | 6-34 | 5-46 | 6-43 | 5-46 | 6-41 | 5-36 | 6-48 | 5-41 | 6-35 | 5-36 | 6-28 | 5-26 | 6-25 | 5-21 |
| | **30** | 6-35 | 5-50 | 6-39 | 5-51 | 6-47 | 5-52 | 6-46 | 5-42 | 6-53 | 5-46 | 6-40 | 5-41 | 6-35 | 5-32 | 6-30 | 5-27 |
| జనవరి | **10** | 6-39 | 5-56 | 6-43 | 5-57 | 6-51 | 5-58 | 6-49 | 5-49 | 6-56 | 5-53 | 6-43 | 5-47 | 6-37 | 5-37 | 6-33 | 5-34 |
| | **20** | 6-41 | 6-02 | 6-44 | 6-03 | 6-52 | 6-04 | 6-50 | 5-55 | 6-57 | 6-00 | 6-43 | 5-53 | 6-39 | 5-45 | 6-34 | 5-40 |
| | **30** | 6-41 | 6-07 | 6-44 | 6-08 | 6-51 | 6-10 | 6-48 | 6-01 | 6-55 | 6-06 | 6-42 | 5-59 | 6-37 | 5-51 | 6-33 | 5-46 |
| ఫిబ్రవరి | **10** | 6-38 | 6-13 | 6-41 | 6-13 | 6-48 | 6-15 | 6-45 | 6-07 | 6-51 | 6-12 | 6-39 | 6-04 | 6-35 | 5-54 | 6-29 | 5-51 |
| | **20** | 6-34 | 6-14 | 6-37 | 6-16 | 6-44 | 6-18 | 6-40 | 6-11 | 6-46 | 6-16 | 6-34 | 6-08 | 6-28 | 6-00 | 6-24 | 5-55 |
| | **30** | 6-30 | 6-16 | 6-33 | 6-18 | 6-39 | 6-21 | 6-34 | 6-14 | 6-41 | 6-19 | 6-30 | 6-11 | 6-22 | 6-02 | 6-19 | 5-58 |
| మార్చి | **10** | 6-24 | 6-16 | 6-27 | 6-19 | 6-33 | 6-23 | 6-27 | 6-16 | 6-33 | 6-22 | 6-22 | 6-13 | 6-19 | 6-03 | 6-12 | 6-01 |
| | **20** | 6-18 | 6-18 | 6-21 | 6-20 | 6-25 | 6-25 | 6-19 | 6-19 | 6-25 | 6-25 | 6-14 | 6-15 | 6-08 | 6-07 | 6-04 | 6-03 |
| | **30** | 6-11 | 6-18 | 6-14 | 6-21 | 6-18 | 6-26 | 6-11 | 6-21 | 6-17 | 6-27 | 6-07 | 6-17 | 5-59 | 6-09 | 5-56 | 6-05 |

**వివిధ ప్రాంతములకు లగ్న ప్రమాణ వివరములు**

| తేది | హైద్రాబాద్ | కాంచీపురం | తిరుపతి | కర్నూలు | విజయవాడ | రాజమండ్రి | విశాఖపట్నం | కరీంనగర్ |
|---|---|---|---|---|---|---|---|---|
| | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ | గం॥ ని॥ సె॥ |
| మేషం | 01-44-24 | 01-52-04 | 01-47-12 | 01-49-49 | 01-49-18 | 01-44-48 | 01-48-03 | 01-47-49 |
| వృషభం | 02-00-00 | 02-02-17 | 02-01-36 | 02-01-06 | 02-00-50 | 02-00-24 | 02-00-11 | 02-00-03 |
| మిథునం | 02-12-24 | 02-11-18 | 02-12-00 | 02-12-00 | 02-12-07 | 02-12-24 | 02-12-25 | 02-12-28 |
| కర్కాటకం | 02-12-48 | 02-09-10 | 02-11-12 | 02-11-06 | 02-11-33 | 02-12-24 | 02-12-36 | 02-12-49 |
| సింహం | 02-07-12 | 02-02-46 | 02-04-00 | 02-05-19 | 02-05-53 | 02-06-48 | 02-07-18 | 02-07-35 |
| కన్య | 02-05-36 | 02-01-19 | 02-02-24 | 02-03-56 | 02-04-33 | 02-05-12 | 02-06-00 | 02-06-16 |
| తుల | 02-10-24 | 02-06-29 | 02-07-12 | 02-08-44 | 02-09-16 | 02-04-36 | 02-10-30 | 02-10-46 |
| వృశ్చికం | 02-14-24 | 02-11-45 | 02-12-24 | 02-12-56 | 02-13-13 | 02-14-00 | 02-13-51 | 02-13-59 |
| ధనస్సు | 02-07-12 | 02-07-12 | 02-07-36 | 02-06-40 | 02-06-32 | 02-07-12 | 02-06-14 | 02-06-11 |
| మకరం | 01-51-12 | 01-53-32 | 01-53-36 | 01-51-37 | 01-51-10 | 01-51-36 | 01-52-00 | 01-49-53 |
| కుంభం | 01-38-24 | 01-42-03 | 01-41-36 | 01-39-30 | 01-38-55 | 01-39-12 | 01-37-31 | 01-37-15 |
| మీనం | 01-36-00 | 01-39-55 | 01-39-12 | 01-37-17 | 01-36-40 | 01-36-24 | 01-35-14 | 01-34-56 |

**ఈ పంచాంగముయందు భారత కాలమానమును అనుసరించి హైద్రాబాద్ ప్రాంతమునకు లగ్నాంతకాలములు ఇవ్వబడినవి. లగ్నాంతకాలములయందు ఈ పట్టికలలో ఇచ్చిన ధృవకముల ఆధారముగా + ఉన్న కలపడము - ఉన్న తీసివేసిన ఆయా ప్రాంతములకు లగ్నాంతకాలములు వచ్చును.**

| ప్రాంతములు | లగ్నాంతకాలములకు దేశాంతర సంస్కార వివరములు | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
| | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ | ని॥ సె॥ |
| కాంచీపురం | +1-40 | +3-28 | +2-40 | -0-18 | -4-11 | -8-11 | -11-38 | -13-27 | -12-37 | -9-41 | -5-47 | -1-47 |
| తిరుపతి | +1-42 | +3-11 | +2-31 | +0-04 | -3-08 | -6-26 | -9-16 | -10-45 | -10-5 | -7-39 | -4-27 | -1-10 |
| బెంగుళూరు | +9-58 | +11-42 | +10-55 | +8-04 | +4-18 | +0-26 | -2-55 | -4-40 | -3-52 | -1-01 | +2-45 | +6-37 |
| అనంతపురం | +7-27 | +8-32 | +8-03 | +6-16 | +3-56 | +1-32 | -0-31 | -1-36 | -1-07 | +0-39 | +2-59 | +5-22 |
| కర్నూలు | +3-58 | +4-35 | +4-19 | +3-17 | +1-56 | +0-33 | -0-38 | -1-16 | -0-59 | +0-03 | +1-23 | +2-46 |
| భద్రాచలం | -10-4 | -10-11 | -10-07 | -9-57 | -9-42 | -9-26 | -9-13 | -9-06 | -9-09 | -9-20 | -9-35 | -9-51 |
| విజయనగరం | -20-51 | -21-9 | -21-0 | -20-32 | -19-53 | -19-12 | -18-38 | -18-21 | -18-29 | -18-58 | -19-36 | -20-17 |
| రాజమండ్రి | -12-37 | -12-28 | -12-32 | -12-49 | -13-10 | -13-31 | -13-49 | -14-00 | -13-55 | -13-39 | -13-18 | -12-57 |
| మచిలీపట్నం | -8-50 | -8-20 | -8-33 | -9-22 | -10-25 | -11-30 | -12-26 | -12-56 | -12-43 | -11-55 | -10-51 | -9-46 |
| విజయవాడ | -7-17 | -6-56 | -7-05 | -7-40 | -8-26 | -9-12 | -9-52 | -10-13 | -10-03 | -9-29 | -8-43 | -7-58 |
| వరంగల్ | -5-23 | -5-38 | -5-31 | -5-07 | -4-34 | -4-00 | -3-31 | -3-17 | -3-23 | -3-48 | -4-20 | -4-54 |
| కరీంనగర్ | -4-18 | -4-44 | -4-32 | -3-51 | -2-55 | -1-58 | -1-08 | -0-43 | -0-54 | -1-37 | -2-31 | -3-30 |
| అదిలాబాద్ | -3-44 | -4-40 | -4-14 | -2-42 | -0-41 | +1-24 | +3-12 | +4-08 | +3-43 | +2-11 | +0-10 | -1-56 |
| ముంబాయి | +20-5 | +19-26 | +19-44 | +20-47 | +22-11 | +23-37 | +24-52 | +25-31 | +25-13 | +24-9 | +22-46 | +21-19 |
| కొల్‌కత్త | -47-31 | -49-42 | -48-42 | -45-08 | -40-28 | -38-38 | -31-26 | -29-17 | -30-16 | -33-51 | -38-31 | -43-21 |
| న్యూఢిల్లి | -13-11 | -18-13 | -16-05 | -7-46 | +2-51 | +13-47 | +23-18 | +28-19 | +26-03 | +17-52 | +7-15 | -3-41 |

